ధర్మ్యామృతం దివ్యంగా కురిసింది. బుద్ధి పాత్రలలో నింపుకున్నాం. ఇక జుర్రడమే మిగిలి ఉంది. ధర్మ్యామృతాన్ని పానం చేసేవాడు భగవంతునికి ఇష్టు డవుతాడు. భగవంతునికి ఇష్టుడైన వానికి మోక్షం ప్రాప్తిస్తుంది. పరమేశ్వరునికి అత్యంత ప్రీతిపాత్రుడైన వానికే మోక్షం లభించకుంటే ఇంకెవరికి లభిస్తుంది?

***తస్మాత్ ఇదం ధర్మ్యామృతం ముముక్షుణా యత్నతః అనుష్ఠేయం విష్ణోః ప్రియం పరంధామ జిగమిషుణా ఇతి***

**వాక్యార్థః** - కనుక, ప్రియాతి ప్రియమైన విష్ణుపదమును పొందాలని అభిలషించే ముముక్షువు, ధర్మ్యామృత మైన పరమ భక్తిని అవశ్యము ప్రయత్న పూర్వకంగా అనుష్ఠించాలి అని వాక్యార్థం. ఆచార్యుల వారి ఈ భాష్య వాక్య సందేశముతో భక్తిని విషయముగా కలిగిన భక్తి యోగమును సమాప్తం చేస్తూ ఉన్నాను. ఇంతటితో **తత్** పదార్థ స్వరూపమైన మధ్యమ షట్కము సమాప్త మైంది.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే భక్తియోగో నామ ద్వాదశోऽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు భక్తియోగ మనే పన్నెండవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ త్రయోదశోऽధ్యాయః - పదమూడవ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగః - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

**జ్ఞానోదయం**

***అవిద్యాऽస్తమయో మోక్షః*** - అవిద్య అంతరించడమే మోక్షము. అవిద్య అంటే అజ్ఞానము. అజ్ఞానము అంతరించాలంటే జ్ఞానం కావాలి; జ్ఞానం రావాలి. వెలుగు వస్తేనే చీకటి పోతుంది. జ్ఞానం వస్తేనే అజ్ఞానం పోతుంది.

ఇంతకీ ఏమిటి ఈ అజ్ఞానము? అజ్ఞానం అనర్థదాయక మైన సంసారానికి మూలం. దుఃఖమయమైన సంసారానికి అజ్ఞానమే కారణము. కనుక అజ్ఞానమే బంధము. అజ్ఞాన నాశమే మోక్షము.

బాగుంది. అజ్ఞానము అంటే ఏమిటి? అనేది ప్రశ్న. అంతేగాని, అజ్ఞాన ప్రభావ ఫలితా లేమిటి? అనేది కాదు. దుఃఖ కారణమైన సంసారానికి హేతుభూత మైన అజ్ఞానము ఏమిటి? అనేది ఇక్కడ సూటి ప్రశ్న. దీనికి సమాధానం ఉందా, లేదా?

నా దగ్గరైతే లేదు. లేనపుడు శాస్త్రాన్ని, అందులోను సర్వశాస్త్ర సారము, మోక్ష ప్రయోజనం గల గీతా శాస్త్రాన్ని వ్యాఖ్యానించడ మెందుకు? అని మీరు ప్రశ్నించ వచ్చు. గీతా శాస్త్రాన్ని వ్యాఖ్యానించడానికి గీతకు సంబంధించిన జ్ఞానము ఉండాలి గాని, అజ్ఞానానికి సంబంధించిన జ్ఞానం కాదు. గీత చెప్పే విషయాన్ని విపులీకరించి, విస్పష్టం చేయడానికే వ్యాఖ్యానము. అంతే గాని, గీత చెప్పని దానిని చెప్పేందుకు కాదు.

గీతకు అజ్ఞానం తెలియదు. గీతలో అజ్ఞానం లేదు. గీతలో లేనిది గీతా వ్యాఖ్యానంలో ఎలా ఉంటుంది? అందుకే అంటున్నాను అజ్ఞానం అంటే ఏమిటి అనే ప్రశ్నకు నా వద్ద సమాధానం లేదని.

మరి, అజ్ఞానము లేనిదే అయితే, అజ్ఞాన నాశమే మోక్షము అనే వాక్యానికి అర్థ మేమిటి? లేనిది ఎలా నశిస్తుంది? అని మీరు తిరిగి ప్రశ్నించ వచ్చు. అజ్ఞానము లేదని ఎవ రన్నారు? అజ్ఞానము నా దగ్గర లేదు అన్నాను. గీతలో లేదు అంటున్నాను. అంతేగాని, అజ్ఞానము అనేది అసలు లేనే లేదని నేను చెప్పలేదే? మరి, అజ్ఞానము అంటే తెలిసే దెలా అంటారా? ఏమో! అది ఎవరి దగ్గరుందో వాళ్ళనే ప్రశ్నించాలి. సమాధానం వారి నుండే రాబట్టాలి.

***సా అవిద్యా కస్య ఇతి?*** ఈ అజ్ఞానం ఎవరికి సంబంధించింది? ఎవరి వద్ద ఉంది? అనే ప్రశ్నను శ్రీశంకరాచార్య స్వామి తమ భాష్యంలో ప్రస్తుత అధ్యాయం లోనే లేవ నెత్తి, **యస్య దృశ్యతే తస్యైవ** - ఎవడైతే అజ్ఞానాన్ని చూస్తున్నాడో, అజ్ఞానం అంటే ఏమిటి అని ఎవడైతే ప్రశ్నిస్తున్నాడో, వాడి దగ్గరే ఉంది అని సమాధానం కూడా అందించారు.

అజ్ఞానం అనేది ప్రమాణ విషయం కాదు. అజ్ఞానాన్ని ఎవరూ చూడ లేదు. ప్రత్యక్షాది ప్రమాణాలకు అది అందే విషయం కాదు. అందుచేత, అజ్ఞానానికి శాస్త్ర తాత్పర్యం లేదు. తెలియని దానిని తెలిపేందుకే శాస్త్రము ఉంది. అలా శాస్త్రము తెలిపే విషయం ప్రయోజనాన్ని చేకూర్చేది కూడా అయి ఉండాలి. ఇక్కడే, ఈ కారణం చేతనే శాస్త్రము ప్రమాణ మైంది.

**ప్రమాణస్య అనధిగత అబాధిత అర్థ బోధకత్వం -** ప్రమాణము అనేది తెలియని దానిని తెలుపుతుంది **(అనధిగతం).** ఆ తెలిసినది ఏదో మళ్ళీ నిషేధింప బడనిదై ఉంటుంది ***(అబాధితం).*** పైగా విషయ ప్రయోజనం ఉంటుంది **(ఫలవత్).**

అజ్ఞానము అనధిగతం కాదు. అజ్ఞానాన్ని గూర్చి మాట్లాడే వ్యక్తిలో అజ్ఞానం అనుభవ రూపంలో ఉన్నదే గాని, తెలియనిది కాదు. అజ్ఞాన విషయం వల్ల ఫలసిద్ధి, అంటే ప్రయోజనం లేదు. కనుక, జ్ఞానమే శాస్త్ర విషయం గాని, అజ్ఞానం కాదు.

సరే, అజ్ఞానాన్ని ప్రక్కన ఉంచి, జ్ఞానాన్ని గూర్చి చర్చిద్దాం. జ్ఞాన మేమిటి? దాని అర్థ మేమిటి? జ్ఞానం యొక్క తాత్పర్య మేమిటి? ***యత్ పరః శబ్దః స తదర్థః -*** శబ్దానికి ఏది తాత్పర్యమో అదే శబ్దార్థము. 'జ్ఞానము' అంటే తెలుసుకోవడము. లేదా అర్థం చేసుకోవడము. దేనిని తెలుసుకోవడము? దేనిని అర్థం చేసుకోవడము? ఏదయితే, ఉండి కూడా తెలియకుండా ఉందో, దానిని అర్థం చేసుకోవడమే జ్ఞానము ***(జ్ఞాయతే అనేన ఇతి జ్ఞానమ్).*** మానవాళికి హితమును చేకూర్చేది మోక్ష సంబంధమైన జ్ఞానమే కనుక అదే జ్ఞానానికి శాస్త్ర తాత్పర్యము.

***యేన అశ్రుతం శ్రుతం భవతి అమతం మతం అవిజ్ఞాతం విజ్ఞాతం ఇతి -*** ఏ జ్ఞానమును పొందడం వలన వినని వినింది అగుచున్నదో, ఆలోచించనిది ఆలోచించినది అగుచున్నదో, తెలియనిది తెలిసినది అగుచున్నదో అదే శాస్త్రోపదేశ తాత్పర్య మని ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక మహర్షి తన కుమారుడు, శిష్యుడు అయిన శ్వేతకేతునికి బోధించాడు. ఇదే జ్ఞానము. సత్యజ్ఞానము. పరమార్థ తత్త్వ జ్ఞానము. తెలియదగిన జ్ఞానము **(ఏతత్ జ్ఞేయం).** ఇది నశించేది కాదు. అబాధితం కనుక నిత్యము **(నిత్య మేవ).** అలాంటిది ఎక్కడో లేదు. నీ లోనే ఉంది **(ఆత్మసంస్థం).** దీని కన్నా అన్యంగా తెలియ దగింది మరొకటి లేదు ***(అతః పరం వేదితవ్యం కించిత్ న హి)*** అని నిర్ణయించింది శ్వేతాశ్వతరోపనిషత్.

ఛాందోగ్య, శ్వేతాశ్వతర ఉపనిషత్తులు నిర్ధారణ చేసిన ఈ ఉభయ వాక్యాలు మనకు ఒక పరమార్థ సత్యాన్ని ఆవిష్కరిస్తున్నాయి.

పరమార్థ వస్తువు ఒకటుంది. అది సత్యం. అబాధితం. ఆ ఒక్క దాని జ్ఞానం చేత సర్వజ్ఞానము సిద్ధిస్తుంది. ఒక్క దానిని తెలుసుకోవడం చేత, సమస్తాన్ని తెలుసుకోవడం జరుగుతూ ఉంది అంటే, సమస్తంగా ఉన్నది ఆ ఒక్కటే అని నిస్సందేహంగా తేలి పోయింది. కనుక దానిని తెలుసుకున్న వాడు మరొక దానిని తెలుసుకో నవసరం లేదు. అదే ఆత్మ. తెలుసుకొనే వాడి స్వరూపము. దీనినే భగవద్గీత లోని ప్రథమ షట్కము అనే మొదటి ఆరు అధ్యాయాలలో మనం 'త్వం' పదార్థ శోధనం ద్వారా తెలుసుకున్నాం.

**తత్పదార్థ శోధనము**

ఏడవ అధ్యాయం నుండి పన్నెండవ అధ్యాయం వరకు గల ద్వితీయ షట్కములో పరమేశ్వరుని తత్త్వమును గూర్చి ముచ్చటించు కున్నాం. సృష్టి జ్ఞానమయంగా ఉంది అని అర్థం చేసుకున్నాం. నియతి రూపంలో ఉన్నది నియంతే నని తెలుసుకున్నాం. సృష్టి స్థితి లయా లన్నీ సృష్టికర్త అధీనం లోనే ఉన్నాయని, సృష్టిలో జ్ఞాన రూపంలో పరమేశ్వరుడే ఉన్నాడని, సృష్టిలో ఉన్నదంతా తానే నని, తాను లేకుండా సృష్టి ఉండలేదని, కాని సృష్టి లేక పోయినా తాను ఉంటాడని - అద్భుతమైన అద్వైత జ్ఞానాన్ని ఏడు, ఎనిమిది, తొమ్మిది అధ్యాయాలలో వంట బట్టించుకున్నాం.

మట్టి పాత్రలలో మట్టే ఉంది, మరొకటి లేదు. మట్టి యొక్క వ్యక్త రూపాలే మట్టిపాత్రలు. మట్టి





లేకుండా మట్టిపాత్రలు ఉండ లేవు. కాని, మట్టిపాత్రలు లేకున్నా మట్టి ఉంటుంది. సృష్టి లేకపోయినా ఈశ్వరుడు ఉంటాడు. ఈశ్వరుని వ్యక్త రూపమే సృష్టి. సృష్టి యొక్క అవ్యక్త స్వరూపము పరమేశ్వరుడే. కనుక సృష్టి యొక్క అర్థం సృష్టిలో లేదు, సృష్టికర్తలో ఉంది అనే తాత్త్విక రహస్యాన్ని కూడా రాజగుహ్యంగా అర్థం చేసుకున్నాం.

ఈశ్వర జ్ఞానమే సృష్టిలో నియతిగా గోచరిస్తూ ఉంది. నియతి విశ్వంలో కనిపించినా, వ్యక్తిలో అగుపించినా, అదంతా ఈశ్వర జ్ఞానమే. విశ్వము విశ్వేశ్వరుని కన్నా వేరుగా లేదని తొమ్మిది, పది, పదకొండవ అధ్యాయాలలో సుస్పష్ట మైంది.

***భూతాని విష్ణుః ; భువనాని విష్ణుః -*** లోకు లందరూ విష్ణువే ; లోకాలన్నీ విష్ణువే. అంతా విష్ణుమయమే ***(సర్వం విష్ణుమయం జగత్).*** సర్వమూ వాసుదేవుడే ***(వాసుదేవః సర్వమితి... గీ. 7 - 19).*** ఇదంతా భగవద్గీత - ద్వితీయ షట్కములో 'తత్' పదార్థ శోధనము ద్వారా స్పష్ట మైంది. బాహ్యాభ్యంతరాలలో జ్ఞానరూపంలో పరమేశ్వరుడే శోభిస్తున్నాడు. అందువల్ల విశ్వానికి విశ్వేశ్వరునికి అభేదమే దర్శనీయ మైంది. విశ్వము విశ్వేశ్వరుని కన్నా వేరు కాదని 'తత్' పద నిర్దేశము నిర్ణయించి నపుడు, విశ్వంలో ఉన్న వ్యక్తి విశ్వేశ్వరుని కన్నా వేరుగా ఉండ గలడా? ఈశ్వర జగత్తుల మధ్య భేదం లేనపుడు, జీవేశ్వరుల మధ్య భేదం ఉండ గలదా? ఉండ లేదు. ఇది అర్థమైతే, జీవేశ్వరుల మధ్య అభేదమే దర్శనీయ మవుతుంది. అద్వైతమే అనుభూత మవుతుంది. ఈ విధమైన అద్వైత జ్ఞానోదయానికి ఇప్పుడు 'తత్త్వమసి' మహావాక్యం లోని 'అసి' పద నిర్దేశం జరగ వలసి ఉంది. ఆ కార్యం లోనే మూడవ షట్కము లోని ప్రథమాధ్యాయము, భగవద్గీత లోని పదమూడవ అధ్యాయము అయిన క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము కళకళ లాడుతూ కళ్ళ ముందు ప్రత్యక్ష మవుతూ ఉంది.

**అసి పదార్థ శోధనము**

***తత్త్వమసి'*** మహావాక్యానికి విపుల వ్యాఖ్యానమే భగవద్గీత అని మనం ముందే చెప్పుకున్నాం. ***తత్ - త్వం - అసి*** అనే ఈ మూడు పవిత్ర పదాలను గీత లోని మూడు షట్కాలు విపులంగా నిర్దేశిస్తూ, నిర్ణయించాయి. మొదటి ఆరు అధ్యాయాలు గల ప్రథమ షట్కంలో ***త్వం*** పద నిర్దేశం జరిగింది. రెండవ ఆరు అధ్యాయాలు గల ద్వితీయ షట్కంలో ***తత్*** పద నిర్దేశం జరిగింది. ఇక ***తత్ - త్వం*** ఒక్కటే అనేది నిర్దేశింప బడాలి. అది జరిగితే, ***తత్త్వమేవ*** అనే అఖండార్థ వాక్యం అనుభూత మవుతుంది. అది జరగాలి అంటే, ***అసి*** పద నిర్దేశమే తక్షణ కర్తవ్యం. ఆ కార్యమే చివరి ఆరు అధ్యాయాలు గల మూడవ షట్కంలో జరుగుతూ ఉంది. ***అసి*** పదార్థ శోధనమే చివరి షట్కము యొక్క కేంద్ర విషయము. ఈ మహాకార్యంలో పదమూడవ అధ్యాయం, క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము తెర తొలగించి మనచే ద్వార దర్శనం చేయిస్తూ ఉంది. ***సర్వ మిద మహం చ బ్రహ్మైవ -*** ఈ సమస్త విశ్వము మరియు నేను, బ్రహ్మము కన్నా అన్యంగా లేము, బ్రహ్మము అయ్యే ఉన్నాము అనే అఖండ రూప బ్రహ్మాత్మజ్ఞానాన్ని ప్రసాదించడానికి దర్శన మిస్తూ ఉంది.

***దృశ్యా భావే విముచ్యతే -*** దృశ్యము లేక పోవడమే విముక్తి కనుక, క్షేత్ర క్షేత్రజ్ఞుల వివేచనము ద్వారా క్షేత్రజ్ఞుడైన ఆత్మకు బ్రహ్మ సంబంధమును అద్వయంగా నిర్ధారణ చేయ వలసి ఉంది. అది ఈ చరమ షట్కము లోని ప్రథమాధ్యాయము, గీత లోని త్రయోదశాధ్యాయ మైన క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగంలో నిర్ణయింప బడుతుంది.

వేదము మూడు కాండలతో శోభిస్తూ ఉంది ***(కాండ త్రయాత్మకం వేదం).*** సర్వవేద, వేదాంత సారభూత మైన భగవద్గీత కూడా షట్కత్రయంతో కాండ త్రయాత్మకంగా శోభిస్తోంది. త్రివేణీ మోక్ష తీర్థంలా భాసిస్తోంది.

వాక్యార్థ నిశ్చయంతో వ్యక్తులను వాసుదేవ స్వరూపంగా తీర్చి దిద్దుతూ ఉంది. ముముక్షువులను మోక్షరూపులుగా ముక్తి సింహాసనం పై కూర్చోబెట్టి, **త్వం బ్రహ్మాసి** - నీవు బ్రహ్మమే అయి ఉన్నావు (మహానారాయణోపనిషత్); **విముక్తశ్చ విముక్తయే** - ముక్తుడవే ముక్తుడ వయ్యావు (ముండకోపనిషత్) అంటూ మంగళాశాసనం వినిపిస్తూ ఉంది.

**పదమూడవ అధ్యాయము**

ఈ అధ్యాయాన్ని క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము అంటారు. ఏడవ అధ్యాయంలో ఈశ్వరుని ప్రకృతులు రెండుగా సూచింప బడ్డాయి. ఒకటి అపరా ప్రకృతి. రెండవది పరా ప్రకృతి.

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము - ఇవే ఎనిమిది విధాలుగా విభజింప బడిన ఈశ్వరుని అపరా ప్రకృతి. దీనినే స్వభావ ప్రకృతి అని కూడా అంటారు.

అపరా ప్రకృతి త్రిగుణాత్మక మైంది. మాయామయ మైంది. అష్టవిధ ప్రకృతిగా తెలుస్తున్న ఈ అపరా ప్రకృతి సంసార హేతుభూతము.

రెండవది అయిన పరా ప్రకృతి జీవభూత మైనది. కనుక, అది ఈశ్వరాత్మకము. ఈ అపరాపరా ప్రకృతుల వలననే సర్వభూతాలు, సృష్టి ఏర్పడింది (7 వ అ - 7 వ శ్లో). ఈ ప్రకృతి ద్వయమే క్షేత్ర క్షేత్రజ్ఞ స్వరూపము.

ఈ ఉభయ ప్రకృతులతో ఈశ్వరుడు జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకు కారణ మవుతున్నాడు. కనుక, క్షేత్ర క్షేత్రజ్ఞ లక్షణమైన ఈ ప్రకృతి ద్వయాన్ని నిరూపించడం ద్వారా ఈశ్వర తత్త్వాన్ని నిర్ధారణ చేయవచ్చు. అందుకొరకే ఈ క్షేత్రాధ్యాయం ప్రారంభ మవుతూ ఉంది (**క్షేత్ర క్షేత్రజ్ఞ లక్షణ ప్రకృతి ద్వయ నిరూపణ ద్వారేణ తద్వతః ఈశ్వరస్య తత్త్వ నిర్ధారణార్థం క్షేత్రాధ్యాయః ఆరభ్యతే !**).

పంచ మహాభూతాల నుండి మన దేహేంద్రియ మనోబుద్ధుల వరకు ఏదైతే మన జ్ఞానానికి అందుతూ ఉందో, అట్టి జడరూపమైన అపరా ప్రకృతి క్షేత్రము. దీనిని గ్రహించే చైతన్య రూపుడే క్షేత్రజ్ఞుడు.

ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వభావ స్వరూపాలను వివరించి, వివేచనం చేసి, అఖండాత్మ తత్త్వంలో ఈ రెండూ వేరు కావని, ఒకే తత్త్వమని నిరూపించడం చేత, **అసి** పద నిర్దేశం జరిగి ఈశ్వర తత్త్వజ్ఞానం సిద్ధిస్తుంది. క్షేత్ర క్షేత్రజ్ఞులను వేరు వేరుగా చూడటం కాకుండా, ఒకే అఖండాత్మ స్వరూపంగా దర్శించడం జరుగుతుంది.

ఇక్కడ కీలకమైన అంశం ఒకటుంది. దానిని కూడా అర్థం చేసుకొని అధ్యాయం లోకి ప్రవేశిద్దాం. క్షేత్ర క్షేత్రజ్ఞులను అఖండాత్మ స్వరూపంలో ఒకే తత్త్వంగా దర్శించడం అంటే, క్షేత్రాన్ని క్షేత్రజ్ఞుడుగా దర్శించాలా? లేక, క్షేత్రజ్ఞుణ్ణి క్షేత్రంగా దర్శించాలా? ఇది చాలా సూక్ష్మమైన ప్రధానాంశము.

క్షేత్రమును క్షేత్రజ్ఞునిగా దర్శించాలి. అంతేగాని, క్షేత్రజ్ఞుణ్ణి క్షేత్రంగా దర్శించ కూడదు. క్షేత్రమును క్షేత్రజ్ఞునిగా దర్శించడము అఖండాత్మ దర్శనానికి దారి తీసి మోక్ష హేతువు అవుతుంది. క్షేత్రజ్ఞుని క్షేత్రంగా దర్శిస్తే అది బంధ హేతువు అవుతుంది. అనాత్మ అయిన క్షేత్రము నందు 'నేను' అనే ఆత్మబుద్ధి బంధానికి కారణ మవుతుంది. ఇదే అజ్ఞానము (**అనాత్మని అహ మితి మతిః బంధః అజ్ఞానేన ప్రాప్తః**).

అసలు ఇప్పుడు మనం చేస్తున్నది అదే కదా! 'నేను దేహము' అంటున్నామా లేదా? ఈ మాట పలికించ డానికి శాస్త్ర మెందుకు? కనుక క్షేత్రము క్షేత్రజ్ఞుడే; కాని, క్షేత్రజ్ఞుడు క్షేత్రము కాదు అని చెప్పడానికే శాస్త్రము. సర్పము రజ్జువే; కాని, రజ్జువు సర్పము కాదు అని నిర్ణయించేదే జ్ఞానము. ఈ జ్ఞానము ప్రస్తుతం మనకు లేదు.





మరి, ఏముంది? జ్ఞానము లేదు అనేది ఉంది. ఇదే అజ్ఞానము. శాస్త్రంలో లేనిది. వ్యక్తిలో ఉన్నది. జ్ఞానము ద్వారా అజ్ఞానం నశిస్తుంది. బంధహేతువైన అజ్ఞానం నశిస్తే మోక్షము సిద్ధిస్తుంది. ఈ విధంగా జ్ఞానం మోక్ష హేతువై ఉంది (**జ్ఞానాత్ మోక్షా ఇతి**). ఈ జ్ఞానాన్నే ప్రస్తుత అధ్యాయం వితరణ చేస్తుంది.

ఇది జ్ఞాన ప్రధానమైన అధ్యాయము. సులువైనది కాదు గాని, చాలా విలువైన అధ్యాయము. విశిష్టమైన అధ్యాయము. అద్వైతాచార్యులను అమితంగా ఆకర్షించిన అద్భుతమైన అధ్యాయము. ఇక చదవండి.

**అర్జున ఉవాచ :**

**ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ।**
**ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥**

*ప్రకృతిం-పురుషం-చ-ఏవ-క్షేత్రం-క్షేత్రజ్ఞం-ఏవ-చ*
*ఏతత్-వేదితుం-ఇచ్ఛామి-జ్ఞానం-జ్ఞేయం-చ-కేశవ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కేశవ | = | కృష్ణా! | జ్ఞానం | = | జ్ఞానమును |
| ప్రకృతిం | = | ప్రకృతిని | జ్ఞేయం చ | = | జ్ఞేయమును |
| పురుషం చ ఏవ | = | పురుషుని | ఏతత్ | = | దీనిని |
| క్షేత్రం | = | క్షేత్రమును | వేదితుం | = | తెలిసికొనుటకు |
| క్షేత్రజ్ఞం ఏవ చ | = | క్షేత్రజ్ఞుని | ఇచ్ఛామి | = | అభిషిస్తున్నాను |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**కేశవా! ప్రకృతి, పురుషులు అంటే ఏమిటి? క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అంటే ఏమిటి? జ్ఞానము, జ్ఞేయము అంటే ఏమిటి? కృష్ణా! వీటిని తెలుసుకోవాలని ఉంది.**

**వ్యాఖ్య**

క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము లోని ఈ ఆరంభ శ్లోకము గీతలో ఉందా? లేక ప్రక్షిప్తమా? అనే మీమాంస ఉంది. అందుచేత ఈ శ్లోకము కొన్ని ప్రతులలో కనిపిస్తుంది. కొన్ని ప్రతులలో అగుపించదు. ఈ శ్లోకాన్ని కలుపుకుంటే గీత శ్లోక సంఖ్య ఏడు వందల ఒకటి అవుతుంది. కాని, వ్యాస వచనానుసారం ఏడువందల శ్లోకాల గ్రంథం గానే భగవద్గీత సంప్రదాయ సమ్మతంగా ఉంది. శ్రీ శంకరాచార్య స్వామి వారి గీతా భాష్యంలో ఈ శ్లోకం అగుపించదు. కనుక, శ్లోక సంఖ్య లేకుండా ఈ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తున్నాను.

మరి, ఈ శ్లోక రచయిత ఆనందగిరియా? లేక మధుసూదన సరస్వతియా? అనే మీమాంసను ప్రక్కన పెట్టి, శ్లోకం ప్రక్షిప్తమే అయినా, గహన మైన అధ్యాయ విషయాన్ని విభజించి సులభతరం చేసి చూపిస్తూ ఉంది కనుక, జిజ్ఞాసువులకు చక్కగా ఉపకరిస్తుందని భావించి వ్యాఖ్యానిస్తున్నాను.

ప్రధానంగా మూడు విషయాలను తెలుసుకోవాలని ఆశించి అర్జునుడు ఈ శ్లోకంలో ప్రశ్నించడం జరిగింది. ప్రశ్నలో మూడు విషయాలుగా తెలుస్తున్నా, అవి ఆరు అంశాలుగా కనిపిస్తున్నాయి.

**(1)** ప్రకృతి పురుషులు **(2)** క్షేత్ర క్షేత్రజ్ఞులు **(3)** జ్ఞాన జ్ఞేయాలు. ఇలా ఆరు అంశాలతో కూడిన మూడు జంట విషయాలను ప్రవేశ పెట్టి అర్జునుడు ప్రశ్నిస్తున్నాడు. ఈ మూడు జంట విషయాలకు సమాధానమే పదమూడవ అధ్యాయము.

కాకపోతే, అర్జునుని ప్రశ్న పరంపరా క్రమము, భగవానుని సమాధాన పరంపరా క్రమము ముందు వెనుకలుగా ఉంటాయి. ఇలా ఉండటము వెనుక ప్రవచన ప్రాధాన్యతా క్రమమే స్పష్టంగా కనిపిస్తూ ఉంది.

అర్జునుని ప్రశ్నలో ప్రకృతి పురుషులు, క్షేత్ర క్షేత్రజ్ఞులు, జ్ఞాన జ్ఞేయములు అనేది క్రమము. భగవంతుని సమాధానంలో మొదట క్షేత్ర క్షేత్రజ్ఞులు ( *1 నుండి 6 వ శ్లో వరకు*), తరువాత జ్ఞాన జ్ఞేయములు *(7 నుండి* 18వ శ్లోకం వరకు) చివరగా ప్రకృతి పురుషులు *(19 వ శ్లోకం నుండి చివరిదైన 34 వ శ్లోకం వరకు)* క్రమంగా చెప్పబడ్డారు.

మూడు విషయాలలో ఆరు అంశాలను ప్రస్తావించి పార్థుడు ప్రశ్నించినట్లు బాహ్యానికి కనిపిస్తున్నా, విషయ ప్రధానంగా చూస్తే రెండే ఉన్నట్లు అగుపిస్తున్నాయి. ఒక విధంగా చెప్పాలంటే, అధ్యాయ నామాన్ని ధృవీకరిస్తూ కేవలం క్షేత్ర క్షేత్రజ్ఞులే ప్రస్తావించ బడ్డారు అనిపిస్తుంది.

ప్రకృతి అన్నా, క్షేత్ర మన్నా ఒక్కటే. పురుషుడన్నా, క్షేత్రజ్ఞుడన్నా, జ్ఞేయమన్నా ఒక్కటే. అంటే మొదటి రెండు క్షేత్రము. తరువాత మూడు క్షేత్రజ్ఞుడు. ఇక జ్ఞానం అనేది ఒక్కటే మిగిలి ఉంది.

జ్ఞేయము అనేది జ్ఞానం వల్లనే తెలియ బడుతుంది. కనుక జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాన గమ్యము ఆత్మ స్వరూపమే **(జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్** *- 13 వ అ - 17 వ శ్లో*). కనుక అమానిత్వాది జ్ఞాన విషయం కూడా క్షేత్రజ్ఞుని స్వరూపం గానే తెలుస్తుంది. ఈ విధంగా మూడు విషయాలుగా అర్జునుడు ప్రస్తావించిన ఆరు అంశాలలో రెండే ప్రధానంగా తెలుస్తున్నాయి. అవి, ఒకటి క్షేత్రము. రెండవది క్షేత్రజ్ఞుడు.

*భగవంతుడు చెబుతున్నాడు.*

**శ్రీ భగవానువాచ :**

ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మి త్యభిధీయతే ।
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 1

*ఇదం-శరీరం-కౌంతేయ-క్షేత్రం-ఇతి-అభిధీయతే*
*ఏతత్-యః-వేత్తి-తం-ప్రాహుః-క్షేత్రజ్ఞః-ఇతి-తద్విదః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! | వేత్తి | = | తెలుసుకుంటాడో |
| ఇదం | = | ఈ | తం | = | వానిని |
| శరీరం | = | శరీరము | క్షేత్రజ్ఞః | = | క్షేత్రజ్ఞుడు |
| క్షేత్రం ఇతి | = | క్షేత్రమని | ఇతి | = | అని |
| అభిధీయతే | = | చెప్పబడుతుంది | తత్ విదః | = | అది తెలిసిన వారు |
| ఏతత్ | = | క్షేత్రమును | ప్రాహుః | = | చెబుతారు |
| యః | = | ఎవ్వడు | | | |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**కౌంతేయా! ఈ శరీరము క్షేత్రము. దీనిని తెలుసుకొనే వాడు క్షేత్రజ్ఞుడు అని క్షేత్ర క్షేత్రజ్ఞులను గూర్చి తెలిసిన వారు చెబుతున్నారు.**

**వ్యాఖ్య**

ఈ శరీరము క్షేత్రము **(ఇదం శరీరం క్షేత్రమ్)**. ఇదం (ఇది) అనే సర్వనామము చేత శరీరము క్షేత్రముగా





చెప్పబడింది. 'ఇది' అంటే దృశ్యము, లేదా విషయము. అంటే తెలియబడేది. తెలియబడే సమస్త దృశ్యజాతము 'ఇదం' శబ్ద ప్రత్యయార్థంగా తెలుస్తూ ఉంది.

దేశకాలాలలో దూరంగా ఉండే దానిని 'అది' అంటాము ***(తత్)***. దేశకాలాలలో దూరంగా లేనిది, మన కన్నా అన్యమైనది, అత్యంత సమీపంగా ఉన్న దానిని 'ఇది' ***(ఇదం)*** అంటాము. ప్రస్తుతం 'ఇది' అని చెప్పబడుతున్నది శరీరము ***(ఇదం శరీరం)***. శరీరానికి ***క్షేత్రం*** అని భగవంతుడు నూతన నామకరణం చేశాడు.

**క్షేత్రము**

***క్షత త్రాణాత్, క్షయాత్, క్షరణాత్, క్షేత్రవద్వా అస్మిన్ కర్మఫల నిర్వృత్తేః క్షేత్రమ్ ఇతి*** - ఆపద నుండి రక్షించేది, నశించే స్వభావం కలది, జీర్ణమయ్యే లక్షణం కలది, బీజ ప్రరోహ స్థానమైన పొలము లాగా కర్మఫలమును పండించే కర్మబీజ ప్రరోహమునకు భూమిక వంటిది క్షేత్రము. అదే మన శరీరము అని శ్రీశంకరులు.

జీవుణ్ణి కవచం లాగా కాపాడుతూ ఉంది కనుక శరీరాన్ని క్షేత్రము అంటారు ***(క్షత త్రాణాత్ క్షేత్రం)***. వృద్ధి క్షయాలన్నీ ఇందు లోనే జరుగుతాయి. వికారయుత మైన శరీరము క్షయ ధర్మం కలది. క్షీణ స్వభావం కలిగి నశిస్తుంది ***(క్షయాత్ క్షరణాత్)***. శ్మశానంలో ఒకనాడు కట్టెలలో కట్టెగా కలిసి దగ్ధమై పోతుంది. అందుకే దహన యోగ్యమైన శరీరాన్ని దేహం అన్నారు.

శరీరము క్షీణించే స్వభావం కలది కనుక ***(శీర్యమాణ స్వభావం శరీరమ్)*** ఎప్పుడూ ఒక విధంగా ఉండక, ఉండ లేక మార్పు చెందుతూ ఉంటుంది ***(అనియత స్వభావః)***. పరిణామశీల మైన క్షేత్ర మనే శరీరము కాలంలో వృద్ధాప్యమును, ఆ తరువాత మరణాన్ని పొంది దహన యోగ్య మవుతుంది.

వెలిగే దీప శిఖ తనంతట తాను స్వయంగా కాంతిహీనమై ఆరి పోతుంది. చలించే దేహము కూడా తనకు తానుగా కాలంలో కరిగి కాష్ఠంలో కాలి పోతుంది.

*చరణము:* **వెలిగే దీపము ఈ క్షణము**
**ఆరి పోవును మరు క్షణము**
**ఆడే ప్రాణము క్షణక్షణము**
**ఆగి పోతే తుది క్షణము**
**నిగ నిగ లాడే శరీరము**
**మట్టికి మణిహారము**
*పల్లవి:* **మనసా! తెలుసా!**
**సాగ సుందదు కలకాలము**
*అనుపల్లవి:* **గాలి ఒక చోట నిలుచునా?**
**వయసైనా అంతేలే** **॥ మనసా ॥**

అని క్షేత్ర క్షయాన్ని కళ్ళ ముందు పరచింది చైతన్య గీతిక.

క్షీణించే, నశించే స్వభావము కలిగినదే అయినా, దేహము వినియోగము, ఉపయోగము లేనిది కాదు. పొలము ఎలాగైతే బీజ ప్రరోహ స్థానమో, శరీర క్షేత్రము కూడా అలాగే కర్మ బీజ ప్రరోహ స్థానంగా ఉంది. ధర్మబీజ ప్రరోహ భూమికగా ఉంది. జ్ఞానబీజ ప్రరోహ క్షేత్రంగా ఉంది ***(క్షేత్రవద్వా అస్మిన్ కర్మఫల నిర్వృత్తేః క్షేత్రమ్)***.

క్షేత్రము అంటే పొలము అని కూడా అర్థం. పొలంలో విత్తనాలు చల్లి పంటలు ఎలా పండించు కుంటామో, అలాగే ఈ శరీర క్షేత్రంలో కర్మఫలాలు పండించుకో వచ్చు. పుణ్యబీజాలు నాటి పుణ్యఫలాలు అందుకోవచ్చు. పాపబీజాలు నాటి పాపఫలాలు పొందవచ్చు. జ్ఞానబీజాలు చల్లి జ్ఞానపంట పండించుకొని మోక్షఫలాన్ని అనుభవించ వచ్చు.

పొలము ఎలా జడమో, దేహము కూడా అలాగే జడము. పొలము ఎలాగైతే దృశ్యంగా కనిపిస్తూ ఉందో, దేహం కూడా అలాగే దృశ్య రూపంగా గోచరిస్తూ ఉంది. దృశ్యమైన జడరూప పొలంలో పంటలు పండినట్లు, దృశ్యమైన జడరూప శరీర క్షేత్రంలో కర్మ పంటలు, ధర్మ పంటలు, జ్ఞాన పంటలు పండుతాయి. అందుచేతనే, దహన యోగ్యమైన దైనా, దేహం ధర్మక్షేత్రంగా శోభిస్తూ ఉంది. భగవద్గీత ఆరంభ శ్లోకం లోనే ధర్మక్షేత్రము, కురుక్షేత్రము అంటూ క్షేత్ర మనే పదాన్ని మనకు పరిచయం చేసింది.

పొలంలో మనం పంటలు పండించుకో వచ్చు. పొలాన్ని మనం తయారు చేయలేదు. అది మనకు ప్రసాదించ బడింది ***(దత్తం)***. దేహ మనే ఈ క్షేత్రం కూడా మనకు ప్రసాదించ బడింది. ఇల్లు మనం కట్టుకొని నివసించినట్లు, దేహాన్ని పరమేశ్వరుడు నిర్మించుకొని, అందులో క్షేత్రజ్ఞ రూపంలో కొలువై ఉన్నాడు. పరమేశ్వరుడు కొలువై ఉన్నాడు కనుక, కాయము కోవెల అయింది. దేహము దేవాలయ మైంది. జీవుడు ఆ దేవాలయంలో దేవుడుగా కొలువై ఉన్నాడు ***(దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవః సనాతనః)***.

మనం నిర్మించే దేవాలయం చలన రహితంగా ఉంటుంది. పరమేశ్వరుడు తన కొరకు తాను నిర్మించుకున్న ఈ దేహ మనే ఆలయం చలన శీలమైంది. అది కదిలే దేవాలయం. కదలని వానిని లోన ఉంచుకొని, కళాత్మకంగా కదిలే మందిరమే మానవ దేహము.

పుణ్య ప్రదేశాలను పుణ్య క్షేత్రాలు అంటాము. పుణ్య నదులను తీర్థ క్షేత్రాలు అంటాము. ఏ పవిత్రాత్ముని కారణంగా కాశీ, రామేశ్వరం, బదరీ, శ్రీశైలం పుణ్యక్షేత్రా లయ్యాయో, ఏ దివ్యాత్ముని స్మరణములో గంగా యమునలు, కృష్ణా గోదావరీ చంద్రభాగాలు తీర్థ క్షేత్రాలుగా శోభిస్తున్నాయో, ఆ పరమేశ్వరుని సన్నిధి మాత్రేణ మానవ దేహం ధర్మక్షేత్రంగా శోభిస్తూ ఉంది. ధర్మ బీజానికి ప్రరోహ స్థానమై, ధర్మఫలాలను అందించడానికి సిద్ధంగా ఉంది. జ్ఞాన బీజ ప్రరోహ భూమికయై మోక్ష ఫలాన్ని ప్రసాదించడానికి దివ్యంగా అలరారుతోంది.

**క్షేత్రజ్ఞుడు**

నశించే శరీరము క్షేత్రము ***(క్షీయతే ఇతి క్షేత్రమ్ శరీరమ్)***. దానిని తెలుసుకొనే వాడు క్షేత్రజ్ఞుడు ***(తజ్జానాతీతి క్షేత్రజ్ఞః)***.

వేదాంత శాస్త్రము నందు రెండు పదాలు ప్రధాన మైనవి. ఒకటి 'ఇది' ***(ఇదం)*** కాగా, రెండవది 'నేను' ***(అహం)***. తెలియబడేది, తెలుసుకొనే శక్తి లేనిది 'ఇది'గా పిలువబడే జ్ఞేయము. ఏది జ్ఞేయమో అది జడము ***(యత్ జ్ఞేయం తత్ జడం)***. అదే దృశ్యము. శరీరము కూడా దృశ్యమే, జడమే, జ్ఞేయమే. జడమైన, జ్ఞేయమైన ఈ శరీరాన్ని ఆపాదమస్తకము దృశ్యముగా ఎవడు తెలుసు కుంటున్నాడో, అతడు క్షేత్రజ్ఞుడు. బాహ్యాభ్యంతరాలలో దృశ్య జాతంగా తెలిసే 'ఇదం' శబ్ద దృశ్య విషయమును 'అహం' ప్రత్యయార్థ స్వరూపుడై తెలుసుకొనే వాడు. అనాత్మ మైన క్షేత్రాన్ని తెలుసుకొనే ఆత్మ స్వరూపుడే క్షేత్రజ్ఞుడు. సర్వ దృశ్య విలక్షణ స్వరూపుడు.

**అయం ఘటః** - ఇది కుండ. **అయం పటః** - ఇది వస్త్రము - అని దృశ్య జాతాన్ని తన కన్నా వేరుగా ఉన్నట్లు ఎలా తెలుసుకుంటున్నాడో అలాగే శరీరమును, వేరు వేరుగా శరీరాంగములను తెలుసుకొనే వాడు క్షేత్రజ్ఞుడు.





నేత్రము రూపాన్ని చూడవచ్చు. రూపము దృశ్యముగా ఉన్నందున, దానిని చూచే నేత్రము ద్రష్ట కనుక, నేత్రము క్షేత్రజ్ఞుడు అని భావించ వచ్చు. కాని, నేత్ర దృష్టి లోపించి ఉంది అని నేత్రాన్ని తెలుసుకుంటున్న జ్ఞాత ***(చక్షుషో ద్రష్టా)*** మాత్రం నేత్రం కాదు. అలాగే వాక్కునకు ద్రష్ట, మనస్సునకు ద్రష్ట, అజ్ఞానమునకు ద్రష్ట, సర్వమునకు ద్రష్ట ***(సర్వస్య ద్రష్టా)*** ఎవడో అతడే జ్ఞాత లేక క్షేత్రజ్ఞుడు.

నా కాలు నొప్పిగా ఉంది ***(పాదే మే వేదనా)***, నా మనస్సు హాయిగా, సుఖంగా ఉంది ***(మనసి మే సుఖమ్)*** అని దేహేంద్రియ మనస్సుల లోని సుఖదుఃఖాలను తెలుసుకొనే జ్ఞాత అలా తెలియబడే దృశ్య జాతము కన్నా అన్యంగా ఉన్నాడు కదా! అతడే క్షేత్రజ్ఞుడు. ప్రపంచము ఉన్నా, సూర్యుడు లేని క్షణాన జగత్తు ఎలా అంధకార బంధుర మవుతూ ఉందో, క్షేత్రజ్ఞుడు లేనపుడు క్షేత్రము యొక్క పరిస్థితి కూడా అలాగే ఉంటుంది. జగదాంధ్యంలో వెలుపలి దృశ్య విషయాలు తెలియనట్లు, క్షేత్రజ్ఞుడు లేకపోతే బాహ్య విషయాలే గాక, శరీరాంగముల చేష్టలు, మనస్సు లోని సుఖదుఃఖాది వృత్తులు కూడా తెలిసే అవకాశము లేదు.

జాగ్రదవస్థలో దృశ్య జాతమును గ్రహించే జ్ఞాతగా తెలుస్తున్న క్షేత్రజ్ఞుడు, స్వప్నద్రష్టగా, నిద్రకు సాక్షిగా కూడా ఉన్నాడు. అవస్థాత్రయాన్ని కూడా తెలుసుకుంటున్న తాను వాటికి సాక్షియై ఉన్నాడు ***(తేభ్యో విలక్షణః సాక్షీ)***. అతడే క్షేత్రజ్ఞుడు.

**తద్విదులు**

ఈ విధంగా క్షేత్ర క్షేత్రజ్ఞులను ఎవడు తెలుసుకుంటాడో ***(వేత్తి)***, అతడే సత్యాన్ని తెలుసుకున్న వాడు అని క్షేత్ర క్షేత్రజ్ఞుల యదార్థ జ్ఞానాన్ని కలిగిన వారు ***(తద్విదః)*** చెబుతారు.

క్షేత్రజ్ఞ స్వరూపాన్ని తెలుసుకోవడం సులభ సాధ్యమైన కార్యం కాదు. ఈ విషయాన్ని మున్ముందు మనమెంత గానో చెప్పుకోబోతాం. కేవలం దేహాన్ని తెలుసు కుంటున్నంత మాత్రాన, క్షేత్రాన్ని తెలుసు కుంటున్నాడు కనుక క్షేత్రజ్ఞుడు అని చెప్పడానికి అవకాశం లేదు.

కుక్క పిల్లి శరీరాన్ని చూస్తూ ఉంది. కుక్కకు క్షేత్రజ్ఞత్వం సంభవిస్తుందా? అదలా ఉంచండి. మనోబుద్ధులు లేవు కనుక వాటి విషయాన్ని ప్రక్కన పెడదాం. సాధారణ మనిషి విషయానికి వస్తే, మరొక మనిషి శరీరాన్ని చూడటమే గాక, తన శరీరాన్ని, తన శరీరాంగాలను విడివిడిగా ***(విభాగశః)*** తెలుసుకుంటున్నాడు కనుక అతనికి క్షేత్రజ్ఞత్వం ప్రాప్తిస్తూ ఉందా? లేదు. తాను దేహమును తెలుసుకుంటున్నా, మనస్సును తెలుసుకుంటున్నా, తనను దేహేంద్రియ మనోబుద్ధుల సంఘాతంగా ఊహించుకుంటున్నాడే గాని, దృశ్య జాతమును విషయీకరించుకొని, తాను వాటికి విలక్షణంగా ఉన్న 'విషయి' ***(జ్ఞాత)*** అని గ్రహించలేక పోతున్నాడు. అలా గ్రహించాలి అంటే అది ఔపదేశికం గానే సాధ్య పడాలి. ఉపదేశం వల్ల ప్రాప్తించేదే ఔపదేశికము. శాస్త్ర, సద్గురోపదేశం ద్వారా ప్రాప్తించే జ్ఞానము ఔపదేశిక జ్ఞానము. అట్టి సాంప్రదాయక బోధ అంది నపుడే క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంబంధించిన జ్ఞానము సుస్పష్టమై, సుదృఢ మవుతుంది.

*ఆ ప్రయత్నమే ఆరంభ మవుతూ ఉంది.*

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్త జ్జ్ఞానం మతం మమ ॥** 2

***క్షేత్రజ్ఞం-చ-అపి-మాం-విద్ధి-సర్వక్షేత్రేషు-భారత***
***క్షేత్ర క్షేత్రజ్ఞయోః-జ్ఞానం-యత్-తత్-జ్ఞానం-మతం-మమ***

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా! | జ్ఞానం | = జ్ఞానము |
| సర్వక్షేత్రేషు | = సర్వక్షేత్రాలలో | యత్ | = ఏదో |
| మాం చ | = నన్నే | తత్ | = అది |
| క్షేత్రజ్ఞం అపి | = క్షేత్రజ్ఞునిగ | జ్ఞానం | = జ్ఞానము |
| విద్ధి | = తెలుసుకో | మమ | = నా యొక్క |
| క్షేత్ర క్షేత్రజ్ఞయోః | = క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క | మతం | = అభిప్రాయము |

**భారతా! పార్థా! క్షేత్రా లన్నిటిలో క్షేత్రజ్ఞుడుగా ఉన్నది నేనే అని తెలుసుకో! జ్ఞానము అంటేనే, క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంబంధించిన జ్ఞానము అని నా అభిప్రాయము.**

### వ్యాఖ్య

**అఖండాత్మ స్వరూపం**

క్షేత్ర మంటే ఏమిటో, క్షేత్రజ్ఞ డెవరో పూర్వ శ్లోకంలో తెలుసుకున్నాం. ఈ మాత్రం తెలుసుకుంటే సరి పోతుందా? సరిపోదు. పూర్వోక్త లక్షణాలు గల క్షేత్రజ్ఞుడు, క్షేత్రముగా తెలియ బడుతున్న ఈ అఖిల ప్రపంచము కూడా పరమాత్మ స్వరూపంగా, అఖండంగా అర్థం కావాలి. అదే వాక్యార్థ నిశ్చయము. అప్పుడే 'అపి' పదార్థ నిర్ణయం జరిగినట్లు అవుతుంది. పూర్ణ జ్ఞానము కలుగుతుంది. అట్టి సమ్యక్ జ్ఞానము క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంబంధించిన జ్ఞానము వల్లనే ప్రాప్తిస్తుంది.

ఇంటి లోని దీపం ఇంటిని ప్రకాశింప చేసినట్లు, జ్ఞానరూపుడైన క్షేత్రజ్ఞుడు క్షేత్రమును ప్రకాశింప చేస్తున్నాడు. క్షేత్రమును, క్షేత్ర ధర్మమును, క్షేత్రము నందలి సమస్త కర్మమును, క్షేత్ర అవస్థలను తెలుసుకొనే క్షేత్రజ్ఞుడు, ఆయా క్షేత్రధర్మ, కర్మావస్థల నుండి వేరు పడిన వాడుగా తెలుస్తున్నాడు. దేహము లేని తాను అన్ని దేహాలలో దేహిగా అసంగుడై శోభిస్తున్నాడు ***(అశరీరం శరీరేషు)***. అతడే క్షేత్రజ్ఞుడు. ఆ క్షేత్రజ్ఞుణ్ణి తన స్వరూపం గానే భగవంతుడు తెలుసుకో మంటున్నాడు ***(క్షేత్రజ్ఞం మాం విద్ధి)***. అలా తెలుసుకున్న తరువాత, క్షేత్రజ్ఞుడు బ్రహ్మమునకు అభిన్నంగా తెలుస్తాడు. ఆత్మరూపుడైన క్షేత్రజ్ఞుడు బ్రహ్మమే అని తెలియడం చేత, క్షేత్రజ్ఞ బ్రహ్మముల మధ్య ద్వైత హేతువు లేవందున, ఇరువురికి అద్వితీయత్వము, అఖండత్వము సిద్ధిస్తుంది. **అయమాత్మా బ్రహ్మ** - ఈ ఆత్మయే బ్రహ్మము అనే మహావాక్యము అనుభూత మౌతుంది. ఈ విధమైన అఖండ బ్రహ్మాత్మ జ్ఞానములో అన్యమైనది మరొకటి ఉండే అవకాశం లేనందున, క్షేత్రము అనేదే గనుక ప్రత్యేకంగా ఒకటి ఉంటే, దాని వల్ల బ్రహ్మ అభిన్నత్వ విజ్ఞానానికి భంగం వాటిల్లుతుంది. కనుక, క్షేత్రము కూడా పరమాత్మ స్వరూపం గానే తెలియ వలసి ఉంది.

క్షేత్రానికి స్వయం సత్తా లేదు. స్వతః స్ఫురణ లేదు. సత్తా స్ఫూర్తులు లేని క్షేత్రము అవిద్యా కార్యము. ఆరోపిత విషయము. రజ్జువు నందు సర్పము వలె బ్రహ్మము నందు క్షేత్రము అవిద్య చేత కల్పించ బడిందే గాని, స్వయం సత్తా స్వరూపము కాదు. ఆరోపిత వస్తువు అధిష్ఠానం కన్నా వేరుగా ఉండలేదు ***(అధిష్ఠానాత్ భిన్నతా ఆరోపితస్య న భవతి)***. ఒకవేళ అలా ఉండ గలిగితే, బ్రహ్మమునకు అద్వితీయత్వము సిద్ధించదు. కనుక బ్రహ్మమునకు భిన్నంగా క్షేత్రజ్ఞుడు ఎలాగైతే లేడో, అలాగే క్షేత్రము కూడా బ్రహ్మాభిన్నం గానే ఉంది. క్షేత్ర క్షేత్రజ్ఞ లిరువురూ బ్రహ్మ స్వరూపము గానే ఉన్నారు. కనుకనే, ***క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి*** - నన్ను క్షేత్రజ్ఞునిగా కూడా **(అపి)** తెలుసుకో అంటూ శ్లోకాన్ని ప్రారంభించాడు భగవంతుడు.

నేను క్షేత్రజ్ఞుణ్ణి అనకుండా, నేను క్షేత్రజ్ఞుణ్ణి కూడా **(అపి)** అని అనడంలో గల ప్రత్యేకతను ప్రశస్తంగా





గుర్తించ వలసి ఉంది. నలుగురు కలిసి ముచ్చటించుకొనే చోటికి ఒక వ్యక్తి వచ్చి నేను కూడా గాయకుణ్ణే అన్నా డనుకోండి. దాని భావ మేమిటి? మీరే కాదు, నేను కూడా గాయకుణ్ణే అని అర్థం. అంటే, మీరూ గాయకులే. నేనూ గాయకుణ్ణే అని భావము.

అలాగే నన్ను క్షేత్రజ్ఞునిగా కూడా తెలుసుకోండి అంటే, నేను క్షేత్రమును, క్షేత్రజ్ఞుణ్ణి కూడా అని అర్థము. ఇది అఖండార్థ బోధక వాక్యంగా తెలుస్తూ ఉంది.

ఒక గుడ్డ సంచి చేత పట్టుకొని దారిన పోతున్న వ్యక్తిని, ఆ సంచిలో ఏముంది అని ప్రశ్నించా మనుకోండి. సంచిలో ఉన్నది కూడా నూలు బట్టే అన్నాడనుకోండి. దాని అర్థ మేమిటి? సంచి మాత్రమే నూలు బట్ట కాదు, సంచిలో ఉన్న బట్ట కూడా నూలుదే అని అర్థం.

ఇంకా కాస్త లోతుగా విశ్లేషించుకుంటే, సంచి రూపంలో ఉన్నది, సంచిలో ఉన్న బట్ట రూపంలో ఉన్నది, రెండూ నూలు మాత్రమే. నూలు కన్నా అన్య మైనది మరొకటి లేనే లేదు. నూలు ఏదో కాదు, దూదే. ఇప్పు డర్థమైందా? ఉన్నదంతా దూదే. ఒకటి బట్టగా సంచిలో ఉంది. మరొకటి తొడుగుగా సంచి రూపంలో ఉంది. సంచిని క్షేత్ర మనుకుంటే, గుడ్డను క్షేత్రజ్ఞ స్వరూపంగా భావిస్తే, ఈ రెండు దూది యైన బ్రహ్మము కన్నా అన్యం కాదు అని చెప్పుకుంటే, ఎలా ఉంటుంది? చాలా బాగుంటుంది. అయితే చాలు. అక్కడే ఆగుదాం. ఒగు వైపు ప్రయాణం వద్దు. సులభ గ్రాహ్యంగా ఉంటుందని దృష్టాంతాన్ని అందించాను. అంతే. దృష్టాంతం ఏకదేశీయమే కదూ? కనుక బాగు దగ్గరే ఆగుదాం.

ఈ విధంగా క్షేత్ర క్షేత్రజ్ఞులను అర్థం చేసుకోవడం వల్ల అఖండ బ్రహ్మజ్ఞానము ప్రాప్తిస్తుంది. క్షేత్ర క్షేత్రజ్ఞులను తనకు విషయంగా చేసుకొని ఏ జ్ఞానమైతే ఉందో, ఆ జ్ఞానమే సమ్యక్ జ్ఞానమని పరమేశ్వరుడు తన అభిప్రాయాన్ని తెలియ చేస్తున్నాడు ***(క్షేత్ర క్షేత్రజ్ఞయోః జ్ఞేయభూతయోః జ్ఞానం, క్షేత్ర క్షేత్రజ్ఞౌ యేన జ్ఞానేన విషయీ క్రియతే తత్ జ్ఞానం, సమ్యక్ జ్ఞానం ఇతి మతం అభిప్రాయః మమ ఈశ్వరస్య విష్ణోః)***. జటిలమైన, గహన మైన ప్రస్తుత శ్లోకం లోని విషయాన్ని సారభూతంగా చెప్పుకున్నాం. ఇది చాలా గుహ్యమైన, గంభీరమైన శ్లోకము. దీనినే కాస్త సులభతరంగా, సుస్పష్టంగా ముచ్చటించుకుందాం.

**క్షేత్రము - క్షేత్రజ్ఞుడు**

అర్జునా! సమస్త దేహాలలో ***(సర్వ క్షేత్రేషు)*** ఉన్న క్షేత్రజ్ఞుణ్ణి కూడా ***(క్షేత్రజ్ఞం చాపి)*** నన్ను గానే తెలుసుకో ***(మాం విద్ధి)!*** అన్నాడు భగవంతుడు.

విద్యుద్దీపము వెలుగుతూ ఉంది అంటే, ఆ దీపంలో విద్యుత్తు ప్రసరిస్తూ ఉంది అని అర్థం. వెలిగే అన్ని దీపాల లోనూ విద్యుచ్ఛక్తి ప్రసరిస్తూనే ఉంది.

దేహాలు చరిస్తున్నాయి అంటే, ఆ చరించే దేహాలలో చైతన్యాత్మ క్షేత్రజ్ఞుడుగా శోభిస్తున్నాడు.

దీపము వేరు; దీపాన్ని ప్రకాశింప చేసే విద్యుత్తు వేరు. అలాగే క్షేత్రము వేరు. క్షేత్రాన్ని తెలుసుకొనే క్షేత్రజ్ఞుడు వేరు. ఇది మనకు రెండవ శ్లోకం లోనే అర్థమైంది.

ఇక్కడ ఒక శంక తలెత్తుతుంది. క్షేత్రాలు అనేకంగా ఉన్నాయి కదా! అలాగే క్షేత్రజ్ఞులు కూడా అనేకులా? ఒక్కొక్క శరీరంలో ఒక్కొక్క క్షేత్రజ్ఞుడు ఉన్నాడా? అదే వాస్తవ మైతే, క్షేత్రా లెన్ని ఉన్నవో, క్షేత్రజ్ఞులు కూడా అందరు ఉండాలి కదా! మరి ఆత్మలు అనేకంగా ఉండే టప్పుడు ఇక అఖండాత్మ ఎక్కడుంది? ఈ విషయం అర్థం గాక, ఆత్మలు అనేక మని భావించిన వారే అద్వైతానికి భిన్నమైన మతాలను సృష్టించారు. కాని, వాటిని పోషించ లేక యాతన పడుతున్నారు.

ఆత్మ ఒక్కటే గాని, అనేకము కాదు. క్షేత్రజ్ఞుడు ఆత్మయే కనుక, క్షేత్రజ్ఞుడు కూడా ఒక్కడే. అందుచేత, సర్వ క్షేత్రాలలో ఉండే క్షేత్రజ్ఞుణ్ణి తాను గానే తెలుసుకోమంటున్నాడు భగవంతుడు. క్షేత్రాలకు బహువచనమును ఉపయోగించి, క్షేత్రజ్ఞునికి ఏకవచనం ప్రయోగించడం లోని వైశిష్ట్యం అదే.

దీపాలు అనేక మైనా విద్యుత్తు ఒక్కటే. కుండలు అనేక మైనా, కుండల లోని ఆకాశం ఒక్కటే. అలాగే క్షేత్రాలు అనేకంగా ఉన్నా, ఆ క్షేత్రాలలో ప్రకాశించే క్షేత్రజ్ఞ స్వరూపము ఏకమే. అద్వయమే.

ఒక దేహం మరొక దేహం కాదు. కాని, దేహాలలో దేహిగా తెలుస్తున్న క్షేత్రజ్ఞుడు మాత్రం ఏ దేహానికీ పరిమితుడు కాడు. ఒకరి దేహం మరొకరి దేహం కాక పోవచ్చు. ఎవరి క్షేత్రం వారిదే. కాని, ఒక క్షేత్రంలో ఏ క్షేత్రజ్ఞ స్వరూప మైతే భాసిస్తూ ఉందో, అదే అన్ని క్షేత్రాలలో అద్వితీయంగా ప్రకాశిస్తూ ఉంది.

అందుచేతనే, రెండవ అధ్యాయంలో, అర్జునా! నేను ఒకప్పుడు లేను అనేది లేనే లేదు ***(న త్వే వాహం జాతు నాసం).*** నీవు, ఈ రాజు లందరు కూడా లేరు అనే కాలమే లేదు ***(న త్వం నేమే జనాధిపాః).*** అలాగే భవిష్యత్తులో కూడా మన మందరము లేకుండా పోవడ మనేది లేనే లేదు ***(న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్)*** అన్నాడు భగవంతుడు. క్షేత్రాలు ఎలాగూ నశించి పోతున్నాయి కనుక, అవినాశి యైన నిత్యాత్మ స్వరూపాన్నే ప్రస్తావిస్తూ భగవంతుడు ప్రవచించాడు. ఆత్మ నిత్యము కనుకనే అది అద్వితీయము. అదే క్షేత్రజ్ఞ స్వరూపము.

### వేదాంత సారము

క్షేత్ర క్షేత్రజ్ఞు లిరువురూ పరబ్రహ్మము కన్నా అన్యము కారనే అఖండైక జ్ఞానమే వేదాంత సిద్ధాంతము. అదే సర్వ శాస్త్ర సారము. క్షేత్రజ్ఞుడు తానే నని భగవంతుడు అభిభాషించాడు ***(క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి).*** క్షేత్రాభిమానంతో జీవుడు తాను దేహమని భావిస్తున్నాడు. తాను దేహం అని భావించడం చేతనే, అన్య క్షేత్రాల నుండి, అలాగే ఈ సమస్త దృశ్య ప్రపంచం నుండి తాను వేరైనట్లు భావిస్తున్నాడు.

ఈశ్వరాభిమాని యైన జీవుడు తానే ఈశ్వరుడు అనే జ్ఞానాన్ని పొందుతున్నాడు. ఉపాధి వినిర్ముక్త మైన పరమాత్మ చైతన్యంలో క్షేత్రము ప్రత్యేకంగా లేనందున, క్షేత్ర క్షేత్రజ్ఞు లిరువురూ పరబ్రహ్మము గానే తెలుస్తున్నారు. అఖండ పరబ్రహ్మ స్థితిలో భేదము అనూహ్యము. అదే అభేదరూప స్థితి. అఖండరూప స్థితి. అద్వైతరూప స్థితి. జీవజగత్తులు రెండూ బ్రహ్మమే ***(బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ).*** క్షేత్ర క్షేత్రజ్ఞు లిరువురూ పరమాత్మ స్వరూపమే. అదే అఖండరూప మోక్ష స్థితి. అదే సమ్యక్ జ్ఞానము అని తన స్వాభిప్రాయాన్ని సప్రమాణంగా అందించాడు గీతాచార్యుడు.

### జ్ఞాన స్నానము

ఈ శ్లోకంలో అర్జునుణ్ణి భారతా! అని సంబోధించాడు పార్థసారథి. 'భా' అంటే ప్రకాశము. రతుడు అంటే రమించే వాడు అని అర్థము. సదా జ్ఞాన ప్రకాశంలో రమించే వాడు, లేదా అలా రమించాలనే ఆసక్తి గల వాడు కనుక, అర్జునుణ్ణి 'భారతా' అని పిలిచాడు భగవంతుడు. ***భా యా మఖండ వృత్త్యావేవ సదా రమత ఇతి భారతః -*** అఖండ బ్రహ్మాకార వృత్తి యందు సదా రమించే వాడు భారతుడు; లేక భరతుడు. అంటే క్షేత్ర క్షేత్రజ్ఞ పరబ్రహ్మ స్వరూపము అద్వితీయ మనే అఖండాకార వృత్తిలో ఓలలాడే వాడు అని అర్థము.

*ఇంతవరకు క్షేత్ర క్షేత్రజ్ఞులను ప్రస్తావిస్తూ ప్రవచించిన భగవంతుడు, ఇక వాటిని గూర్చి విస్పష్టంగా వివరించ బోతున్నాడు.*





**తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।**
**స చ యో య త్ప్రభావశ్చ త త్సమాసేన మే శృణు ॥** 3

***తత్-క్షేత్రం-యత్-చ-యాదృక్-చ-యద్వికారి-యతః-చ-యత్***
***సః-చ-యః-యత్ప్రభావః-చ-తత్-సమాసేన-మే-శృణు***

| | | | |
|---|---|---|---|
| తత్ | = ఆ | యః | = ఎవడో |
| క్షేత్రం | = క్షేత్రము | యత్ ప్రభావః చ | = ఎట్టి మహిమ గలవాడో |
| యత్ చ | = ఏదియో | తత్ | = ఆ వివరమును |
| యాదృక్ చ | = ఏ విధమైనదో | సమాసేన | = సంక్షేపముగా |
| యత్ వికారి | = ఎటువంటి వికారము గలదో | మే | = నా వలన |
| యతః చ యత్ | = ఎచ్చటి నుండి వచ్చిందో, ఏదో | శృణు | = విను |
| సః చ | = ఆ క్షేత్రజ్ఞుడు | | |

**అర్జునా! ఏది క్షేత్రమో, అదెలాంటిదో, ఎలా మారుతుందో, ఎక్కడ నుండి వచ్చిందో చెబుతాను. అలాగే, క్షేత్రజ్ఞు డెవరో, అతడి ప్రభావ మేమిటో అన్నీ సంక్షిప్తంగా చెబుతాను. విను.**

### వ్యాఖ్య

మొదటి రెండు శ్లోకాలలో సూత్రప్రాయంగా క్షేత్ర క్షేత్రజ్ఞులను గూర్చి చెప్పిన భగవంతుడు, వారి స్వభావ స్వరూపాలను గూర్చి సంక్షేపంగా చెప్పడానికి ఉపక్రమిస్తున్నాడు. ఇలా బోధించే విధానమును శాస్త్రంలో 'సమాస వ్యాస పద్ధతి' అంటారు.

***ఇదం శరీరం*** అని ఏ విషయా న్నైతే మొదటి శ్లోకంలో ప్రస్తావించాడో, దానినే 'తత్' శబ్దం చేత పరామర్శిస్తూ, ***తత్ క్షేత్రం*** అంటూ ఈ శ్లోకాన్ని ప్రారంభిస్తున్నాడు. క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూప స్వభావాలను సూత్రప్రాయంగా వివరించి, వాటినే సంగ్రహంగా చెబుతున్నందున, పదే పదే 'చ' కార ప్రయోగం చేశాడు. ***యచ్చ, యాదృక్చ, యతశ్చ*** అంటూ ఐదు సార్లు ఉపయోగించిన 'చ' శబ్దమును సముచ్చయార్థంగా గ్రహించాలి. వాక్య విషయంలో 'అది కూడా' అనే అర్థాన్ని స్ఫురింప చేయడాన్ని సముచ్చయం అంటారు.

### క్షేత్ర స్వభావము

***తత్ క్షేత్రం*** - ఆ క్షేత్రము అంటూ శ్లోక ప్రారంభంలో ప్రస్తావించిన 'ఈ శరీరాన్ని' గూర్చి, దాని స్వభావాన్ని గూర్చి చెబుతున్నాడు. ఏది క్షేత్రము ***(యచ్చ)?*** దేని నైతే క్షేత్రము అంటున్నామో అది ఏయే ధర్మాలను కలిగి ఉండటం చేత క్షేత్రము అనబడింది? అనేదే యచ్ఛబ్దార్థము. పూర్వం లేకుండా ఇప్పుడు వచ్చింది, మున్ముందు లేకుండా పోయేది శరీరము. ఈ జన్మాదు లనే ధర్మం ***యచ్చ*** శబ్దము చేత చెప్పబడుతూ ఉంది.

జననమరణాలు ధర్మముగా గల శరీర మనే క్షేత్రము ఎటు వంటిది ***(యాదృక్)?*** జడరూప మైనది. దృశ్యమాత్ర మైనది. పరిచ్ఛిన్న మైనది. కనుక, నశ్వర మైనది.

జడ దృశ్య పరిచ్ఛిన్న స్వభావం గల శరీరము ఎలా మారుతూ ఉంది? దేహంలో ఎలాంటి వికారాలు చోటు చేసుకున్నాయి ***(యద్వికారి)?*** పుట్టింది మొదలు గిట్టే వరకు క్షణక్షణము మార్పు చెందుతూ ఉంది. స్థిర మైనది కాదు. నియత స్వభావము లేనిది ***(అనియత స్వభావః).*** ప్రతి శ్వాస లోను వికారమే. ఇంద్రియాలూ

వికార యుతాలే. క్షేత్రం ఎప్పుడు ఎలా ఉంటుందో నిర్దిష్టంగా ఎవ్వరూ చెప్పలేరు. రెప్పపాట్లు కూడా నియమంగా లేవు. అందుకే అది వికారి. అందుచేత జ్ఞాత అయిన క్షేత్రజ్ఞునిచే తెలియ బడుతున్న జ్ఞేయమైన క్షేత్రము హేయము. హేయమైన దానిని తెలుసుకోవడ మెందుకు? అనే సంశయం మీకు ఏర్పడవచ్చు. హేయమని తెలిసి నపుడే అది త్యాజ్య మవుతుంది.

ఈ శరీర మనే క్షేత్రం విషయంలో కార్యకారణ సంబంధం ఎలా ఉంది? దేని కారణంగా అది పుడుతూ ఉంది **(యతశ్చ)?** ఇది కూడా తెలియాలి. జీవునికి సంసార మూలకంగా ఉంది కనుక క్షేత్రాన్ని గూర్చి ఈ విషయాలన్నీ మనకు తెలియాలి.

**క్షేత్రజ్ఞ స్వరూపము**

క్షేత్రమైన శరీర స్వభావ స్వరూపాలను ఎలా తెలుసుకున్నామో, అలాగే క్షేత్రజ్ఞుని స్వరూప స్వభావాలను కూడా తెలుసుకోవాలి **( స చ - సః చ. యః క్షేత్రజ్ఞః నిర్దిష్టః సః).** క్షేత్రం విషయంలో స్వభావాన్ని మాత్రమే తెలుసుకుంటాం. కాని, క్షేత్రజ్ఞుని విషయంలో ప్రభావాన్ని తెలుసుకోబోతాం. క్షేత్రానికి స్వభావమే గాని ప్రభావము లేదు. క్షేత్రజ్ఞుడు ప్రభావమే స్వభావంగా కలిగిన వాడు **(యత్ప్రభావః).** క్షేత్రము వికారయుత మైంది కనుక ప్రభావము లేనిది. క్షేత్రజ్ఞుడు నిర్వికారి, ముక్త స్వభావుడు కనుక ప్రభావయుతుడు.

అయినా ఈ రెండిటిని **(తత్ క్షేత్ర క్షేత్రజ్ఞయోః యథాత్మ్యం).** అంటే, ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల వాస్తవ స్వరూపాన్ని తెలుసుకోవాలి. రెండిటిని ఎందుకు తెలుసుకోవాలి? క్షేత్ర స్వభావమును తెలుసుకోవడం వల్ల అది నశ్వర మని అర్థ మౌతుంది కనుక, దానితో తాదాత్మ్యం చెంది సంసారాన్ని తయారు చేసుకొనే దుస్థితి నుండి విడిపడ వచ్చు. అలాగే క్షేత్రజ్ఞుని వైభవాన్ని తెలుసుకోవడం వల్ల పరమాత్మ జ్ఞానము ఏర్పడి, తాను సదా ముక్తుడే నని గ్రహించి జీవన్ముక్త స్థితిని పొందవచ్చు. అందుచేత, క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంబంధించిన విశేష జ్ఞానాన్ని **(తత్)** వినిపిస్తున్నాడు గీతాచార్యుడు.

అర్జునా! క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంబంధించిన విశేషాలను, ఆ విశేషాలతో కూడిన యథార్థ స్వరూపాన్ని **(తత్)** చెబుతున్నాను. విను **(శృణు).** విని నిర్ధారణ చేసుకో **(శృత్వా అవధారయ ఇత్యర్థః)** అంటున్నాడు పరమాత్మ. ఇది శ్రవణ ఫలం.

**శృణు -** విను అనే మాటను ఇక్కడ జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. శ్రీకృష్ణుడు ఇంతవరకు చెబుతూనే ఉన్నాడు. చెప్పే విషయాన్నంతా అర్జునుడు ఆలకిస్తూనే ఉన్నాడు. మళ్ళీ ప్రత్యేకించి 'విను' అని చెప్ప నవసరం లేదు. కాని, పరమాత్మ అలా చెబుతున్నాడు అంటే అవసర మేదో ఉందనే గ్రహించాలి. అవధానంతో ఆలకించ వలసిన విషయము అని అర్థం చేసుకోవాలి. కేవలం ఆలకిస్తే చాలదు. నిశ్చితంగా, ఖచ్చితంగా విషయాన్ని నిర్ధారించు కోవాలి అని భావము. అలా చేసినపుడే గహన మైన, గుహ్యమైన విషయాలను ఆలకించిన ఫలం సిద్ధిస్తుంది. తన్నిష్ఠుడై అర్థం చేసుకున్న వాడికే శ్రవణ ఫలం దక్కుతుంది. అవధారణ అవశ్యం అని ఇక్కడ ప్రత్యేకించి సూచించడం జరిగింది అంటే, ఉపేక్ష విస్మరణాదులు యుక్తం కావు అని హెచ్చరించడమే అంతరంగ మని గ్రహించాలి.

శ్రోతలో ఆసక్తిని పెంచి, అవధానాన్ని స్థిరం చేసి, విషయాన్ని అందించేందుకు విషయ వైభవాన్ని కీర్తిస్తున్నాడు. అంతేగాక, తాను బోధించే విషయం సంప్రదాయ సిద్ధ మని కూడా ప్రస్తుతిస్తూ, ఒక్క శ్లోకాన్ని వినిపిస్తున్నాడు.





**ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్ ।**
**బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః ॥** 4

*ఋషిభిః-బహుధా-గీతం-ఛందోభిః-వివిధైః-పృథక్*
*బ్రహ్మసూత్రపదైః-చ-ఏవ-హేతుమద్భిః-వినిశ్చితైః*

| | | | |
|---|---|---|---|
| ఋషిభిః | = ఋషుల చేత | హేతుమద్భిః | = సహేతుకములైనవియు |
| బహుధా | = అనేక విధములుగా | వినిశ్చితైః | = నిశ్చయ మైనవియునగు |
| పృథక్ | = వేరుగా | బ్రహ్మసూత్రపదైః చ ఏవ | = బ్రహ్మసూత్రపదముల చేత |
| వివిధైః | = అనేకములైన | గీతం | = చెప్పబడినది |
| ఛందోభిః | = వేదముల చేత | | |

**అర్జునా! ఈ విషయాన్ని ఋషులు అనేక విధాలుగా కీర్తించారు. వేదాలు వివిధ రీతుల్లో చెప్పాయి. హేతుబద్ధంగా, శాస్త్రోక్తంగా బ్రహ్మసూత్రాలు బహువిధాల నిశ్చయించాయి.**

**వ్యాఖ్య**

అర్జునా! క్షేత్రము యొక్క స్వభావాన్ని, క్షేత్రజ్ఞుని ప్రభావాన్ని సంక్షేపంగా చెబుతాను, విను అన్నాడు పూర్వ శ్లోకంలో భగవంతుడు. ఒక విషయం సంక్షిప్తంగా చెప్పబడుతూ ఉంది అంటే, అది అంతకు ముందు విస్తారంగా చెప్పబడింది అని అర్థం. ఎవరి చేత విస్తారంగా చెప్పబడిన దానికి ప్రస్తుత విషయము సంక్షేపము అనే అంశాన్ని ఒక వైపు స్పష్టం చేస్తూ, మరో వైపు శ్రోత యొక్క బుద్ధిని ఆకర్షించ డానికి, సంతోష పెట్టడానికి విషయాన్ని స్తుతిస్తున్నాడు ***(స్తాతి శ్రోతృ బుద్ధి ప్రరోచనార్థం).***

**ఋషి గీతమ్**

క్షేత్ర క్షేత్రజ్ఞ వివేకము ఋషుల చేత ***(ఋషిభిః)*** అనేక విధాలుగా ***(బహుధా)*** గానం చేయబడింది ***(గీతమ్).*** అంటే చెప్పబడింది ***(కథితమ్)*** అని అర్థము. ఇక్కడ ఋషులు అన్న చోట వసిష్ఠాది ఋషులు ***(వసిష్ఠాదిభిః)*** అని వ్యాఖ్యానించారు శ్రీ శంకరులు. ప్రత్యేకించి వసిష్ఠుని నామాన్ని ఉటంకించడం వల్ల యోగ వాసిష్ఠాన్ని ఉదహరించి నట్లైంది. ముప్పై రెండు వేల శ్లోకాలతో అద్భుతంగా అలరారుతున్న యోగవాసిష్ఠ గ్రంథములో కూడా ఈ విషయమే ప్రధానంగా చెప్పబడి ఉంది అని అర్థము.

ఋషి ప్రోక్తమైన విషయము ఏదైనా ఆప్తవాక్యమే. అనుభవం నుండి జనించినదే. ఋషుల చేత చెప్పబడింది అనకుండా గానం చేయబడింది అని చెప్పడం జరిగింది. ***గీయత ఇతి గీతం, గానం చ -*** పాడ బడేది గీతం అని అమరసింహుడు అర్థం చెప్పాడు. ఋషుల చేత చెప్పబడింది అనడానికి బదులుగా, గానం చేయబడింది అని చెప్పడం కూడా శాస్త్ర విధానమే. అనుభవ సిద్ధము అని చెప్పే సందర్భాలలో ఇలాంటి పద ప్రయోగాలు జరుగుతాయి.

***తస్యాః సాధనాని గాయన్తి ఆచార్యాః -*** భగవద్భక్తికి సాధనలను ఆచార్యులు గానం చేశారు అని సూత్రీకరించారు భక్తి సూత్రాలలో నారదమహర్షి *(నా.భ.సూ - 34).* ఆనంద సమయాలలో అప్రయత్నంగా, అనాయాసంగా వ్యక్త మయ్యేదే గానం. గానం వెనుక తృప్తి ఉంటుంది. ఉత్సాహం ఉంటుంది. పరుల హితము నందు అభినివేశం ఉంటుంది. జ్ఞానులైన మహర్షులు తమ జ్ఞానాన్ని అలాగే వితరణ చేశారు.

**వేదసారం**

ఆప్తులైన మహర్షుల వాక్యాల చేత బహు విధాలుగా ప్రవచింప బడిన క్షేత్ర క్షేత్రజ్ఞ వివేకము ఋక్కులు మొదలైన వేద మంత్రాల చేత **(ఛన్దోభిః)** అనేక విధాలుగా **(వివిధైః నానా భావైః)** వేరు వేరుగా విస్పష్టం చేయ బడింది **(పృథక్ వివేకతః).**

ఆప్తవాక్యంగా తెలిసిన ఈ విషయము ప్రమాణవాక్యంగా కూడా అలరారుతోంది. ఏది జ్ఞానమును ప్రసాదిస్తుందో అదే ప్రమాణము **(ప్రమాకరణం ప్రమాణం).** ప్రమాణాంతర విషయాన్ని ఆర్షసంస్కృతి అంగీకరించదు. ఆర్య మతి సమ్మతించదు. చెప్పే వ్యక్తి ఎంత గొప్ప వాడైనా కావచ్చు. చెప్పబడే విషయం ఎంత ప్రశస్తమైన దైనా కావచ్చు. ప్రమాణ యోగ్యత లేనపుడు, దానిని నిరర్థకం గానే చూస్తారు. బౌద్ధ జైన చార్వాకాది మతాలు అలాగే నిరసింప బడ్డాయి.

ప్రస్తుతం గీతాచార్యుడు బోధిస్తున్న ఈ క్షేత్ర క్షేత్రజ్ఞ వివేకము ప్రమాణ విషయమే అనే సత్యాన్ని కూడా స్పష్టం చేస్తూ, సంప్రదాయాన్ని సముజ్జ్వలంగా కీర్తించడం జరిగింది.

**సూత్ర ప్రతిపాదితం**

ఋషుల ఆప్తవాక్యాల చేత, ఋగాది ఛందస్సుల చేత చెప్పబడిన ఈ విషయము, అర్థ సాధకము లైన యుక్తులు గల **(హేతు మద్భిః)** బ్రహ్మసూత్ర పదాల చేత కూడా **(బ్రహ్మసూత్ర పదైః)** సుస్పష్టంగా, నిశ్చితార్థంతో **(వినిశ్చితైః)** చెప్పబడింది.

బ్రహ్మసూత్రాలు అంటే, ప్రస్థానత్రయంలో న్యాయప్రస్థానంగా చెప్పబడిన వ్యాస విరచిత శారీరక సూత్రాలు అని శ్రీ శంకరుల శిష్యులైన ఆనందగిరి అభిప్రాయ పడ్డారు. కానీ, వ్యాసమహర్షి గీతను రచించిన తరువాత బ్రహ్మసూత్రాలను రచించాడా? లేక, గీతా రచనకు ముందే బ్రహ్మసూత్రాలు ఉన్నవా? అనేది చర్చనీయాంశము. నా మటుకు నాకు, ప్రస్తుతం శ్రీకృష్ణ పరమాత్మ చెబుతున్న బ్రహ్మసూత్రాలు వ్యాస విరచితమైన ***అథాతో బ్రహ్మ జిజ్ఞాసాది*** సూత్రాలు కావనేది దృఢ నిశ్చయము. ఇది నా వ్యక్తిగతాభిప్రాయము.

బ్రహ్మమును సూచించే వాక్యాలను బ్రహ్మసూత్రాలు అంటారు అని భాష్య వచనం ***(బ్రహ్మణః సూచకాని వాక్యాని బ్రహ్మ సూత్రాణి).*** ఏ వాక్యాల చేత బ్రహ్మము తెలియ బడతాడో, వాటిని బ్రహ్మపదాలు అంటారు. అవే బ్రహ్మవాక్యాలు, లేదా బ్రహ్మసూత్రాలు. మహావాక్యాలన్నీ బ్రహ్మవాక్యాలే. బ్రహ్మమును సూచించే పదాలే.

***పద్యతే గమ్యతే జ్ఞాయతే బ్రహ్మ సాక్షాత్ ప్రతిపాద్యత ఏభిరితి పదాని -*** ఏ పదాల చేత బ్రహ్మము సాక్షాత్తు ప్రతిపాదింప బడుతూ ఉందో, అట్టి ఉపనిష ద్వాక్యాలే పదాలు. 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' మొదలైన స్వరూప లక్షణ సంబంధమైన వాక్యాలు. ఇవి బ్రహ్మకు సంబంధించిన నిశ్చితార్థాన్ని అందిస్తాయి. సంశయ రహితంగా ప్రబోధిస్తాయి. అందుచేత, **నిశ్చితైః** అనకుండా **సునిశ్చితైః** అన్నాడు భగవంతుడు.

స్తుతిని ముగించి, విషయాన్ని ఆరంభిస్తున్నాడు.

**మహాభూతా వ్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ ।**
**ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥** 5
**ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః ।**
**ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥** 6





*మహాభూతాని-అహంకారః-బుద్ధిః-అవ్యక్తం-ఏవ-చ*
*ఇంద్రియాణి-దశ-ఏకం-చ-పంచ-చ-ఇంద్రియగోచరాః*
*ఇచ్ఛా-ద్వేషః-సుఖం-దుఃఖం-సంఘాతః-చేతనా-ధృతిః*
*ఏతత్-క్షేత్రం-సమాసేన-సవికారం-ఉదాహృతం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాభూతాని | = | పంచభూతములు | సుఖం | = | సుఖము |
| అహంకారః | = | అహంకారము | దుఃఖం | = | దుఃఖము |
| బుద్ధిః | = | బుద్ధి | సంఘాతః | = | సమూహము |
| అవ్యక్తం ఏవ చ | = | అవ్యక్తమును | చేతనా | = | చేతనత్వము |
| దశ ఇంద్రియాణి | = | పది ఇంద్రియములు | ధృతిః | = | ధైర్యము |
| ఏకం చ | = | మనస్సుకు | ఏతత్ | = | ఇది |
| ఇంద్రియగోచరాః | = | ఇంద్రియ విషయములు | క్షేత్రం | = | క్షేత్రము |
| పంచ చ | = | అయిదును | సమాసేన | = | సంక్షేపముగా |
| ఇచ్ఛా | = | కోరిక | సవికారం | = | వికార సహితముగా |
| ద్వేషః | = | ద్వేషము | ఉదాహృతం | = | చెప్పబడింది |

**అర్జునా! పంచమహాభూతాలు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, దశేంద్రియాలు, పంచేంద్రియ విషయాలు, మనస్సు,**
**వాటితో పాటు, కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహము, చేతనము, ధృతి - వికార యుతమైన ఈ సమస్తము క్షేత్ర మని సంక్షేపంగా చెప్పబడింది.**

**వ్యాఖ్య**

శ్రోతృ బుద్ధి ప్రరోచనార్థము విషయ వైభవాన్ని స్తుతించిన గీతాచార్యుడు, వికారయుత మైన క్షేత్రమును గూర్చి వివరిస్తున్నాడు. క్షేత్ర ప్రసంగాన్ని సర్వ శాస్త్రముల నుండి సారభూతంగా గ్రహించి, ఈ రెండు శ్లోకాలలో ప్రశస్తంగా ప్రతిపాదించాడు. ముఖ్యంగా కపిల మహర్షి సాంఖ్య శాస్త్రంలో ప్రసిద్ధంగా ప్రతిపాదించిన చతుర్వింశతి తత్త్వములను, క్షేత్ర విషయంలో సాంఖ్య శాస్త్ర సారము నంతటిని మొదటి శ్లోకం లోనే స్పష్టం చేసేశాడు.

**చతుర్వింశతి తత్త్వములు - సాంఖ్యము**

మహాభూతాలు ఐదు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము కలసి మూడు, దశేంద్రియాలు మనస్సు కలసి పదకొండు, ఇంద్రియ గోచరములైన శబ్దాది విషయాలు ఐదు - వెరసి ఇరవై నాలుగు తత్త్వములను మొదటి శ్లోకంలో భగవంతుడు వివరించాడు. ఇవే కాపిల సాంఖ్యము ప్రతిపాదించే చతుర్వింశతి తత్త్వములు (ఇరవై నాలుగు తత్త్వములు).

షడ్దర్శనములలో కపిలుని సాంఖ్యము ఒకటి. కపిలమహర్షి ప్రతిపాదించినది కనుక దీనిని కాపిల సాంఖ్యము అంటారు. సృష్టి క్రమమును వివరించడంలో ఇరవై నాలుగు తత్త్వములను లెక్కిస్తారు (సంఖ్య పెడతారు) కనుక వీరికి సాంఖ్యులు అనే నామ మేర్పడింది. కపిలుని సాంఖ్యశాస్త్రము ఆరు అధ్యాయాలలో, ఐదు వందల ఇరవై ఆరు శ్లోకాలతో ఉంది. ఈ సాంఖ్య మతానికి బీజాలు శ్వేతాశ్వతరోపనిషత్తు లోను, పంచమ వేదమైన మహాభారతం లోను ఉన్నాయి. షడ్దర్శనాలలో వేదాంత దర్శనము (ఉత్తర మీమాంస) తరువాత

సాంఖ్యమునే ప్రసిద్ధంగా చెబుతారు. అందుకే నేమో, సిద్ధులలో నేను కపిలమహర్షిని అన్నాడు గీతాచార్యుడు *(10 వ అ - 26 వ శ్లో).*

క్షేత్ర క్షేత్రజ్ఞుల విషయంలో సాంఖ్యము ప్రతిపాదించిన ఇరవై నాలుగు తత్త్వములతో కూడినది క్షేత్రము కాగా, ఇరవై ఐదవ తత్త్వము పురుషుడు (క్షేత్రజ్ఞుడు). ఈ రెండు తత్త్వములు కలిసి ఇరవై ఐదు (పంచ వింశతి) తత్త్వములు. ఈ రెండు జగత్తు యొక్క ఆవిర్భావానికి హేతువులు అనేది సాంఖ్య మతము. ఈ రెండూ స్వతంత్ర మైనవే. గుణ రహితుడు, నిరాకారుడు అయిన పురుషుడు ఇరవై నాలుగు తత్త్వాలతో కూడిన ప్రకృతితో మిళితమై గుణయుతుడు కావడమే బంధము. ఈ చతుర్వింశతి తత్త్వములు అనే ప్రకృతి నుండి పురుషుడు విడి పడటమే ముక్తి. ఈ విషయంలో సాంఖ్యానికి, వేదాంతానికి భేదా లున్నాయి. వేదాంతము ప్రకృతిని స్వతంత్ర మైనదిగా అంగీకరించదు. అది బ్రహ్మము నాశ్రయించుకొని ఉంటుంది. అలాగే సాంఖ్యంలో పురుషులు అనేకులు. వేదాంతంలో పురుషుడు అద్వయుడు. ఇలాంటి భేదాలు అనేకము లున్నాయి. ప్రస్తుతం ఆ వివరాల లోకి వెళ్ళి లోతుగా చర్చించడానికి సందర్భము సహకరించడం లేదు. ఏది ఏమైనా, ప్రస్తుతం గీతాచార్యుడు స్పృశిస్తున్న క్షేత్ర విషయమును వివరించడంలో సాంఖ్యాన్ని స్థాలీపులాకంగా చర్చించాను. అంతే.

### ప్రకృతి స్వరూపము

గీతాచార్యుడు ప్రస్తుత శ్లోకంలో విస్పష్టం చేస్తున్న ప్రకృతి విషయంలో మొదటిది **మహాభూతాని.** అంటే గొప్పవి యైన భూతాలు. అవే పంచభూతాలు. అంటే స్థూల పంచభూతాలు కావు. వికారయుతమైన స్థూల పంచభూతాలలో వ్యాపకమై ఉన్న సూక్ష్మ పంచభూతాలు. అందుచేత అవి మహాభూతాలు.

ఈ పంచ మహాభూతాలకు కారణమైంది అహంకారము. 'నేను' అనే జ్ఞానం గల అహంకారము **(మహాభూత కారణమ్ అహం ప్రత్యయ లక్షణః అహంకారః).** అహంకారానికి నిశ్చయాత్మకమైన బుద్ధి కారణము **(అహంకార కారణం బుద్ధిః).** బుద్ధికి కారణము అవ్యక్తము **(తత్కారణం అవ్యక్త మేవ).** ఇక్కడికి ఎనిమిది తత్త్వాలు. ఈ ప్రకారంగా ఎనిమిది విధాలుగా భిన్నమైన ప్రకృతినే అష్టధా ప్రకృతి అంటారు *( 7 వ అ - 4 వ శ్లో).* ప్రకృతి అంటే ఇదే, ఇంతే నని నిర్ధారణ చేయడానికి శ్లోకంలో **ఏవ** శబ్దము ప్రయోగించ బడింది **(ఏవ శబ్దః ప్రకృత్యవ ధారణార్థః).**

సృష్టికి ముందు వ్యక్తం కాకుండా, వ్యాకృతం కాకుండా ఉన్న ఈశ్వర శక్తియే అవ్యక్తం. అదే ప్రకృతి లేదా మాయ. దీని నుండే చతుర్వింశతి తత్త్వాలు ఉత్పన్న మయ్యాయి. విషయాన్ని సులభ సాధ్యం చేయడానికి కారణ మనే **(అవ్యక్తం)** అనులోమ క్రమం నుండి కాకుండా, కార్యమనే **(జగత్తు)** విలోమ క్రమం నుండి వివరిస్తాను.

ప్రపంచము కార్యము. కార్యమైన ప్రపంచము పంచభూతాలతో కూడి ఉంది. స్థూల పంచభూతాలకు తన్మాత్రలు, అంటే సూక్ష్మభూతాలు **(మహాభూతాని)** ఆధారము లేదా కారణము. ఈ పంచ తన్మాత్రలకు అహంకారము కారణము **(అహంకారాత్ పంచతన్మాత్రాణి).** నేను అనేకంగా వ్యక్త మవుతాను అనే సృష్టికి సంబంధించిన సంకల్పమే ఇక్కడ అహంకారము **(బహుస్యాం ప్రజాయేమ).** ఈ అహంకారానికి కారణమైన మహత్తత్త్వమే బుద్ధి **(మహతోఽహం కారః -** వేదం). **తదైక్షత్** అనే శ్రుతి సిద్ధమైన ఈక్షణమే బుద్ధి. సృష్టి విషయము నందు తత్సంబంధమైన ఈక్షణమే బుద్ధి (ఈక్షణానంతరమే **అహం బహుస్యాం ప్రజాయేమ** అనే సంకల్పము, లేదా అహంకారము).

మహత్తత్త్వము అనే బుద్ధికి కారణ మైనది అవ్యక్తము **(న వ్యజ్యతే).** అదే అవ్యాకృతము. ప్రపంచ





బీజము. దీనినే ప్రకృతి, లేదా మాయ అన్నారు. సమస్త ప్రపంచమునకు ఇదే కారణం కనుక సాంఖ్యులు దీనిని మూలప్రకృతి, లేదా ప్రధానం అన్నారు. ఇదే అపరా ప్రకృతి *( 7 వ అ - 5 వ శ్లో ).* జగత్తుకు బీజము. త్రిగుణాత్మక మైన పరమేశ్వర శక్తి. మాయా శక్తి.

శ్లోకం లోని ***ఏవ*** కారము అష్టధా ప్రకృతి నిర్ణయం కాగా, శ్లోకం లోని ***చ*** శబ్దము భేద సముచ్చయార్థము ప్రయోగింప బడింది ***(చ శబ్దః భేద సముచ్చయార్థః).*** సూక్ష్మ పంచభూతాలు (తన్మాత్రలు లేదా మహాభూతాలు) స్థూల భూతాలుగా పంచీకరణం చెంది నపుడు ఏకాదశ ఇంద్రియాలు, ఇంద్రియ గోచరమైన విషయాలు ఏర్పడ్డాయి.

జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, అంతరేంద్రియ మైన మనస్సు ఒకటి - వెరసి పదకొండు ఇంద్రియాలు ***(ఇంద్రియాణి దశ ఏకం చ).*** పంచ జ్ఞానేంద్రియాలకు తెలియబడే పంచ శబ్దాది విషయాలు. ఇక్కడికి పదహారు. సూక్ష్మ పంచభూతాలు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము వెరసి ఎనిమిది. ఇక్కడికి మొత్తం ఇరవై నాలుగు తత్త్వాలు (సాంఖ్యులు ప్రతిపాదించినవి). ఇవన్నీ క్షేత్రము క్రిందికే వస్తాయి. ఇదంతా ప్రకృతి రూపమే. వికార యుతమే.

***తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ*** అనే శ్లోకంలో పరమేశ్వరుడు ***యచ్చ*** - క్షేత్రము ఏదో చెబుతాను అన్న దానికి వ్యాఖ్యానమే ఇంతవరకు మనం చూచిన ఇరవై నాలుగు తత్త్వములతో కూడిన ప్రకృతి స్వరూపము. ఇక ***యాదృక్చ, యద్వికారి*** - అది ఎలాంటిది, ఏయే వికారాలు కలది? అనే విషయాన్ని విస్పష్టం చేసేందుకు ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న శ్లోక ద్వయంలో రెండవది యైన ***ఇచ్ఛా ద్వేష సుఖం దుఃఖం*** అనే శ్లోకం.

### వికార ధర్మములు - వైశేషికము

షడ్దర్శనములలో సాంఖ్యము ప్రతిపాదించిన చతుర్వింశతి తత్త్వములతో కూడిన ప్రకృతి స్వరూపాన్ని గూర్చి చర్చించుకున్నాం. ఆ ప్రకృతి లోని అహంకారం నుండి ఉత్పన్న మయ్యే గుణసహిత ఇచ్ఛాది వికారాలను ప్రస్తుత శ్లోకంలో చెప్పుకో బోతున్నాం. ఈ సందర్భములో షడ్దర్శనాలలో సాంఖ్యం లాగే మరొక దర్శన మైన వైశేషికాన్ని ప్రవేశ పెట్టక తప్పడం లేదు.

వైశేషిక దర్శనానికి కర్త కణాదమహర్షి. వైశేషికాన్ని ప్రతిపాదించే గ్రంథము పది అధ్యాయాలు కలిగి, ప్రతి అధ్యాయము రెండు ఆహ్నికాలుగా విభజింపబడి, మూడు వందల డెబ్బై రెండు శ్లోకాలతో శోభిస్తూ ఉంది. ఇది కపిలుని సాంఖ్య మంతటి ప్రసిద్ధిని పొందక పోయినా, షడ్దర్శనాలలో ఒకటైన గౌతముని న్యాయ దర్శనము కంటే ప్రశస్త మైనదని భావిస్తారు. ఈ వైశేషిక దర్శనానికి రావణాసురుని భాష్యం ఉందని చెబుతారు. నేను చూడ లేదు.

న్యాయ, వైశేషిక దర్శనాలు ఆత్మలు అనేకము అంటాయి. ఆత్మ ఏకమైతే, అందరి ఆత్మ ఒక్కటే కనుక, ఒకరికి సుఖదుఃఖాలు ప్రాప్తిస్తే, అందరికీ అవి అలాగే ప్రాప్తించాలి అనేది వారి వాదన. ఆత్మ అద్వితీయము, ఏకము అనే వేదాంత సిద్ధాంతాన్ని వైశేషికులు ***వ్యవస్థాతో నానా, శాస్త్ర సామర్థ్యాచ్చ*** అనే రెండు సూత్రాలలో అంగీకరించ లేదు. కనుక, ఆత్మలు అనేకము అనే వైశేషిక దర్శనములో ప్రతిపాదించ బడిన ఇచ్ఛ, ద్వేష, సుఖదుఃఖాది గుణాలు ఆత్మ ధర్మములుగా నిర్దేశింప బడ్డాయి *(వై.సూ; 1 - 1 - 6).* ఈ విషయమును వేదాంతము అంగీకరించదు.

ఆత్మ ఏకము, అద్వయము, నిర్గుణము, నిరాకారము. సుఖదుఃఖ, ఇచ్ఛాద్వేషాదులు మనోధర్మాలే గాని ఆత్మధర్మాలు కావు. సూక్ష్మ శరీరాభిమాని యైన జీవుడు సుఖదుఃఖాలను మనస్సు ద్వారా అనుభవిస్తాడు. కనుక

ఇచ్ఛా ద్వేష, సుఖదుఃఖాది వికారాలు మనస్సుకు సంబంధించినవే గాని ఆత్మకు సంబంధించినవి కావు. ఇలా జ్ఞేయములైన వికారాలు క్షేత్ర సంబంధ మైనవి. వాటినే ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు ఉదహరిస్తున్నాడు.

**ఇచ్ఛ :**

ఇచ్ఛ అంటే కోరిక. అదే రాగము. విషయాల యందు ప్రియత్వము. ***భోగ్యాని ఇచ్ఛతి అనయేతి ఇచ్ఛా -*** ***ఇదం మే భూయాత్ - ఇదం*** ఈ ప్రీతి వల్లనే భోగ్య విషయాలను ఆశించడం జరుగుతుంది కనుక, ఇది ఇచ్ఛ. ఇది అంతఃకరణ ***మే స్యాత్ -*** ఇది నాకు ప్రాప్తించు గాక అనే కోరికే ఇచ్ఛ. కామ మన్నా రాగ మన్నా ఇదే. ధర్మము.

**ద్వేషము :**

దుఃఖము, దుఃఖ హేతువు ప్రాప్తమై నపుడు, ఇది నాకు ప్రాప్తించకుండు గాక! అనే చిత్తవృత్తి ద్వేషము ***(ఇదం మే మా౽భూత్).*** ఈ చిత్త వృత్తే క్రోధంగా, ఈర్ష్యగా వ్యక్త మవుతూ ఉంటుంది. అనుకూలమై ప్రసన్నతను కలిగించేది ఇచ్ఛ అయితే, ప్రతికూలమై విషమత్వాన్ని నింపేది ద్వేషము. ఇవే రాగద్వేషాలు. ***అయం రాగః అయం ద్వేషః -*** ఇది మలదోషాలు. ఈ రెండు అంతఃకరణ ధర్మాలే గాని ఆత్మధర్మాలు కావు. ***ఇదం సుఖం, ఇదం దుఃఖం -*** ఇది సుఖము, ఇది దుఃఖము అని తెలియబడు రాగము, ఇది ద్వేషము; అలాగే ఘటాదులు ఎలా తెలుస్తున్నవో, సుఖదుఃఖ తున్నాయి కనుక ఇవి జ్ఞేయములు. తెలియ బడేవి ఏవైనా క్షేత్రమే. ఇచ్ఛాద్వేషాలు కూడా అలాగే తెలుస్తున్నాయి కనుక ఇవి క్షేత్ర ధర్మాలే గాని, ఆత్మధర్మాలు కావు.

**సంఘాతము :**

దేహేంద్రియాల సమూహమే, సంహతియే సంఘాతము ***(సంఘాతః దేహేన్ద్రియాణాం సంహతిః).*** ఇంద్రియాలతో కూడిన పరిణామ శీలమైన దేహము సంఘాతము.

**చేతనము :**

ఈ దేహేంద్రియ సంఘాతము నందు అభివ్యక్త మయ్యే అంతఃకరణ వృత్తినే **చేతనా** అంటారు. బాగా కాలిన ఇనుపగుండు నందు ఎఱ్ఱదనము అభివ్యక్త మైనట్లు, దేహేంద్రియ సంఘాతంలో బుద్ధి వృత్తి అభివ్యక్త మవుతుంది. అదే చేతనము. శీత స్వభావం గల ఇనుపగుండులో వ్యక్తమైన అగ్ని ఇనుప ముద్దను అగ్ని గోళంగా భ్రమింప చేసినట్లు, సర్వగత మైన ఆత్మ చైతన్యం బుద్ధిలో ప్రకాశించి నపుడు ***(బుద్ధౌ భానం)*** బుద్ధి వృత్తియే ఆత్మ యని భ్రమింప చేస్తుంది. వాస్తవానికి ఇది ఆత్మ చైతన్యము కాదు. చైతన్యాభాస మాత్రమే. దీనినే ఇక్కడ చేతన మంటున్నాడు. బుద్ధి వృత్తి కూడా జ్ఞేయమే కనుక, దృశ్యమే కనుక చేతన కూడా క్షేత్రమే.

**ధృతి :**

ధృతి అంటే ధైర్యము. ధైర్య రూపమైన బుద్ధి విశేషము. దుర్బలమై, సడలి పోతున్న దేహేంద్రియాదులను ఏది నిలబెడుతుందో అదే ధృతి, లేదా ధైర్యము ***(ధృతిః యయా అవసాద ప్రాప్తాని దేహేంద్రియాణి ధ్రియన్తే).*** ఇది కూడా జ్ఞేయమే కనుక క్షేత్రమే.

ఏవేవి మహదాదులతో, శబ్దాదులతో కూడి వికారయుతమై, ఆత్మకు జ్ఞేయములుగా ఉన్నవో అవన్నీ క్షేత్రములే. సవికారములే ***(సవికారం ఉదాహృతమ్).*** ఇదంతా క్షేత్రంగా చెప్పబడింది అని క్షేత్ర స్వభావాన్ని వివరించి ఉపసంహరిస్తున్నాడు ***(యత్ ఉక్తం తత్ ఉపసంహరతి).***

*ఇక క్షేత్రజ్ఞుని ప్రభావాన్ని గూర్చి చెప్పాలి. క్షేత్రజ్ఞుని వైభవాన్ని గ్రహించడానికి శ్రోత అర్హుడై ఉండాలి.*





*అదే జ్ఞానార్హత. క్షేత్రజ్ఞుని వైభవాన్ని వివరించే ముందు శ్రోతృ యోగ్యతను వివరిస్తున్నాడు.*

**అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్ ।** 7
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥**

*అమానిత్వం-అదంభిత్వం-అహింసా-క్షాంతిః-ఆర్జవం*
*ఆచార్యోపాసనం-శౌచం-స్థైర్యం-ఆత్మవినిగ్రహః*

| | | | |
|---|---|---|---|
| అమానిత్వం | = అభిమానము లేకుండుట | ఆచార్యోపాసనం | = ఆచార్య సేవ |
| అదంభిత్వం | = దంభము లేకుండుట | శౌచం | = శుభ్రత |
| అహింసా | = అహింస | స్థైర్యం | = స్థిరత్వము |
| క్షాంతిః | = సహనము | ఆత్మవినిగ్రహః | = ఆత్మనిగ్రహము |
| ఆర్జవం | = ఋజుత్వము | | |

**అర్జునా! అమానిత్వము, అదంభిత్వము, అహింస, క్షాంతి, ఆర్జవము, ఆచార్యోపాసనము, శౌచము, స్థైర్యము, ఆత్మ వినిగ్రహము - ఇదంతా జ్ఞానమే.**

**వ్యాఖ్య**

ప్రకృతి పురుషులు, క్షేత్ర క్షేత్రజ్ఞులు, జ్ఞాన జ్ఞేయములు అనే విషయాలు ఈ అధ్యాయంలో చర్చనీయాంశా లని మనం అధ్యాయం ప్రారంభం లోనే చెప్పుకున్నాం. వాటిలో ముందుగా క్షేత్ర క్షేత్రజ్ఞుల విషయాన్ని ఆరంభించి, క్షేత్రాన్ని గూర్చి ఇంతవరకు చెప్పుకున్నాం. ఇక క్షేత్రజ్ఞుణ్ణి గూర్చిన ప్రసంగం ప్రారంభం కావాలి. కానీ, అలా కాకుండా, మూడవ అంశమైన జ్ఞాన జ్ఞేయాలలో జ్ఞానం అనే విషయాన్ని ప్రస్తుతం వినబోతున్నాం.

క్షేత్ర విషయాన్ని ముగించి, క్షేత్రజ్ఞుని విషయాన్ని ప్రారంభించడానికి ముందుగా, అంటే ఈ మధ్యలో భగవంతుడు 'జ్ఞానం' అనే విషయాన్ని ప్రవచిస్తున్నాడు.

క్షేత్రజ్ఞుని ప్రభావము సాధారణ మైంది కాదు. క్షేత్రజ్ఞునికి సంబంధించిన జ్ఞానము కలిగితే మోక్షము సిద్ధిస్తుంది ***(క్షేత్రజ్ఞస్య పరిజ్ఞానాత్ అమృతత్వం భవతి).*** క్షేత్రజ్ఞుడు, జ్ఞేయము, పురుషుడు అన్నీ పర్యాయ పదాలుగా ముందే చెప్పుకున్నాం. జ్ఞేయ రూపుడైన క్షేత్రజ్ఞుని తెలుసుకుంటే జ్ఞానోత్పత్తి జరుగుతుంది. కానీ, జ్ఞానార్హత లేకుండా జ్ఞానం కలగదు. అలాగే జ్ఞానోత్పత్తి హేతువు లైన సాధనలు లేకుండా జ్ఞానార్హత సిద్ధించదు. అందుచేత, ప్రథమంగా అధికారిత్వాన్ని సిద్ధింప చేసి, ఆ తరువాత క్షేత్రజ్ఞ వైభవాన్ని వివరించాలి. ఆ ప్రయత్నం లోనే ముందుగా జ్ఞానోత్పత్తి సాధనలైన జ్ఞాన లక్షణాలను వివరిస్తున్నాడు. అవే వరుసగా ఐదు శ్లోకాలలో ప్రవచింప బడుతున్న అమానిత్వాది ఇరవై జ్ఞాన సాధనలు. జ్ఞానార్థి ప్రయత్న పూర్వకంగా సాధించ వలసిన ఈ జ్ఞాన సాధనలు ఆత్మజ్ఞానిలో సహజంగా అలరారుతూ ఉంటాయి. ఇక ఈ ఇరవై జ్ఞాన సాధనలను సంక్షిప్తంగా చెప్పుకుందాం.

**(1) అమానిత్వం**

తనను తాను పొగుడుకొనే లక్షణాన్ని మానిత్వం అంటారు. అదే ఆత్మస్తుతి ***(ఆత్మనః శ్లాఘనమ్).*** ఆ గుణము లేకపోవడం అమానిత్వం ***(తదభావః అమానిత్వం).***

ఆత్మ ప్రశంసే ప్రధానంగా కలవాడు మాని. అది లేనివాడు అమాని. అమాని యొక్క లక్షణం అమానిత్వం.

ఇది దైవ గుణము. దైవ లక్షణము. అందుకే విష్ణుసహస్రనామం భగవంతుని **అమానీ** అని కీర్తించింది (747వ
నామం).

ఆత్మస్తుతి అనేది తనలో ఉన్న వైభవాన్ని గూర్చి కావచ్చు. లేదా, లేని దానిని గూర్చి కావచ్చు. ఎలా
చూచినా, రెండూ అవాంఛనీయమే. లేనిది ఉన్నట్లు భావించి ఆత్మస్తుతి చేసుకోవడం అజ్ఞాని లక్షణము.
అలాంటి వాడు ఆత్మజ్ఞానాన్ని ఎలా పొందుతాడు? ఒకవేళ ఉన్న సుగుణాలనే ప్రశంసించుకున్నా డనుకుందాం.
అది మాత్ర మెందుకు?

తనకు ఏ గుణా లున్నాయో తనకు తెలుసు కదా! మరి స్తుతి ఎవరి కొరకు? ఇతరుల గుర్తింపు కొరకు.
అది దేనికి? తన సుఖం ఇతరులు తనను గుర్తించడంపై ఆధారపడి ఉందని భావించిన వాడే అలా పరితపిస్తాడు.
వాస్తవానికి ఇతరుల నుండి గుర్తింపులను, గౌరవాలను ఆశించే వాడు ఇహంలో సుఖపడ లేడు సరి గదా
సత్యదర్శనం చేయడానికి అసలే సరిపోడు.

*మానాపమానే దుఃఖీస్యాత్ నైవ సాధారణో జనః।*
*అతో దుఃఖ నిదానత్వాత్ మానం యోగీ పరిత్యజేత్॥*

మానావమానాలు రెండిటి లోను మానవుడు దుఃఖాన్నే అనుభవిస్తాడు. జనులు సామాన్యులు కారు అన్నది
శాస్త్రం. అవమానంలో ఎలాగూ దుఃఖం తప్పదు. కానీ, మానంలో కూడా దుఃఖమే ఉంటుంది. అందుచేత ఈ
మానిత్వాన్ని, ఆత్మస్తుతిని మోక్షార్థి త్యజించాలి.

శ్లాఘనీయమైన గుణమే మనలో ఉందనుకుందాం. దానిని ఇతరులు ఎందుకు గుర్తించాలి? ఎందుకు
గౌరవించాలి? ఆ సుగుణము వారికి శ్లాఘనీయం కాకపోవచ్చు. పోనీ శ్లాఘనీయమే అనుకుందాం. దాని
అవసరం వారి కేమిటి? ఒకవేళ దాని వల్ల వారికి ప్రయోజనం ఉంటే, గుర్తించి గౌరవిస్తారు. అది లేనపుడు,
గర్హిస్తారు. పదవులు కోల్పోయిన వారిని మనం చూడటం లేదా?

అంతే కాదు. ఇతరులపై మనకు నియంత్రణ ఉందా? పరిస్థితులు సదా మన అధీనంలో ఉంటాయా?
పైగా, అనిత్యమైన ప్రపంచం నుండి అర్థ రహితమైన గౌరవాన్ని ఆశించి ప్రాకులాడటం, అది లభ్యం కానపుడు
చింతించడం చిత్తదోషం కాదా? జ్ఞానోత్పత్తి హేతువైన అంతఃకరణ శుద్ధికి చిత్త మాలిన్యము ప్రతిబంధకము
కాదా? అందుచేత, సాధకుడు మానిత్వాన్ని త్యజించి, అమానిత్వంతో శోభించాలి.

**(2) అదంభిత్వం**

తనను తాను స్తుతించుకోవడం మానిత్వం అయితే, తాను ఆచరించిన కార్యాలను గూర్చి గొప్పలు
చెప్పుకోవడం దంభిత్వం ***(స్వధర్మ ప్రకటీకరణం దంభిత్వం).*** ఆ గుణము లేకపోవడం అదంభిత్వం ***(తదభావః
అదంభిత్వమ్).***

ఈ విధమైన ఆడంబరాల వెనుక, ఉత్తర కుమార ప్రగల్భాల వెనుక లాభాసక్తి, కీర్తికాంక్ష చోటు చేసుకొని
ఉంటాయి. ఈ ఆడంబర ప్రదర్శనంలో భాగంగా వేష భాషలు, హావభావాలు, క్రియా కౌశల్యాలు, ప్రకర్ష
ప్రకటనలు - ఓహ్ ఎన్నని? అన్నీ ఆడంబరాలే. డాంబికత్వాలే. స్వప్న తుల్యమైన జగత్తులో పూజార్హులు
కావాలనే తపనలే. ఎండమావులలో దప్పిక తీర్చుకొనే ప్రయత్నాలే. దంభమైనా, అదంభమైనా కర్మ యుతాలే.
కాకపోతే, దంభము దుఃఖ కారణము. చిత్త విక్షేప కారణము. అదంభము సుఖ హేతువు; పైగా చిత్తశుద్ధి
కారణము.





***కృతం దమ్భాత్ అదంభాద్వా కర్మతుల్య శ్రమం భవేత్!***
***శ్రమైక ఫల మాద్యం స్యాత్ ద్వితీయం సుఖ సాధనమ్॥***

దంభముతో ఆచరించినా, అదంభముతో ఆచరించినా కర్మ కర్మే. శ్రమ రెండిటిలో సమానమే.
దంభముతో చేసే శ్రమకు శ్రమే ఫలము. రెండవది యైన అదంభముతో ఆచరించే కర్మ సుఖ సాధనము
అన్నది శాస్త్రం. లేనిది ఊహించుకొని ప్రకటించుకొనే మనస్సు, ప్రకటించు కున్నది ప్రయోజనాన్ని ప్రాప్తింప
చేయాలని ప్రాకులాడే మనస్సు సదా చంచలమై, అస్థిరమై ఉంటుంది. అలాంటి మనస్సుకు జ్ఞానార్హత
ప్రాప్తించదు. కనుక అదంభిత్వమే అనుసరణీయము. ఆచరణీయము.

**(3) అహింస**

ప్రాణులను హింసించక పోవడం, పీడించక పోవడం అహింస ***(అహింసనమ్ ప్రాణినాం అపీడనమ్
అహింసా!).*** ఇది ధార్మిక లక్షణము. ఎవరైనా మనల్ని హింసిస్తే మనం బాధ పడతాము కదా! మరి ఇతరులు
మన నుండి ఏమి ఆశిస్తారు? మన చేత హింసింప బడాలి అని అనుకోరు కదా! కనుకనే ***హింసాం న కుర్యాత్ -***
ఎవరినీ హింసించకు అనే విధి వాక్యాన్ని వేదం ఘోషించింది. మనోవాక్కాయముల చేత ఎవరినీ బాధించకుండా
ఉండటమే అహింసనము. భూతదయ, బ్రహ్మచర్యాదులకు అహింస ఉపలక్షణం అని గ్రహించాలి.

మనచే హింసింపబడి ఇతరులు దుఃఖాన్ని అనుభవించుటను చూచి మనం సుఖ పడగలమా? కనుక,
నేను సుఖపడాలి అని భావించే వాడు పరులను హింసించుటను త్యజించాలి ***(సుఖీస్యామితి విజ్ఞాయ పరపీడాం***
నేను సుఖపడాలి అని భావించే వాడు పరులను హింసించుటను త్యజించాలి. అందువల్ల జ్ఞానార్హతను కోల్పోతుంది.
***వివర్జయేత్).*** హింసా ప్రవృత్తిలో కుమిలే చిత్తం కలుషితమై ఉంటుంది. అందువల్ల జ్ఞానార్హతను కోల్పోతుంది.

**(4) క్షాంతి**

పరులను మనం పీడించకుండా ఉండే ఉత్తమ గుణము అహింస అయితే, పరులు మనల్ని బాధించి
నపుడు, పరుల అపరాధము మనకు అనర్థాన్ని కలిగించి నపుడు మనస్సులో ఏ విధమైన వికారము లేకుండా,
ప్రశాంతముగా ఉండటము క్షాంతి ***(పరాపరాధప్రాప్తౌ అవిక్రియా).*** చిత్త వికారాన్ని కలిగించే పరుల ప్రవర్తనమును
నిర్వికార చిత్తముతో గ్రహించడము క్షాంతి. అంతేగాని, ఎదుర్కొనే శక్తి లేక మౌనంగా దుఃఖాన్ని భరించడం
క్షాంతి కాదు. అది చిత్త విక్షేపము. ఇతరుల ప్రవర్తనము మన లోని శాంతికి విఘాతం కలిగించకుండా ఉండాలి.
క్షాంతి గల వారికే అది సాధ్య పడుతుంది. అలాంటి వారే ప్రశాంత చిత్తులై జ్ఞానాన్ని సాధించ గలుగుతారు.

**(5) ఆర్జవము**

వ్యవహారంలో ఋజు వర్తనము కలిగి ఉండటమే ఆర్జవము ***(ఆర్జవమ్ ఋజు భావః).*** వక్రత్వం లేకుండా
ప్రవర్తించడమే ఋజు స్వభావము. త్రికరణ శుద్ధితో జీవించడము. కుటిలత్వం లేని ప్రవర్తనము, మోస మెరుగని
శీలము ఆర్జవము యొక్క లక్షణాలు. ద్వంద్వ వైఖరికి అవకాశం లేని జీవనము. నిష్కాపట్యము గల జీవనము.
ధర్మజీవనము. మాయ లెరుగని, మర్మ మెరుగని స్వచ్ఛమైన స్ఫటికం లాంటి సరళ జీవనము ఆర్జవ ప్రసాదము.

**(6) ఆచార్యోపాసనము**

మోక్ష మార్గాన్ని ఉపదేశించే గురుదేవునికి శుశ్రూషాదులు చేస్తూ, నిరంతర సేవనంలో తృప్తి చెందడము
ఆచార్యోపాసనము ***(మోక్ష సాధనోపదేష్టుః ఆచార్యస్య శుశ్రూషాది ప్రయోగేణ సేవనమ్ ఆచార్యోపాసనమ్).***
వాస్తవానికి ఇది గురుసేవ. ఆచార్యసేవ. కాని, ఆచార్య సేవ అనకుండా ఆచార్య ఉపాసనము అని ఆదిదేవుడే
అంటున్నాడంటే, దాని ప్రాశస్త్య ప్రభావా లెలాంటివో ముముక్షువులు గుర్తించాలి. గురుశుశ్రూష అనేది దైవాన్ని
ఉపాసించినట్లు ఉండాలే గాని, దీనులను సేవించినట్లు ఉండ కూడదు.

**యద్యపి ఉద్దామ బుద్ధిః పఠిన పరిణమ ద్వేద శాస్త్రాక్షరార్థో**
**న హి ఆచార్యం వినాఽ సౌ తదపి పరిచినో త్యే తదుక్తం రహస్యమ్ ॥**

'మేధావంతులైన వారు వేద శాస్త్రాలను అధ్యయనం చేసి, వాటి అర్థాలను గ్రహించ వచ్చు. కాని, ఆచార్యుడు లేకుండా వాటి రహస్యార్థాలను గ్రహించ లేరు' అన్నారు శతశ్లోకీ గ్రంథంలో శ్రీ శంకరాచార్యస్వామి. అట్టి గురు ఋణాన్ని గురువును ఎలా సేవించి తీర్చుకోవాలో ముముక్షువులే ఆలోచించుకోవాలి. ఆచార్యబోధ లేకుండా జ్ఞానప్రాప్తికి అవకాశం లేనందున ఆచార్య సేవనము కూడా జ్ఞానోత్పత్తి సాధనమే.

**(7) శౌచము**

శౌచము అంటే శుద్ధి. దేహ మాలిన్యాన్ని, మట్టి, నీళ్ళు మొదలైన వాటితో ఎలా శుభ్రం చేసుకుంటామో, అలాగే మనస్సు లోని రాగద్వేషాది మాలిన్యాన్ని ప్రతిపక్ష భావన చేత నిర్మూలించుకోవడాన్ని శౌచమని జ్ఞానసాధనలలో చెబుతారు **(కాయ మలానాం మృజ్జలాభ్యాం ప్రక్షాలనమ్. అన్తశ్చ మనసః ప్రతిపక్ష భావనయా రాగాది మలాప నయనం శౌచమ్).**

శరీర మాలిన్యాన్ని జలాదుల చేత శుద్ధి చేసుకోవడాన్ని బాహ్య శౌచము అంటారు. మనో మాలిన్యమైన రాగాదులను ప్రతిపక్ష భావన చేత తొలగించు కోవడాన్ని అభ్యంతర శౌచము అంటారు. ప్రస్తుతం మోక్ష సాధన రూపమైన శౌచము నందు ఈ రెండూ అనుసరణీయాలే. ఆచరణీయాలే. మృజ్జలాదులతో బాహ్య శుద్ధి చేసుకోవడం వలన, రాగాదుల యందు దోష దర్శనము వలన, అలాగే రాగాదులకు ప్రతికూల గుణాలను అవలోకించి అవలంబించడం వలన మనస్సులో భావశుద్ధి ఏర్పడి, మనస్సు జ్ఞానాన్ని పొందడానికి అర్హతను సాధిస్తుంది.

**(8) స్థైర్యము**

స్థిరముగా ఉండటము స్థైర్యము. మోక్ష మార్గము నందు స్థిరంగా ఉండటము స్థైర్యము. మోక్ష మార్గములో ఎన్ని అవరోధాలు ఎదురైనా, ప్రతిబంధకాలు అడ్డు నిలిచినా, విఘ్నములు సంభవించినా, మోక్ష సాధనలైన శ్రవణ మనన నిదిధ్యాసలను విడిచి పెట్టకుండా, ప్రయత్నంతో, శ్రద్ధతో సాధనలను కొనసాగించే స్థిరత్వమే స్థైర్యము **(స్థైర్యమ్ స్థిర భావః మోక్షమార్గ ఏవ కృతాధ్యవసాయత్వమ్).**

**(9) ఆత్మ వినిగ్రహము**

దేహేంద్రియా లనే కార్యకరణ సంఘాతము మోక్ష మార్గమునకు వ్యతిరేకంగా ప్రవర్తించడము సహజము. అలా మార్గము తప్పినపుడు, దానిని నిగ్రహించి సన్మార్గంలో కట్టుదిట్టం చేయడం ఆత్మ వినిగ్రహము. నిరోధ స్వభావము గల ఈ నిగ్రహము చిత్త విక్షేపాన్ని అరికట్టి, మనస్సును మోక్ష మార్గము నందే సమాహితం చేస్తుంది **(ఆత్మ వినిగ్రహః ఆత్మనః అపకారకస్య ఆత్మశబ్ద వాచ్యస్య కార్యకరణ సంఘాతస్య, వినిగ్రహః స్వభావేన సర్వతః ప్రవృత్తస్య సన్మార్గే ఏవ నిరోధః ఆత్మవినిగ్రహః).** ఇది దేహేంద్రియ సంయమము. జ్ఞాన విషయాన్ని ప్రవచించే ఐదు శ్లోకాలలో తొమ్మిది జ్ఞానసాధనలను తెలియ చేసిన మొదటి శ్లోకం సమాప్త మైంది.

*మరి కొన్ని జ్ఞాన సాధనలను తరువాత శ్లోకంలో చెప్పుకుందాం.*

**ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।** 8
**జన్మమృత్యు జరావ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్ ॥**





*ఇంద్రియార్థేషు-వైరాగ్యం-అనహంకారః-ఏవ-చ*
*జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషాను దర్శనం*

| | |
|---|---|
| ఇంద్రియా ర్థేషు = ఇంద్రియ విషయముల యందు | జన్మమృత్యుజరావ్యాధి |
| వైరాగ్యం = విరక్తి | దుఃఖ దోషానుదర్శనం = జననము, మరణము, ముసలి తనము, వ్యాధుల వలన కలిగెడి దుఃఖ దోషములను గ్రహించుట |
| అనహంకారః | |
| ఏవ చ = అహంకారము లేకపోవడము | |

**అర్జునా! ఇంద్రియ విషయాల యందు వైరాగ్యము, అహంకారము లేకపోవడం, జన్మ, మృత్యువు, ముసలితనము, వ్యాధుల లోని దుఃఖాన్ని దర్శించడము - ఇవి కూడా జ్ఞానసాధనలే.**

**వ్యాఖ్య**

**(10) ఇంద్రియ విషయాలలో వైరాగ్యము**

ఇంద్రియాలను క్షోభ పెట్టే శబ్దాది విషయాల యందు ఆసక్తి, అనురక్తి లేకపోవడమే ఇంద్రియార్థము లందు వైరాగ్యము ***(శబ్దాదిషు భోగేషు విరాగ భావః వైరాగ్యమ్).*** శ్రీ శంకరాచార్య స్వామి భాష్యంలో దృష్టా దృష్ట ఇంద్రియ విషయ భోగాల యందు అనురాగము లేకపోవడము వైరాగ్యము అన్నారు ***(దృష్టా దృష్టేషు భోగేషు).*** దృష్టములు అంటే కనిపించేవి. అదృష్టములు అంటే, కనిపించకుండా వినిపించేవి. కనిపించేవి ఇహలోక భోగాలు, కనిపించకుండా కేవలం వినిపించేవి పరలోక భోగాలు. ఇహపరాల లోని ఇంద్రియ భోగాల యందు విరక్తి కలిగి ఉండటము వైరాగ్యము. పూర్వ శ్లోకంలో మనం చూచిన స్థైర్య ఆత్మవినిగ్రహాలకు వైరాగ్యము ఊతగా నిలుస్తుంది.

ఇంద్రియ విషయ భోగాల యందు విరక్తి చెందడము అంటే, విషయాలకు దూరంగా పరుగు తీయడ మని కాదు. ఇంద్రియ విషయాల నుండి మనిషి దూరం కావచ్చు. అంత మాత్రాన మనస్సు వాటి నుండి దూరం కాదు. చదువుకోవడం మాని బొమ్మలతో ఆడుకుంటున్న పిల్లవాడి చేతి నుండి బొమ్మను లాక్కొని, అతడి చేతికి పుస్తకాన్ని ఇచ్చి కూర్చో బెట్టగలం. అంతమాత్రం చేత పిల్లవాణ్ని చదివించ లేము. బొమ్మను దూరం చేయ గలమేమో గాని, బొమ్మపై వాడి కుండే ఆసక్తిని దూరం చేయలేము. పిల్లవాడు పెరుగుతూ ఉంటే, అతనిలో జ్ఞానం వృద్ధి చెందుతూ ఉంటే, బొమ్మలు వాటంతట అవే దూర మవుతాయి. పుస్తకాలు చేతిలో కనిపిస్తాయి. మనిషికి ఇంద్రియ విషయాల లోని దోషాలు తెలిసి రావడంతో పాటు జ్ఞానాసక్తి పెరిగితే, మనస్సులో విషయాల పట్ల పూర్ణ వైరాగ్యం ఏర్పడుతుంది. వైరాగ్యం ఉన్నప్పుడే జ్ఞానం సిద్ధిస్తుంది.

**(11) అనహంకారము**

అహంకారము లేకపోవడమే అనహంకారము ***(అహంకార అభావః అనహంకారః).*** నేను శ్రేష్ఠుడను, ఉత్కృష్టుడను అనే గర్వమే అహంకారము. అది లేకపోవడమే అనహంకారము. కొందరిలో జాత్యహంకారము ఉంటుంది. నేను గొప్ప జాతిలో జన్మించాను. అగ్రకులంలో జన్మించాను. నేను విద్యావంతుణ్ణి, నేను రూప వంతుణ్ణి, నేను గొప్ప కళాకారుణ్ణి, గొప్ప వక్తను, గొప్ప గాయకుణ్ణి - ఇలాంటి అభిమానమే అహంకారము. ఇది జ్ఞానప్రాప్తికి ప్రతిబంధకము. ఎత్తైన కొండలపై పడిన వర్షపు జలం అక్కడ నిలవకుండా ఎలా పతన మవుతుందో, అహంకారి మస్తిష్కంలో కూడా జ్ఞానగంగ నిలవకుండా జారి పోతుంది.

మనలో ఏ గొప్పతనాన్ని చూసుకొని మనం గర్వ పడుతున్నామో, ఆ విషయాన్ని అంతరేక్షణ చేసుకుంటే,

మన లోని శ్రేష్ఠత్వానికి దోహద పడిన అనేక అంశాలు కళ్ళ ముందు కదుల్తాయి. అనేక మంది వ్యక్తులు మనస్సులో మెదుల్తారు. ఈ ప్రపంచానికి మనం రిక్త హస్తాలతో వచ్చాం. నేడు మన చేతిలో ఏది ఉన్నా అది ఇక్కడ ఏరుకున్నదే. అంతేకాదు. ఉన్న దేదైనా ఒకనాడు విడిచిపెట్టి పోవలసిందే. ఈ సత్యం అర్థమైతే, అహంకారము ఆవిరై పోతుంది. అనహంకారము ఆభరణంలా నిలిచి శోభిస్తుంది.

## (12) దోష దర్శనం

పుట్టుక నందు, మరణము నందు, వృద్ధాప్యము నందు, వ్యాధులు ప్రాప్తించి నపుడు కలిగే దుఃఖాన్ని, దుఃఖ దోషాన్ని చూడటం కూడా జ్ఞాన లక్షణమే. ఇది పురుషార్థ నిశ్చయాన్ని దృఢం చేస్తుంది. వైరాగ్యాన్ని వృద్ధి చేస్తుంది. ప్రపంచంపై విరక్తిని కలిగించి పరమాత్మపై ఆసక్తిని పెంచుతుంది.

జన్మ, మృత్యు, జరా వ్యాధుల యందలి దుఃఖాన్ని గుర్తించడం, గుర్తించిన దానిని తదేకంగా ఆలోచించడమే అనుదర్శనము ***(అనుదర్శనమ్ ఆలోచనమ్).*** చూడటం దర్శన మైతే, మళ్ళీ మళ్ళీ చూడటం అనుదర్శనము. దర్శించడము అంటే అర్థం చేసుకోవడం అని భావము. జననమరణాది దుఃఖ హేతువులతో జీవితం నిండి ఉంది అనే సత్యాన్ని అర్థం చేసుకోవడమే అనుదర్శనము.

జీవితం క్షణ భంగురము. అంతా క్షణాల్లోనే జరిగి పోతుంది. ఒక క్షణంలో మనిషి పుడతాడు. క్షణంలో పుట్టిన మనిషి ఇంకొక క్షణంలో కన్ను మూస్తాడు. రెప్పపాటు జీవితంలో జననమరణాల మధ్య, వ్యాధులు, వృద్ధాప్యము పీడిస్తాయి. దేహ బాధలు, మనో వ్యథలు, సంబంధాలలో సంక్లిష్టాలు, అన్నీ దుఃఖాన్ని పెంచి పోషించేవే.

జీవితంలో ఎవరు తోడు ఉంటారో తెలియదు. ఎవరున్నా, లేకపోయినా దుఃఖం మాత్రం జీవితాంతం మనతో కలిసే ఉంటుంది. పుట్టుకతో కలిసి వచ్చిందని కాబోలు చావులో కూడా కలిసే ఉంటుంది. వేదనా భరిత మైన జీవితం లోని దుఃఖాన్ని దూరం చేసుకోవాలి అంటే, దుఃఖ దోషాన్ని దర్శించడమే గాక, పరివర్తన చెంది బ్రతుకును భగవదారాధనలో నివేదనగా మార్చుకోవాలి.

మనస్సు చంచలము. వయస్సు బుద్బుదము. ఆకారాలన్నీ వికారం చెందేవే. కాయము ఎవరి దైనా, ఎంతటి వారి దైనా కాష్ఠంలో కాలి పోయేదే. ఏదీ స్థిరం కాని ఈ ప్రపంచంలో మనలను ఉద్ధరించేది జ్ఞాన మొక్కటే.

చరణము: **మనసు కోడె నాగు - వయసు కొండ వాగు**
**సొగసు కారు మబ్బు - తెలుసు వాటి రూపు**
**మంటల మయము కాటిలో కాయము**
**ఏ జీవి కైనా ఇదే చివరి న్యాయము**

పల్లవి: **సాధన సాగనీ స్వామీ**
**వేదన లన్నీ ఆగిపోనీ** ॥ సాధన ॥

అవి కర్తవ్యాన్ని వెన్ను దట్టి ఎరుక పరచింది చైతన్య గీతిక.

మరి కొన్ని జ్ఞాన సాధనలను ప్రసాదిస్తున్నాడు.

**అసక్తి రనభిష్వఙ్గః పుత్రదార గృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వ మిష్టాని ష్టోపపత్తిషు ॥** 9





*అసక్తిః-అనభిష్వంగః-పుత్రదార గృహాదిషు*
*నిత్యం-చ-సమచిత్తత్వం-ఇష్టానిష్టోపపత్తిషు*

| | | | |
|---|---|---|---|
| పుత్రదారగృహాదిషు | = పుత్రుడు, సతి, గృహాదుల యందు | ఇష్టానిష్టోపపత్తిషు | = ఇష్టానిష్టముల యందు |
| అసక్తిః | = ఆసక్తి లేకుండుట | నిత్యం | = ఎల్లప్పుడు |
| అనభిష్వంగః | = ప్రీతి లేకుండుట | సమచిత్తత్వం చ | = సమ బుద్ధి |

**అర్జునా! అసక్తి, పుత్ర కళత్ర గృహాదుల యందు అత్యాసక్తి లేకపోవడం, ఇష్టమైనది లభించినా, అనిష్ట మైనది ప్రాప్తించినా , సదా సమచిత్తంతో మెలగటం - ఇదంతా జ్ఞానమే.**

**వ్యాఖ్య**

## (13) అసక్తి

ఆకర్షించే విషయాల యందు ప్రీతిని 'సక్తి' అంటారు. అది లేకపోవడము అసక్తి ***(సంగ నిమిత్తేషు విషయేషు ప్రీతి మాత్రం సక్తిః : తదభావః అసక్తిః).***

'నాది' అనే మమత్వ భావనయే ప్రీతి. అదే సక్తి. భార్యాపుత్రాదుల యందు గాని, క్షేత్ర గృహ వాహనాదుల యందు గాని మమకారమును కలిగి ఉండటమే ప్రీతి. అదే సక్తి. సక్తి లేకుండా ఉండటమే అసక్తి. మనది కాని దాని యందు, మనకు ప్రాప్తించని దాని యందు, మనల్ని ఆకర్షించని దాని యందు మనకు ఎలాగైతే ప్రీతి ఉండదో, అలాగే మనకు ప్రాప్తించినవి, మనవిగా ముద్రపడిన విషయాల యందు కూడా అలాగే ప్రీతి లేకుండా ఉండటము అసక్తి. జన్మమృత్యు జరావ్యాధి దుఃఖాల యందు దోష దర్శనము చేయడ మనే కార్యము యొక్క ఫలమే ఈ అసక్తి భావము.

మనకు ఏవైనా ఉండవచ్చు. మనకు ఉన్నవి మనల్ని బాధించవు. మనవిగా ఉన్నవే బాధిస్తాయి. బంధిస్తాయి. ప్రపంచంలో ఉన్న వన్నీ పరమేశ్వరునికి సంబంధించినవే గాని మనవి కావు. వస్తువు భగవంతునిది. వినియోగము మనది. ఈ సత్యాన్ని బుద్ధికి పట్టించి విషయాల యందు, వ్యక్తుల యందు ప్రీతి లేకుండా ఉండటము అసక్తి.

## (14) అనభిష్వంగము

పుత్ర కళత్ర గృహాది విషయాలలో అభిష్వంగము లేకుండా ఉండటము అనభిష్వంగము. అభిష్వంగము అంటే అతి ప్రీతి, అత్యాసక్తి, అతి స్నేహం. అది లేకుండా ఉండటము అనభిష్వంగము.

ఏవీ మనవి కావు, ఎవరూ మన వాళ్ళు కారు. అందరూ అన్ని కాలాలలో మనతో కలిసి ఉండలేరు. ఎవరూ మనతో కలిసి రాలేదు. పోయేనాడు ఎవరూ తోడు రారు. మనవి కాని వాటిని మనవిగా భావించడమే దుఃఖ కారణము. ఈ వాస్తవాన్ని గ్రహించిన తరువాత విషయాల యందు అసక్తి ఏర్పడుతుంది. అసక్తి కారణంగా అభిష్వంగము క్షీణించి అనభిష్వంగము సిద్ధిస్తుంది.

ఇంతకీ ఎవరితో అభిష్వంగము, ఎవరితో అతిస్నేహము అంటే, పుత్ర దార గృహాదుల యందు అతిప్రీతి అంటున్నాడు. కారణం, అన్యులైన వారు తామే అనే భావనను ఈ అతి స్నేహం కలిగిస్తుంది ***(అన్యాత్మ భావనా లక్షణః).*** వాళ్ళు సుఖంగా ఉంటేనే నేను సుఖంగా ఉంటాను; వాళ్ళు దుఃఖపడుతూ ఉంటే నేను కూడా వాళ్ళతో పాటు దుఃఖ పడతాను ***(యథా అన్యస్మిన్ సుఖిని దుఃఖిని వా అహమేవ సుఖీ దుఃఖీ చ).*** వాళ్ళు బ్రతికి ఉంటేనే నేను బ్రతికి ఉంటాను; వాళ్ళు మరణిస్తే నేనూ మరణిస్తాను ***(జీవతి మృతేవా అహమేవ జీవామి***

**మరిష్యామి చ ఇతి).** ఇదంతా అభిష్వంగము. ఈ విధమైన అభిష్వంగము లేకపోవడము అనభిష్వంగము. **పుత్రదార గృహాదిషు - ఆదిషు** - 'మొదలైన వాటి యందు' అనడంలో, బంధువర్గము నందు, మిత్రుల యందు, దాస వర్గము నందు కూడా ఆసక్తి, అభిష్వంగము లేకుండా జీవించే వైఖరి జ్ఞానానికి సహకారి అవుతుంది అని అర్థం.

**(15) సమచిత్తత్వము**

ఎల్లప్పుడు సమమైన చిత్తముతో ఉండటము సమచిత్తత్వము ***(నిత్యం చ సమచిత్తత్వం తుల్య చిత్తతా).*** ఎక్కడ, ఏ విషయములో సమచిత్తత్వము అంటే, ఇష్టానిష్టోపపత్తుల యందు సమ చిత్తముతో ఉండటము అంటున్నాడు. ఇష్ట మైనవి ప్రాప్తించడం ఇష్టోపపత్తి. అనిష్టాలు ప్రాప్తించడం అనిష్టోపపత్తి. ఈ రెండిటిలో కూడా ఒకే విధమైన బుద్ధితో ఉండటము సమచిత్తత్వము. అంటే, ఇష్ట మైనవి ప్రాప్తించి నపుడు సంతోషించడు ***(ఇష్టోప పత్తిషు న హృష్యతి).*** అనిష్ట మైనవి సంప్రాప్త మైనపుడు క్రుద్ధుడు కాడు ***(న కుప్యతి చ అనిష్టోప పత్తేషు).*** నిరంతరము ఈ విధమైన సమబుద్ధితో ఉండటము జ్ఞానము. హర్ష విషాదాలకు లోను గాకుండా జీవించే వ్యక్తి ఆత్మజ్ఞానాన్ని పొందడానికి అర్హు డవుతాడు.

మనం అనుకున్న వన్నీ జరగాలని, జరిగితే బాగుండు నని ఆశించడం తప్పు కాదు. కానీ, అలా జరగ నపుడు చింతించడం భావ్యం కాదు. కారణాలు లేకుండా కార్యాలు ఉండవు. జరిగేవి జరిగి తీరుతాయి. జరిగే వాటిని మనం ఆప లేము. జరగని వాటిని మనం జరిపించ లేము.

ఈ సృష్టిలో ధర్మా లున్నాయి. నియతి ఉంది. అందే వన్నీ కర్మఫలాలే. మనకు అందేవే కనిపిస్తాయి. మనం ఆచరించిన కర్మలు కనిపించవు. మనకు ఏది అందినా, అది ఇష్టమైనా, అయిష్టమైనా అంద దగిందే అందుతుంది. మన కర్మఫలం మనకు అందక పోతే మరెవరికి అందుతుంది? అందించే వాడు పరమేశ్వరుడు. కనుక, అందేది ఏదయినా పరమేశ్వర ప్రసాదమే. ఈ విధమైన అవగాహన కర్మయోగంలో సిద్ధిస్తే, ఇష్టానిష్టాలు ప్రాప్తించి నపుడు పొంగ కుండా, క్రుంగ కుండా మనిషి సమంగా, ప్రశాంతంగా ఉండ గలడు. ఈ విధమైన సమచిత్తము నిరంతరము ఉండ గలిగితే ఆత్మజ్ఞానము సులభ సాధ్య మవుతుంది. ఈ విధమైన సమబుద్ధియే జ్ఞానము ***(తచ్చ ఏతత్ సమచిత్తత్వం జ్ఞానమ్).***

*తరువాత శ్లోకంలో మరి కొన్ని జ్ఞాన సాధనలు చెబుతున్నాడు.*

**మయి చా నన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।** 10
**వివిక్తదేశ సేవిత్వ మరతి ర్జనసంసది ॥**

***మయి-చ-అనన్య యోగేన-భక్తిః-అవ్యభిచారిణీ***
***వివిక్తదేశ సేవిత్వం-అరతిః-జనసంసది***

| | | | |
|---|---|---|---|
| మయి | = నా యందు | వివిక్తదేశ సేవిత్వం | = ఏకాంత ప్రదేశము నందుండుట |
| అనన్యయోగేన | = అనన్య యోగము చేత | జనసంసది | = ప్రజా సమూహము నందు |
| అవ్యభి చారిణీ | = మార్పు లేని | అరతిః | = ఇష్టము లేని |
| భక్తిః చ | = భక్తియు | | |

**అర్జునా! అన్య భావన లేని భక్తి, ఏకాంత జీవనము, జన సంగము లేకపోవడము - ఇది కూడా జ్ఞానమే.**





**వ్యాఖ్య**

**(16) అనన్య భక్తి**

అనన్య యోగంతో భగవంతుని యందు అకుంఠితమైన భక్తిని కలిగి ఉండటము కూడా జ్ఞానమే. వాసుదేవుడే భగవంతుడు. వాసుదేవునికి మించిన దైవము లేదు ***(న అన్యః భగవతః వాసుదేవాత్ పరః అస్తి).*** అట్టి వాసుదేవుడే నాకు గతి ***(స ఏవ నో గతిః)*** అనే నిశ్చయమైన బుద్ధియే అనన్య యోగము ***(ఇత్యేవం నిశ్చితా బుద్ధిః అనన్య యోగః).*** అట్టి యోగంతో ఈశ్వరుడైన వాసుదేవుని యందు అచంచలమైన భక్తిని కలిగి ఉండటము కూడా జ్ఞానమే ***(తేన భజనం భక్తిః ! సా చ జ్ఞానమ్).*** భగవద్భక్తి వలన భగవదనుగ్రహము ప్రాప్తిస్తుంది. ఈశ్వరానుగ్రహము వలన జ్ఞానము కలుగుతుంది.

భక్తి అనేది పరమ ప్రేమ స్వరూపము. ప్రేమ ఎక్కడ ఉంటుందో మనస్సు అక్కడే ఉంటుంది. ప్రియమైన వస్తువు నుండి మనస్సు దూరం కాలేదు. భక్తి ద్వారా పరమేశ్వరుడే ప్రియాతిప్రియంగా మారి నపుడు, పరమేశ్వరునికి దూరంగా మనస్సు మనుగడను సాగించ లేదు. అదే అనన్య భక్తి. అట్టి భక్తియోగము చేత పరమేశ్వరునే ఏకైక ధ్యేయంగా భావించి సేవించడం జరుగుతుంది. వాసుదేవుడే నాకు గతి, వాసుదేవునికి మించిన దైవము లేదు అనే అనన్యభక్తి ఏర్పడి నపుడు మోక్షమే పరమావధిగా ఆ భక్తి సాగుతూ ఉందని భావము.

ఉత్కృష్టమైన వాడు వాసుదేవుడే అనే భక్తి కారణంగా అమానిత్వం సిద్ధిస్తుంది. అట్టి భక్తిలో భక్తుడు వినమ్రుడు అవుతాడు కనుక అదంభిత్వం ప్రాప్తిస్తుంది. అందరిలో వసించే వాసుదేవుని ఆరాధించుట చేత ఎవరినీ భక్తుడు హింసించ లేడు. అహింసా జీవనాన్ని గడుపుతాడు. వాసుదేవుని అనుగ్రహం చేతనే సర్వమూ సమకూరుతూ ఉంది అనే దృఢ నిశ్చయము ఏర్పడి ఉన్నందున, పరిస్థితులను, ప్రతికూలాలను సైతం అవగాహనతో సంతోషంగా సహిస్తాడు. అట్టి వాసుదేవ భక్తుడు కుటిలత తెలియని వాడు కనుక ఋజు మార్గంలో వర్తిస్తాడు. భగవంతుని జ్ఞానమును పొందే ప్రయత్నంలో ఆచార్యుని అర్చిస్తాడు. బాహ్యాభ్యంతరాలలో శుచిర్భూతుడై ఉంటాడు. దేనికీ చలించక, భగవంతుని అండతో సదా నిగ్రహవంతుడై ఉంటాడు. భగవంతుని యందే ఆసక్తి కనుక విషయాలలో విరక్తుడై ఉంటాడు. సర్వకర్త సర్వేశ్వరుడే అనే భావనా ప్రభావం చేత అహంకార రహితుడై ఉంటాడు. భగవంతుని కన్నా అన్యమైనది అనిత్య మని భావించి నిర్లిప్తుడై జీవనాన్ని సాగిస్తాడు. తన దంటూ లేక, తన వారంటూ ఎవరినీ భావించక, అతి స్నేహం లేకుండా, ప్రాప్తించే సమస్తమును ప్రసాదంగా స్వీకరిస్తూ, ప్రశాంత చిత్తముతో సమచిత్తుడై ఉంటాడు. ఇదే భక్తి వైభవము. ఇలా అనన్య యోగము చేత కొనసాగే వాసుదేవ భక్తిలో అన్ని జ్ఞాన సాధనలు ఒదిగి ఉంటాయి. కనుకనే, భక్తి లేకుండా ముక్తిని సాధించడం దుస్సాధ్యము. వాసుదేవుని యందు అచంచల భక్తి గల వారు శీఘ్రంగా జ్ఞానులై తరిస్తారు. అది లేని వారు తరించ లేరు అని వాసుదేవుడే తన దివ్య వాణిని వినిపించాడు.

**ప్రీతి ర్న యావ న్మయి వాసుదేవే న ముచ్యతే దేహ యోగేన తావత్ !**

'వాసుదేవుడ నైన నా యందు ఎంత వరకు ప్రీతి కలగదో, అంతవరకు దేహ సంబంధము గల జన్మల నుండి విముక్తి లభించదు'.

**(17) వివిక్త దేశ సేవిత్వము**

ఏకాంత ప్రదేశము నందు జీవించే అలవాటును, ఆసక్తిని కలిగి ఉండటము వివిక్త దేశ సేవిత్వము.

సాధకుడు తన సాధనను నిర్విఘ్నంగా కొనసాగించడానికి ప్రదేశం కూడా అనుకూలంగా ఉండాలి. ఏకాంత ప్రదేశము ఆధ్యాత్మిక సాధనలకు అనుకూలము.

ఏకాంతము అనే పదములో ఏకమే ప్రధాన మైనప్పటికి అది రెండు విధాలుగా ఉంటుంది. మొదటిది బాహ్య ఏకాంతము. రెండవది అభ్యంతర ఏకాంతము. బాహ్యంలో జన సంసర్గము లేకుండా, ప్రశాంతమైన, విఘ్న రహితమైన ప్రదేశము బాహ్య ఏకాంతము. అలాంటి ప్రదేశము అరణ్య, నదీ తీర, గుహాదు లనే సహజ ప్రదేశాలు కావచ్చు. లేదా, ప్రయత్నము ద్వారా, శుద్ధి కార్యం ద్వారా సంస్కరించు కొనిన ప్రదేశాలు, దేవాలయాలూ కావచ్చు ***(వివిక్తః స్వభావతః సంస్కారేణ వా అశుచ్యాదిభిః రహితః).*** అట్టి ప్రదేశాలలో భగవంతుని సేవించాలి. ఇది బాహ్య ఏకాంతము.

ఇక రెండవది అభ్యంతర ఏకాంతము. మనస్సులో విషయ చింతనము లేకుండా, నిరంతరము పరమేశ్వరుని స్మరణము నందే ఉండుట అభ్యంతర ఏకాంతము. ***ఏకః అంతః నిశ్చయో యత్ర తత్ ఏకాన్తమ్ -*** అంతర్యంలో ఒక్క పరమేశ్వరునికి సంబంధించిన నిశ్చయ భక్తితో ఉండటము అసలైన ఏకాంతము. అదే అభ్యంతర ఏకాంతము. ఇది కూడా జ్ఞాన సాధనమే.

**(18) అసంగ జీవనము**

జనసంగము నందు ఆసక్తి లేకపోవడము అరతిర్జన సంసది అనే పద్దెనిమిదవ లక్షణము. ఇక్కడ జనసంగము అంటే పామర జన సంగము అని అర్థము. పామరులు ***(ప్రాకృతానాం).*** సంస్కారహీనులు ***(సంస్కార శూన్యానామ్).*** అవినీతిపరులు ***(అవినీతానాం)*** అయిన పామరజనుల సమూహాన్నే ఇక్కడ జన సమూహము ***(జన సంసత్)*** అనడం జరిగింది. అంతేగాని ఉత్తమ సంస్కారులు, వినయ సంపన్నులు, భక్తులు అయిన జనుల విషయం కాదు. ఎందుకంటే అట్టి సత్పురుషుల సాంగత్యము జ్ఞానానికి ఉపకారకంగా ఉంటుంది ***(తస్యాః జ్ఞానోపకారకత్వాత్).***

సత్పురుషుల సాంగత్యము జ్ఞానానికి ఎలా ఉపకరిస్తుందో, అలాగే దుష్టుల సహవాసము జ్ఞానానికి ప్రతిబంధకము అవుతుంది. జ్ఞాన ప్రతిబంధకాలను తొలగించుకోవడము కూడా జ్ఞాన సోపానమే కావడం చేత, దుష్టుల సంగత్యము నందు ఆసక్తి లేకపోవడం కూడా జ్ఞాన సాధనంగా చెప్పబడింది ***(ప్రాకృత జన సంసది అరతిః జ్ఞానార్థత్వాత్ జ్ఞానమ్).***

*తరువాత శ్లోకంలో చివరి రెండు జ్ఞాన విషయాలను చెప్పి, జ్ఞానమనే అంశాన్ని ముగిస్తున్నాడు.*

**అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।**
**ఏత జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥** 11

**అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం-తత్త్వజ్ఞానార్థ దర్శనం**
**ఏతత్-జ్ఞానం-ఇతి-ప్రోక్తం-అజ్ఞానం-యత్-అతః-అన్యథా**

| | | | |
|---|---|---|---|
| అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం | = ఆత్మజ్ఞాన నిత్యత్వము | అతః | = దీని కంటెను |
| తత్త్వజ్ఞానార్థదర్శనం ఏవ చ | = తత్త్వజ్ఞాన స్వరూపానుభవము | అన్యథా | = వేరుగా |
| ఏతత్ | = ఇదియంతయు | యత్ | = ఏదియో |
| జ్ఞానం | = జ్ఞానము | తత్ | = అది |
| ఇతి | = అని | అజ్ఞానం | = అజ్ఞానము |
| ప్రోక్తం | = చెప్పబడినది | | |





**అర్జునా! అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వము, తత్త్వ జ్ఞానార్థ దర్శనము - దీనినే జ్ఞానం అన్నారు. దీనికి అన్యంగా ఏది ఉన్నా అదంతా అజ్ఞానమే.**

**వ్యాఖ్య**

**(19) అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వము**

ఆత్మానాత్మ వివేక జ్ఞానము అధ్యాత్మ జ్ఞానము. అట్టి జ్ఞానము నందు నిరంతరము ఉండటము అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వము ***(ఆత్మాది విషయ జ్ఞానమ్ అధ్యాత్మ జ్ఞానమ్ ; తస్మిన్ నిత్య భావః నిత్యత్వమ్).*** అట్టి వివేక జ్ఞానము సాధన చతుష్టయ సంపదను సముపార్జించుకొని, జ్ఞాన యోగ్యతను పొంది 'తత్త్వమసీతి' వాక్యార్థ జ్ఞానానికి కారణ మవుతుంది. అనిత్యమును త్యజించి, నిత్యవస్తువును వెంబడించే అవకాశమును కల్పిస్తుంది.

కాలగత మైనది ఏదైనా కాలంలో నశించి పోతుంది. అది అనిత్యము. దీనిని యుక్తి ద్వారా కూడా తెలుసుకోవచ్చు. శాస్త్ర పఠనము ద్వారా నైతే మరింత స్పష్టత కలుగుతుంది. ఎలాగైనా, అనిత్య మనేది ఏమిటో అర్థమైతే, ఇంతవరకు జీవితంలో మనం ఆశించింది, పొందింది, పోగొట్టుకున్నది అంతా అనిత్యమే అనే వివేకం ఏర్పడుతుంది.

ఇహ పరలోకాలలో ఏది పొందినా కాలం లోనే పొందడం జరుగుతుంది కనుక కాలం లోనే పోగొట్టు కోవడం కూడా జరుగుతుంది. అంతా అనిత్యం గానే అర్థ మవుతు న్నప్పుడు మరి నిత్య మేమిటి? అనే ప్రశ్న పుడుతుంది. ఇహ పరాలు కాకుండా ఏది మిగిలి ఉందో అదే నిత్యం కావాలి. నిత్య వస్తువు కావాలి. అదేదో కాదు. అన్వేషించే వాడి స్వరూపమే. ఆలోచించే వాడి స్వరూపమే. విచారించే వాడి స్వరూపమే. అదే ఆత్మ. అదే నిత్యవస్తువు. కనుక, ఇక చేయవలసింది ఒక్కటే. ఆత్మను దర్శించడము. అదే నిత్యదర్శనము ***(ఆత్మా వా అరే ద్రష్టవ్యః).*** ఆత్మ జ్ఞాత యొక్క స్వరూపమే కనుక ఆత్మ జ్ఞానరూపంలో ఉంది. కనుక ఆత్మను దర్శించడము అంటే వేదాంత శాస్త్రాన్ని శ్రవణం చేయడం అని అర్థము ***(శ్రోతవ్యః).*** అలా నిరంతరము శ్రవణ మనన నిదిధ్యాసలలో ఉండటమే అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వము.

**(20) తత్త్వ జ్ఞానార్థ దర్శనము**

సంసార వినాశ రూపమైన మోక్షమే తత్త్వజ్ఞానము ***(తత్త్వ జ్ఞానం, తస్య అర్థః మోక్షః సంసారోపరమః).*** దానిని గూర్చి ఆలోచించడమే తత్త్వజ్ఞానార్థ దర్శనము ***(తస్య ఆలోచనం తత్త్వ జ్ఞానార్థ దర్శనమ్).*** తత్త్వజ్ఞానము యొక్క ఫలితాన్ని గూర్చి ఆలోచించడం చేత దానికి అవసరమైన అమానిత్వాది సాధనలను అనుష్ఠించడంలో ప్రవృత్తి ఏర్పడుతుంది. జ్ఞానసాధనలు సమకూరితే ***సాధనమున పనులు సమకూరు ధరలోన*** అన్నట్లు జ్ఞానం సిద్ధిస్తుంది. జ్ఞానం కలిగితే మోక్షం ప్రాప్తిస్తుంది. దుఃఖ హేతువైన సంసారము సమూలంగా నశిస్తుంది.

కనుక, మోక్షైక కాముకులైన సాధకు లందరు జ్ఞాన సాధనములైన అమానిత్వాది జ్ఞాన విషయాలను అభ్యసించాలి. అమానిత్వ అదంభిత్వాదులు మొదలుకొని తత్త్వజ్ఞానార్థ దర్శనము వరకు ఇరవై సాధన లేవైతే చెప్పబడ్డాయో అదంతా జ్ఞానమే. ఆత్మజ్ఞానానికి ఉపకరించడము చేత ఈ సాధనలు కూడా జ్ఞానం అని చెప్పబడ్డాయి ***(ఏతత్ జ్ఞానం ఇతి ప్రోక్తం జ్ఞానార్థత్వాత్).*** ఈ జ్ఞానానికి భిన్నంగా, విపరీతంగా ఉండే మానిత్వం, దంభిత్వం, హింస ఇత్యాదులన్నీ అజ్ఞానం అనబడతాయి.

*ఈ విధమైన జ్ఞాన సాధనల ద్వారా తెలియబడే జ్ఞాన మేమిటి? జ్ఞేయ మేమిటి? చెబుతున్నాడు.*

జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽ మృతమశ్నుతే ।
అనాదిమ త్పరం బ్రహ్మ న స త్త న్నాస దుచ్యతే ॥ 12

జ్ఞేయం-యత్-తత్-ప్రవక్ష్యామి-యత్-జ్ఞాత్వా-అమృతం-అశ్నుతే
అనాదిమత్-పరం-బ్రహ్మ-న-సత్-తత్-న-అసత్-ఉచ్యతే

| | | |
|---|---|---|
| జ్ఞేయం | = | తెలియదగినది |
| యత్ | = | ఏదో |
| యత్ | = | దేనిని |
| జ్ఞాత్వా | = | తెలిసికొని |
| అమృతం | = | మోక్షమును |
| అశ్నుతే | = | పొందుతారో |
| తత్ | = | దానిని |
| ప్రవక్ష్యామి | = | చెబుతున్నాను |

| | | |
|---|---|---|
| తత్ | = | అది |
| అనాదిమత్ | = | ఆది లేనిది |
| పరంబ్రహ్మ | = | పరబ్రహ్మ |
| సత్ | = | సత్తు |
| న ఉచ్యతే | = | చెప్ప బడదు |
| అసత్ | = | అసత్తని |
| న ఉచ్యతే | = | చెప్ప బడదు |

**అర్జునా! జ్ఞేయాన్ని గూర్చి చెబుతున్నాను. విను. దానిని తెలుసుకుంటే మోక్షం లభిస్తుంది. అది అనాది. పరబ్రహ్మ స్వరూపము. అది సత్తు కాదని, అలాగని అసత్తు కూడా కాదని చెబుతారు.**

### వ్యాఖ్య

అమానిత్వాది ఇరవై సాధనలను 'జ్ఞానం' అంటూ వరుసగా పై ఐదు శ్లోకాలలో చెప్పుకున్నాము. అవి దేనిని పొందటానికి సాధనలో ఇప్పుడు చెబుతున్నాడు. పొంద దగినది ఏదో అది ప్రస్తుతము 'జ్ఞేయం' అనే పదంతో తెలుస్తూ ఉంది. ఇక్కడ పొందడము అంటే తెలియడము అని అర్థము. ***యత్ జ్ఞాతవ్యం తత్ జ్ఞేయం*** - ఏది తెలియ దగినదో అది జ్ఞేయం. ఇక్కడ జ్ఞేయం అని చెప్పబడు తున్నది క్షేత్రజ్ఞుడే. క్షేత్రజ్ఞుడే జ్ఞేయవస్తువు; జ్ఞేయరూపుడు.

#### అమృతఫలం

**యత్ జ్ఞేయం తత్ ప్రవక్ష్యామి** - ఏది జ్ఞేయమో దానిని చెబుతాను అంటూ క్షేత్రజ్ఞ స్వరూపాన్ని చెప్పడానికి ఉపక్రమించాడు భగవంతుడు. ఇక్కడ **వక్ష్యామి** అనకుండా **ప్రవక్ష్యామి** అంటున్నాడు. 'ప్ర' అనే ఉపసర్గను చేర్చడం చేత **ప్రకర్షేణ వక్ష్యామి** అంటే, యథాతథంగా చెబుతాను; ఉన్న దున్నట్లు చెబుతాను అంటున్నాడు. అలా అనడం వెనుక ప్రయోజన ప్రాశస్త్యాన్ని ప్రధానంగా భావించడమే కారణంగా తెలుస్తూ ఉంది. ***కిం ఫలమ్?*** దాని ఫల మేమిటి అంటే, **యత్ జ్ఞేయం జ్ఞాత్వా అమృతమ్ అశ్నుతే** - జ్ఞేయము ఏదో, దానిని తెలుసుకునే వాడు అమృతత్వాన్ని పొందుతున్నాడు. మరణాన్ని దాటి పోతున్నాడు. అందుచేత, జ్ఞేయమైన క్షేత్రజ్ఞ స్వరూపాన్ని **(ప్రకర్షేణ యథావత్)** చెబుతున్నాడు. పరమేశ్వరుడు చెబుతున్న ఈ జ్ఞేయము, లేదా క్షేత్రజ్ఞ స్వరూపము అమృతత్వమును ఫలంగా కలిగి ఉంది **(అమృతత్వ ఫలం జ్ఞేయం ఉచ్యతే)**.

జ్ఞాతవ్యాలుగా తెలియ దగినవి ఈ ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి. అలాగే జ్ఞేయాలూ ఉన్నాయి. అలాంటి వాటిని ఎన్నిటినో మనము తెలుసు కుంటున్నాము. పాఠశాలల్లో చాలా నేర్చుకున్నాము. కళాశాలల్లో మరెన్నో తెలుసు కున్నాము. సమాజంలో ఇంకా ఎన్నిటినో అవధానంతో అర్థం చేసుకుంటున్నాము. అవన్నీ జ్ఞేయాలే. కానీ, ప్రస్తుతం గీతాచార్యుని బోధలో మనం గ్రహిస్తున్నది కూడా జ్ఞేయమే. కానీ, జగత్తులో మనం తెలుసుకొనే





జ్ఞేయాలకు, జగదీశ్వరుని బోధలో మనం అర్థం చేసుకుంటున్న జ్ఞేయానికి చాలా తేడా ఉంది.

ప్రపంచంలో తెలిసే వన్నీ పరిమిత మైనవి. ఏదైనా ఒకటి తెలిస్తే, దానికి సంబంధించిన జ్ఞానం కలుగుతుందే గాని, మరొక దానికి సంబంధించిన జ్ఞానము కలగదు. ఏ విషయానికి సంబంధించిన జ్ఞానం కలిగినా, దాని వలన అమృతత్వాన్ని పొందడము అనేది జరగదు. మరణాన్ని దాటించే శక్తి ప్రపంచ విద్యలకు లేదు. కానీ, భగవంతుడు బోధిస్తున్న క్షేత్రజ్ఞ స్వరూపమైన జ్ఞానమును పొందితే, అమృతత్వం ప్రాప్తిస్తూ ఉంది. ఇది సాధారణ మైన విషయం కాదు. కేవలం తెలుసుకుంటే చాలు. మోక్షం సిద్ధిస్తుంది ***(జ్ఞానాత్ మోక్షః)***. ఎందుకో తెలుసా? ఇక్కడ తెలుస్తున్నది సత్యవస్తువుకు సంబంధించిన జ్ఞానము. ప్రాపంచిక విద్యల లాగా అసత్య విషయాలకు సంబంధించిన జ్ఞానం కాదు.

వస్తువు సత్యం కానపుడు, దానికి సంబంధించిన జ్ఞానము కూడా సత్యం కాదు. అసత్య వస్తువు సత్య జ్ఞానాన్ని అందించ లేదు. సత్యవస్తువే సత్య జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. ఆ సత్యవస్తువే ప్రస్తుతం ఇక్కడ జ్ఞేయం గాను, క్షేత్రజ్ఞుడు గాను చెప్పబడుతూ ఉంది. పైగా దాని ప్రభావం, ఫలితం మహాద్భుతంగా, అనూహ్యంగా ఉంది.

అది తెలిస్తే అమృతత్వం లభిస్తుంది. అదేమిటో యథాతథంగా చెబుతాను అంటున్నాడు భగవంతుడు. అది ఏదో ఉన్నది ***(అస్తి)***. కనుకనే చెబుతాను అంటున్నాడు. లేని దానిని ఎలా చెబుతాడు?

మరైతే, ఆ ఉన్నది ఎక్కడ ఉంది? ఎలా ఉంది? ఏ ప్రదేశంలో ఉంది? ప్రపంచంలో మనం ఏది తెలుసుకున్నా ఇలాగే ప్రశ్నించి తెలుసుకుంటున్నాం. కానీ భగవంతుడు చెబుతున్న జ్ఞేయ వస్తువు ఇలా తెలిసేది కాదు. ఎందుకని? అది ప్రాపంచిక వస్తువుల లాగా ఒక ప్రదేశంలో ఉండేది కాదు. ఒక కాలంలో ఉండేది కాదు. ఇదే క్షేత్రజ్ఞ స్వరూపమైన జ్ఞేయ వస్తువు లోని ప్రత్యేకత.

అది ***(తత్)*** అంతటా ఉండే సత్యవస్తువు ***(జ్ఞేయం)***. అంతటా ఉండేది అంటే అనంతమైన వస్తువు అని అర్థం. అనంతమైన దానిని అంతం కలిగిన కర్మల ద్వారా పొంద లేము. కనుక అది కర్తవ్యం కాదు. అనంతమైన దానిని తెలుసుకోవాలి. కనుక అది జ్ఞాతవ్యం.

కావచ్చు. ఏది జ్ఞేయ స్వరూపంగా భగవంతుడు వర్ణిస్తున్నాడో దానిని తెలుసుకోవడం వల్ల, అది మరణ రహితం కనుక మనం కూడా మరణాన్ని దాటి పోతామా? అవును. అదెలా సాధ్యం? తెలుసుకునే వాడు తెలియబడే దాని కన్నా అన్యమైన వాడు కదా! కుండను తెలుసుకున్న వాడు కుండ అవుతాడా? బండను తెలుసుకున్న వాడు బండ అవుతాడా? మరి, అనంతమైన దానిని తెలుసుకున్న వాడు అనంతుడెలా అవుతాడు? అంతం లేని వాడు ఎలా అవుతాడు?

అదే ఇక్కడ పరమాద్భుతమైన జ్ఞేయ విషయ వైభవము! ఇక్కడ ప్రత్యేకంగా అయ్యేది ఏమీ లేదు. ఏదో తెలిస్తే అది మన మెలా అవుతాము? దేనిని తెలుసుకుంటే, దానికి సంబంధించిన జ్ఞానం కలుగుతుంది. అంతేగాని, అట్టి జ్ఞానానికి, అన్యమైన విషయానికి సంబంధం ఎక్కడుంది?

***న హి అన్య విషయేణ జ్ఞానేన అన్యత్ ఉపలభ్యతే*** - ఒక వస్తువుకు సంబంధించిన జ్ఞానం చేత మరొక వస్తువు గ్రహింప బడదు కదా! కుండను తెలుసుకుంటే, నిప్పును తెలుసుకున్నట్లు అవుతుందా? కానే కాదు ***(న హి ఘట విషయేణ జ్ఞానేన అగ్నిః)***.

అనంతమైన దానికి మరణం లేక పోవచ్చు. అంతమాత్రాన, దానిని తెలుసుకోవడం చేత, చావుపుట్టుకలు ధర్మంగా గల మనం మరణాన్ని ఎలా దాటగలం? దాటే ఉన్నాము కనుక దాటగలము. అనంత మైనది అమృత

స్వరూపము. దానిని తెలుసుకుంటే మనం అమృత రూపులము అవుతాము అంటే, ఆ అనంత స్వరూపము
మనం అయ్యే ఉన్నాము అని అర్థము. కనుక, ఇక్కడ మనం అది కావడము అంటే, అది మనం అయ్యే
ఉన్నామని తెలియడమే. ఇదే జ్ఞానం. జ్ఞేయానికి సంబంధించిన జ్ఞానము. జ్ఞేయము జ్ఞాతే అనే జ్ఞానము.
అనంతమైన అద్వయ జ్ఞానము. కనుకనే, ***యత్ జ్ఞాత్వా అమృతం అశ్నుతే తత్ జ్ఞానం అహం ప్రకర్షేణ వక్ష్యామి*** -
దేనిని తెలుసుకోవడం చేత నువ్వు అమృతత్వాన్ని పొందుతావో, అట్టి జ్ఞానాన్ని యథావత్ చెబుతున్నాను
అన్నాడు భగవంతుడు. ఇది సత్యం. అక్షర సత్యం. ఉపనిషత్తులు ప్రతిపాదించిన అద్భుత సత్యం. బ్రహ్మమును
తెలుసుకొనే వాడు బ్రహ్మమే అవుతున్నాడు ***(బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి)*** అనే నిత్యసత్యం. ఇంతకీ ఆ బ్రహ్మము
లక్షణ మేమిటి? శ్లోకం యొక్క ద్వితీయ పాదంలో చెబుతున్నాడు.

పరమేశ్వరుడు బోధిస్తున్న జ్ఞేయ రూపము పరబ్రహ్మ స్వరూపము. పరబ్రహ్మ స్వరూపము కనుక ఆది
లేనిది. ఇది, అది అని చెప్పడానికి సాధ్యం కానిది. ఇక దానిని వివరించి విస్పష్టం చేసే విషయాన్ని ప్రస్తుత శ్లోకం
యొక్క ఉత్తరార్థం నుండి వరుసగా ఐదు శ్లోకాలలో చెబుతున్నాడు.

**అనాదిమత్**

దేని కైతే ఆది ఉందో, ఆరంభం ఉందో అది ఆదిమత్ ***(ఆదిః అస్య అస్తీతి ఆదిమత్).*** దేని కైతే ఆది లేదో,
ఏది ఆరంభము నెరుగదో అది అనాదిమత్ ***(న ఆదిమత్ ఇతి).*** ఆది అంటే కారణము. సర్వమునకు కారణ
మైన తనకు మరొక కారణము లేదు కనుక పరబ్రహ్మము అనాది. ఆది లేని దానికి అంతము ఉండే అవకాశము
లేనందున పరబ్రహ్మము అనంతము. అనంత మైనది నశించదు కనుక అది అమృతము.

బ్రహ్మము ఆది లేని వాడు కనుక అనాది. పుట్టుక లేనివాడు కనుక అజుడు. కారణం లేని వాడు కనుక
కార్యరూపుడు కాడు. అసమాన రూపుడు. అందుకే బ్రహ్మము అనకుండా పరంబ్రహ్మ అన్నాడు.

బ్రహ్మ శబ్దానికి నానా అర్థా లున్నాయి. చతుర్ముఖ బ్రహ్మను బ్రహ్మ అంటాము. ప్రకృతికి బ్రహ్మ
శబ్దాన్ని వాడుతాము. వేదాన్ని బ్రహ్మం అంటాము. ఓంకారాన్ని బ్రహ్మ అంటాము. అలా కాకుండా, అన్నిటికీ
విలక్షణంగా బ్రహ్మమును నిర్దేశించే ప్రయత్నంలో భగవంతుడు **పరంబ్రహ్మ** అని ప్రవచించాడు **(కార్యకారణ
విలక్షణః నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావః).**

**సత్తు కాదు - అసత్తు కాలేదు**

పరబ్రహ్మము విలక్షణ మైనందున, అది కార్యకారణములకు అతీత మైన నిషేధావధీ సాక్షీ స్వరూపం
కనుక అది సత్త, లేక అసత్త, లేక సదసత్త?

పరబ్రహ్మము సత్తు కాదు అంటున్నాడు ***(న సత్).*** మరి, సత్ కాదు అంటే అసత్ అని అర్థమా? అసత్
అంటే లేనిది అని అర్థము. లేనిది ఉన్న దెలా అవుతుంది? బ్రహ్మము అసత్ అంటే, ***అభావోఽ స్తి*** అన్న
ట్లవుతుంది. అంటే, 'లేనిది ఉంది' అని చెప్పినట్లు అవుతుంది. బ్రహ్మము ఉన్నది కనుకనే జ్ఞేయమైంది.
అలాంటి జ్ఞేయ వస్తువు అసత్ అయ్యేందుకు వీలు లేదు. కనుక అది అసత్తు కూడా కాదు ***(న అసత్).*** ఇక
మూడవది అయిన సదసద్వాదము పరస్పర విరుద్ధము కనుక, ఆ రెండిటికి ఏక అధికరణత్వము అసంభవము.
కనుక బ్రహ్మము సత్తు కాదు, అసత్తు కాదు ***(న సత్ న అసత్ ఇతి).***

ఇదేమిటి? ఉంది అనేది ఉంది. అలాగే లేదు అనేది ఉంది. ప్రపంచంలో జ్ఞాన మనేది ఇలాగే ఉంటుంది
**(అస్తి నాస్తి ఉభయ బుద్ధ్యనుగత ప్రత్యయ విషయత్వాత్).** ఫలానా వస్తువు 'ఉంది' ***(అస్తి)*** అనే జ్ఞాన మైనా



ఉంటుంది. లేదా, ఫలానా వస్తువు 'లేదు' ***(నాస్తి)*** అనే జ్ఞాన మైనా ఉంటుంది. అంతేగాని, రెండూ లేకుండా
ఉండేది ఎలా అర్థ మవుతుంది? అస్తి నాస్తిత్వాలలో ఏదో ఒకటి తెలియని జ్ఞానం ఎలా ఉంటుంది? కనుక
జ్ఞేయమైన పరబ్రహ్మము ఉన్న దైనా కావాలి. లేదా, లేని దైనా కావాలి. అంతేగాని, ఉన్నది కాదు ***(న సత్),*** లేనిది
కాదు ***(న అసత్)*** అనేది సరియైన నిర్వచన మేనా? అనే శంక కలగవచ్చు. ఎందుకంటే, ఏది జ్ఞేయమో, దానిని
తెలుసుకుంటే అమృతత్వం ప్రాప్తిస్తుంది అని భగవంతుడు ఉపదేశించి నపుడు, అట్టి జ్ఞేయ వస్తువు ఉన్నట్లే
కదా! అది లేనిదే అయితే, లేని దానిని తెలుసుకొనే దేముంటుంది? పైగా తెలియనిది ప్రయోజనాన్ని ఎలా
కలిగిస్తుంది? అనేది మరొక శంక.

ఈ శంకలకు లంకె కుదరదు. ఎందుకంటే, ***అన్య దేవ తద్విదితాత్ అథ అవిదితాదధి*** అని ప్రమాణ
వాక్యము. అంటే, అది తెలిసిన దాని కన్నా వేరైనది, అలాగే తెలియని దాని కన్నా అన్యమైనది అని కేనోపనిషత్తు.
పరబ్రహ్మమును శ్రుతులు అలాగే నిర్వచించాయి. విదితావిదితాలకు అతీతం గానే ప్రవచించాయి.

**అనిర్వచనీయం**

దేనిని గూర్చి మనం చెప్పినా శబ్దం అనివార్యమై ఉంది. శబ్దము ఏదైనా అర్థాన్ని ప్రతిపాదించేందుకే
ఉంటుంది. వినే వారికి శబ్దార్థాలు అలాగే అనుభవానికి అందుతాయి. ఏ శబ్దమైనా జాతి, గుణ, క్రియ,
సంబంధముల తోనే అర్థాన్ని బోధిస్తుంది. అవి లేకుండా శబ్దం ద్వారా అర్థాన్ని అందించడం సాధ్యం కాదు.
దీనిని ఉదహరిస్తూ చెప్పు కుందాం.

***గౌః అశ్వః*** - ఈ శబ్దాలు జాతి వాచకాలుగా అర్థవంతాలు. గోజాతి, అశ్వజాతి అని అర్థం. ***పచతి, పఠతి***
- వంట చేస్తున్నాడు, చదువుతున్నాడు అనే శబ్దాలు క్రియా వాచకాలుగా అర్థవంతాలు. ***శుక్లః కృష్ణః*** - తెలుపు,
నలుపు అనే శబ్దాలు గుణ వాచకాలుగా అర్థబోధకాలు. ***ధనీ గోమాన్*** - డబ్బు గల వాడు, గోవులు కలవాడు అనే
శబ్దాలు సంబంధ వాచకాలుగా అర్థవంతాలు.

పరబ్రహ్మకు జాతి లేదు. లేని దానిని సదాది శబ్దాలతో ఎలా చెప్పగలం? గుణ వాచకాలతో చెబుదా
మంటే బ్రహ్మము నిర్గుణము. క్రియా వాచకాలతో నిష్క్రియాన్ని ఎలా చెప్పాలి? అద్వితీయమైన పరబ్రహ్మమునకు
ఏ సంబంధమును ఆపాదించి నిర్వచించాలి? కనుక జ్ఞేయమైన పరబ్రహ్మము ఉన్నదే అయినా, గుణ క్రియ
జాతి సంబంధాలలో దేనికీ విషయం కాకపోవడం చేత, ఏ శబ్దము చేతను చెప్పబడదు అనడం సమంజసమే
కదా! అలా కాదు అని, శబ్దం చేసే వాక్కు, అర్థం కలిగిన మనస్సు ఏకమై చెట్టపట్టా లేసుకొని ముందు కురికి
మాత్రం సాధించే దేముంటుంది? ***యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ*** - దేనిని తెలుసుకోలేక మనస్సుతో
కలిసి వాక్కు కూడా వెను దిరుగుతూ ఉందో, అదే పరబ్రహ్మము అని తైత్తిరీయ శ్రుతి చెప్పే ఉంది కదా!
కనుకనే ఉన్న దానిని ఉన్నది అని చెప్పలేక, సత్తు కాదు అంటున్నాము. ఉన్న దానిని లేదు అని ఎలాగూ
చెప్పలేము కనుక అసత్తూ కాదు అంటున్నాము. అనేందు కేముంది? అంతా అనుభూతి ప్రకాశమే.

*మరి తెలిసే దెలా? బ్రహ్మము ఎలా ఉన్నట్లు? చెబుతున్నాడు.*

**సర్వతః పాణిపాదం త త్సర్వతోఽ క్షి శిరోముఖమ్ ।** 13
**సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥**

*సర్వతః-పాణిపాదం-తత్-సర్వతః-అక్షిశిరోముఖం*
*సర్వతః-శ్రుతిమత్-లోకే-సర్వం-ఆవృత్య-తిష్ఠతి*

తత్ = అది
సర్వతః = అంతట
పాణిపాదం = చేతులు కాళ్ళు కలది
సర్వతః = అంతట
అక్షిశిరోముఖం = కళ్ళు, తలలు, నోళ్ళు కలది
సర్వతః = అంతట
శ్రుతిమత్ = చెవులు గలది
లోకే = లోకము నందు
సర్వం = సమస్తమును
ఆవృత్య = ఆవరించి
తిష్ఠతి = ఉన్నది

**అర్జునా! ఆయన హస్తాలు, పాదాలు అంతటా ఉన్నాయి. నేత్రాలు, శిరస్సులు, ముఖాలు అన్నిచోట్ల ఉన్నాయి. అంతటా ఆయన చెవు లున్నాయి. సర్వత్ర తానే వ్యాపించి ఉన్నాడు.**

### వ్యాఖ్య

**అనాదిమత్** మొదలైన లక్షణాలతో ప్రతిపాదిత మైన నిరుపాధిక బ్రహ్మ స్వరూపము **సత్** శబ్ద ప్రత్యయానికి ఎప్పుడైతే విషయం కాకుండా పోయిందో, బ్రహ్మము **అసత్** ఏమో అనే సందేహము అంకురించే అవకాశము లేక పోలేదు. దానిని నివారిస్తూ అది **న అసత్** అని సూత్రప్రాయంగా పూర్వ శ్లోకంలో చెప్పిన విషయాన్ని, **సర్వతః పాణిపాదం తత్** అనే ప్రస్తుత శ్లోకంలో విస్తరించి చెబుతున్నాడు.

**క్షేత్రజ్ఞుని అస్తిత్వము**

శరీరము జడము, అచేతనము. దేహాలు అచేతనములు అయినా, దేహాలు, దేహాలలో ఉండే ఇంద్రియాలు చలించడానికి, ఆయా విషయాలలో చరించడానికి ఏ చేతనము కారణమో, అదే క్షేత్రజ్ఞ స్వరూపము. అదే జ్ఞేయముగా చెప్ప బడింది. అలాంటిది లేనిది ఎలా అవుతుంది? కనుక, అది లేనిది కాదు ***(న అసత్)*** అనేది స్పష్టము.

అచేతనము లైన దేహాలకు సత్తా స్ఫూర్తి ప్రదాయక మైన నిర్విశేష పరబ్రహ్మము ఘటమఠాదులలో ఆకాశము లాగా విశ్వమంతా వ్యాపించి ఉంది. తాను చలించకనే అయస్కాంతము ఇనుప సూదిని ఎలా కదిలిస్తూ ఉందో, అలాగే దేహాల లోని హస్తపాదాలను, నేత్రశిరస్సులను, శ్రోత్రములను తన సన్నిధి మాత్రం చేతనే కదిలించి, అవి తమ తమ వ్యాపారాలలో ప్రవర్తించేటట్లు పరబ్రహ్మము తాను ప్రవర్తించకనే ప్రవర్తిస్తూ ఉంది. కనుక అది లేనిది కాదు ***(న అసత్)***. ఉన్నదే. ఉంది. సర్వత్ర ఉంది. సర్వంలో వ్యాపించి ఉంది ***(తిష్ఠతి)***. సర్వ ప్రాణులలో, ప్రాణుల వ్యాపారాలను సాగించే కార్యకరణాలలో అంతటా చలించకుండా ఉంది అనే విషయమును **తిష్ఠతి** అనే పదము నిర్ధారణ చేస్తూ ఉంది ***(లోకే ప్రాణాని కాయే సర్వమ్ ఆవృత్య సంవ్యాప్య తిష్ఠతి స్థితిం లభతే)***. అచేతనము లైన ఇంద్రియా లనే ఉపాధుల వ్యవహారాలు చేతనుడు లేకుండా జరిగే ప్రసక్తే లేనందువ, చలించే వృక్ష శాఖలను చూచి గాలి ఉన్నట్లు ఎలా ఊహిస్తామో, ఇంద్రియ చలనాలను బట్టి క్షేత్రజ్ఞుని అస్తిత్వమును నిర్ణయించ వచ్చు ***(సర్వ ప్రాణి కరణోపాధిభిః క్షేత్రజ్ఞ అస్తిత్వం విభావ్యతే)***. కాబట్టి క్షేత్రజ్ఞుడు లేనివాడు కాడు. క్షేత్రోపాధి కారణంగా క్షేత్రజ్ఞుడు అని చెప్ప బడుతున్నాడు. చేతన అస్తిత్వమే క్షేత్రజ్ఞుని అస్తిత్వము కనుక, క్షేత్రజ్ఞుడు లేనివాడు కాడని చెప్పబడినాడు ***(నా స దుచ్యతే)***.

**సంప్రదాయ వైభవము**

బ్రహ్మము నిర్విశేషము. అద్వయము. అవాఙ్మానస గోచరము. అట్టి బ్రహ్మమునే క్షేత్రోపాధి వలన క్షేత్రజ్ఞుడు అనడం జరిగింది. అంతవరకు స్పష్ట మైంది. కానీ, హస్తపాదాదులు దేహస్థములు కదా? కరణేంద్రియాలు కార్యస్థము లైనపుడు, హస్తపాదాదులు, నేత్రశిరస్సులు, శ్రోత్రములు దేహ ధర్మాలే గాని





ఆత్మధర్మాలు కావు కదా? మరి క్షేత్రజ్ఞ ధర్మాలుగా వాటిని పరిగణించడం, ***సర్వతః పాణి పాదం తత్*** అంటూ హస్తపాదాలను క్షేత్రజ్ఞునికి ఆపాదించడం ఉచిత మేనా? అనే పూర్వపక్షము తలెత్తే ప్రమాదము లేక పోలేదు. దీనిని పరిహరించే ప్రయత్నంలో సంప్రదాయవేత్తలు 'అధ్యారోప అపవాద' న్యాయాన్ని ప్రవేశ పెట్టారు ***(తథా హి సంప్రదాయ విదాం వచనమ్ - అధ్యారోప అపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే ఇతి!)***.

బ్రహ్మము నిర్విశేషము, అఖండము కనుక, గుణ, క్రియ, జాతి, సంబంధ రహిత మని పూర్వ శ్లోకంలో చూశాం. అలాంటి బ్రహ్మమునకు ప్రపంచముతో సంబంధం ఉండే అవకాశం లేదు. ప్రపంచము మిథ్యా రూపము. మిథ్య యైన ప్రపంచాన్ని బ్రహ్మము నందు ఉన్నట్లు చెప్పడం అధ్యారోపము. ఆ తరువాత లేని దానిని తొలగించి అద్వితీయ మైన బ్రహ్మమునే ప్రతిపాదించడం అపవాదము. ఈ విధమైన ప్రక్రియలో అద్వయబ్రహ్మము జ్ఞేయంగా నిరూపించ బడుతుంది.

దేహస్థ మైన హస్తపాదాదులు అధ్యారోపంగా క్షేత్రజ్ఞుని యందు కల్పించ బడతాయి. ఆ తరువాత అపవాద ప్రక్రియ ద్వారా తొలగించబడి, నిర్విశేష బ్రహ్మము ప్రతిపాదించ బడుతుంది. ఆరోపాలన్నీ స్వరూప నిర్ణయార్థమే అనే సత్యాన్ని మరచి పోకూడదు.

ఏది ఏమైనా, దూరంగా కారు కదలిపోతూ ఉంది అంటే, కారు నడిపే వాడు మనకు కనిపించక పోయినా, కారు పోతూ ఉంది కనుక కారు నడిపే వాడు కారులో ఉన్నట్లే. అంతమాత్రం చేత వాహనానికి, చోదకునికి సంబంధం లేదు. చోదకుని తెలుసుకో వలసిన పరిస్థితి వచ్చి నపుడు, వాహనానికి భిన్నంగా చోదకుని తెలుసుకోవాలే గాని, వాహన సంబంధముతో కాదు. సంబంధం ఆరోపము. అధ్యారోపము. సంబంధమును తొలగించి స్వరూపమును అర్థం చేసుకోవడం అపవాదము. ఇక ప్రస్తుత శ్లోకాన్ని అధ్యారోపంగా అర్థం చేసుకొని, క్షేత్రజ్ఞుడు లేని వాడు కాడు ***(న అసత్)*** అని నిర్ణయించుకుంటాం.

**సర్వతః పాణిపాదమ్**

జ్ఞేయము, క్షేత్రజ్ఞ స్వరూపము అయిన అది ***(తత్)*** అంతట హస్తపాదాలు కలది ***(సర్వతః పాణయః పాదాః చ అస్య ఇతి సర్వతః పాణిపాదం)***. హస్తపాదాల రూపంలో తెలుస్తున్నది క్షేత్రజ్ఞుడే. కనుక అన్ని హస్తాలూ తనవే. అన్ని పాదాలూ తనవే. చేతన రూపంలో తాను ఉండటం చేతనే హస్తపాదాలు చలిస్తున్నాయి. హస్తపాదాలు అంటే మానవుల వేనా? మకరమైనా, మర్కటమైనా, మశకమైనా, మత్తేభమైనా, ఎక్కడ హస్తపాదాలు చలించినా, అక్కడ చేతన అస్తిత్వం అనివార్యం కనుక, అంతట హస్తపాదాల రూపంలో జ్ఞేయమే ఉంది. బ్రహ్మమే ఉంది ***(సర్వతః పాణిపాదం తత్ జ్ఞేయం)***. అన్ని జీవరాసుల హస్తాలు జ్ఞేయానికి సంబంధించినవే. సర్వ ప్రాణుల పాదాలు క్షేత్రజ్ఞునివే. కనుకనే జ్ఞేయ రూపుడైన పరమాత్మను ***విశ్వతో బాహుః ఉత విశ్వతః పాత్*** అని అభివర్ణించింది శ్వేతాశ్వతరోపనిషత్తు *(శ్వే. ఉ; 3 - 3)*.

హస్తపాదాలు అనేవి కర్మేంద్రియాలు. కనుక వాటిని అనుక్త కర్మేంద్రియాలకు ఉపలక్షణంగా అర్థం చేసుకోవాలి.

**సర్వతః అక్షి శిరోముఖమ్**

అంతట నేత్రాలు, శిరస్సులు, ముఖాలు కలిగి ఉన్నందున అది సర్వతోఽక్షి శిరోముఖంగా ఉంది ***(సర్వతః అక్షీణి శిరాంసి ముఖాని చ యస్య తత్ జ్ఞేయమ్ సర్వతోఽక్షి శిరోముఖమ్)***. అన్ని కళ్ళ ద్వారా చూచేది తానే. తన స్వచేతనంతో తానే సర్వమును దర్శిస్తూ ఉంది అని అర్థము. చూపు ఏది అయినా వెనుక ఊపు తనదే. రూపు తనదే ***(సర్వతః సర్వం స్వచైతన్యేన పశ్యతి ఇతి)***. అందుచేత పరమాత్మ సర్వతః చక్షువు.

**అక్షి** పద ప్రయోగము అనుక్తమైన సర్వ జ్ఞానేంద్రియములకు ఉపలక్షణము. బాహ్యేంద్రియా లైన శ్రోత్రాదులే కాకుండా, అంతరేంద్రియా లైన మనోబుద్ధులను కూడా గ్రహించాలి (**శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనోయత్ వాచోహవాచం స ఉ ప్రాణస్య ప్రాణః** - కేనోపనిషత్తు).

ఇక శిరముల ప్రస్తావన అనేకత్వ సూచితము. అన్ని శిరస్సులు అంటే అనేకములు కదా! చతుర్ముఖ బ్రహ్మ మొదలు పిపీలికం వరకు ఉన్న శిరస్సు లన్నీ తనవే. నామరూపాలతో ఉపాధి భేదం గోచరిస్తూ నానాత్వం తెలుస్తూ ఉన్నా, ఘట మఠాదులనే ఉపాధులలో ఆకాశము ఎలా ఏకమై భాసిస్తూ ఉందో, అలాగే జ్ఞేయము సర్వ శిరస్సులలో, ముఖాలలో శోభిస్తూ ఉంది. అన్ని శ్రోత్రములు తనవి గానే భాసిస్తూ, సర్వత్ర తానే వ్యాపించి ఉంది. అంటే, ఉపాదాన కారణమైన మాయను ఉపాధిగా గ్రహించి, కారణ రూపంలో జ్ఞేయమే విశ్వమంతా వ్యాపించి ఉంది అని భావము **(కారణత్వేన సర్వత్ర వ్యాప్తత్వాత్)**.

*అధ్యారోప కారణంగా ఉపాధులైన ఇంద్రియ సముదాయాన్ని జ్ఞేయము నందు ఆరోపించడం జరిగిందే గాని, జ్ఞేయము నందు హస్తపాదా లున్నాయని భావించ కూడదు. అదే తరువాత శ్లోకం.*

**సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్ ।**
**అసక్తం సర్వభృ చ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥** 14

**సర్వేంద్రియ గుణాభాసం-సర్వేంద్రియ వివర్జితం**
**అసక్తం-సర్వభృత్-చ-ఏవ-నిర్గుణం-గుణభోక్తృ-చ**

| | | | |
|---|---|---|---|
| **తత్** | = అది | అసక్తం | = సంబంధము లేనిది |
| సర్వేంద్రియ గుణాభాసం | = సకల ఇంద్రియముల గుణములను ప్రకాశింప జేయునది | సర్వభృత్ | = అన్నిటినీ భరించేది |
| సర్వేంద్రియ వివర్జితం | = సర్వేంద్రియ రహితము | నిర్గుణం ఏవ చ | = త్రిగుణరహితమై కూడ |
| | | గుణభోక్తృ చ | = గుణముల ననుభవించునది |

**అర్జునా! క్షేత్రజ్ఞుడు సర్వేంద్రియ గుణాభాసుడు. అంతేనా! సర్వేంద్రియ వివర్జితుడు కూడా. అసక్తుడు. సర్వ భర్త. నిర్గుణుడు. గుణభోక్త కూడా.**

**వ్యాఖ్య**

జ్ఞేయము ఎలా అసత్తు కాదో పూర్వ శ్లోకంలో చూశాం. క్షేత్ర వ్యాపారాలను, వ్యవహారాలను ఆధారం చేసుకొని క్షేత్రజ్ఞుడైన జ్ఞేయము లేనిది కాదు **(న అసత్)** అని అర్థం చేసుకున్నాం. అంటే క్షేత్ర ధర్మాలు జ్ఞేయంలో ఉన్నట్లేనా? అనే శంక ఏర్పడుతుంది. ఆత్మ అట్టి ధర్మాలతో ఉన్నది కాదు అనేది అర్థం కావాలి **(న సత్)**. ఇంతకీ అది సత్త లేక అసత్త. రెండూనూ. అదెలా సాధ్యం? అధ్యారోప అపవాద న్యాయం ద్వారా సాధ్యమే నని పూర్వ శ్లోకం లోనే అర్థమైంది. అంటే, పరమార్థతః తనలో ఏ వ్యాపారాలు లేకపోయినా, మాయోపాధి చేత సర్వ వ్యవహారాలు తనవి గానే భావింప బడుతున్నాయి. ఆరోప దృష్టితో కల్పించ బడినవి స్వరూప దృష్టిలో లేనివే అవుతున్నాయి. ఉపాధి దృష్టిలో కరణ సహితంగా, గుణ సహితంగా అర్థమౌతున్న జ్ఞేయ రూపుడైన క్షేత్రజ్ఞుడు నిరుపాధికంగా చూచి నపుడు కరణ రహితుడుగా, గుణ వర్జితుడుగా తెలుస్తూ ఉన్నాడు. కనుక క్షేత్రజ్ఞుడు ఆరోప దృష్టిలో గుణ సహితుడు. స్వరూప దృష్టిలో గుణ రహితుడు. గుణాతీతుడు. ఈ సత్యాన్ని విరోధ భాసాలంకారముతో ప్రస్తుత శ్లోకంలో విస్పష్టం చేసి, ఆ తరువాత వరుసగా నాలుగు శ్లోకాలలో క్షేత్రజ్ఞ స్వరూపాన్ని విస్తారంగా ఆవిష్కరిస్తున్నాడు.



**గుణ సహితుడు**

క్షేత్రోపాధి జడము. ప్రకాశ రహితము. అయినను చేతనము వలె వ్యవహారంలో చరిస్తూ ఉంది. అట్టి చేతనత్వము క్షేత్రానిదా? క్షేత్రజ్ఞునిదా? కాలిన ఇనుప గుండును చూచి నపుడు ***(తప్త అయః పిండః)*** ఎర్రగా, ప్రకాశవంతంగా గోచరించే ఆ ఇనుప గుండులో ఉన్న దాహకశక్తి, ప్రకాశత్వము ఇనుపగుండుకు సంబంధించినవా? లేక అగ్నికి సంబంధించినవా? అనేది మీమాంస. అవి అగ్నికి సంబంధించినవే గాని, సహజంగా చల్లని గుణము గలది, గుండ్రని ఆకారము కలది అయిన అయః పిండానికి సంబంధించినవి కావు. అలా అన్నప్పుడే, అగ్ని అయఃపిండం కన్నా అన్యమైనది అని ధృవ పడింది. అగ్ని అయః పిండంలో వ్యాప్తమై ఉందే గాని, అయః పిండంతో వ్యాపృతం కాదు; అంటే సంబంధించినది కాదు.

అగ్నికి అయఃపిండము ఉపాధి మాత్రమే. వాస్తవానికి అగ్ని నిరుపాధికము. ఉపాధి ధర్మాలను అగ్ని యందు ఆరోపించి నపుడు అగ్ని గుండ్రముగా ఉంది అంటున్నాము. ఇదే అధ్యారోపము.

అగ్నికి అయః పిండము ఉపాధిగా ఉన్నందున, అయః పిండమును ఆధారం చేసుకొని అగ్ని యొక్క అస్తిత్వాన్ని నిర్ణయిస్తున్నాము. ఇక్కడే ఉపాధి ధర్మాలను జ్ఞేయము నందు ఆరోపించడం జరుగుతుంది. ఇలా అధ్యారోపంలో ఆరోపించ బడిన ధర్మాలను, స్వరూప దృష్టిలో అగ్నిని నిరూపాధికంగా అర్థం చేసుకోవడం చేత, అపవాద న్యాయంతో తొలగిస్తున్నాము.

అలాగే జ్ఞేయ రూపుడైన క్షేత్రజ్ఞునికి సర్వేంద్రియాలు, మనోబుద్ధులు ఉపాధులుగా ఉన్నాయి. ***అహం పశ్యామి*** - నేను చూస్తున్నాను, ***అహం గచ్ఛామి*** - నేను పోతున్నాను అనే ఇంద్రియ వ్యాపారాలకు, ***అహం చింతయామి*** - నేను చింతిస్తున్నాను అనే మనో సంకల్పాలకు చేతనము ఆధారము. క్షేత్రజ్ఞుడు ఉపాధిలో చేతనంగా వ్యాపించనిదే వ్యవహారాలు సాగవు. అలాగని ఉపాధులలో జరిగే వ్యవహారాలకు, చేతనానికి సంబంధం లేదు. కారణం, ఉపాధులు లేకున్నా నిరుపాధికంగా చేతనము ఉండటమే. అయినా, ఉపాధి ధర్మాలను జ్ఞేయ రూపుడైన క్షేత్రజ్ఞుని యందు ఆరోపించడం జరుగుతూ ఉంది. ఈ ఆరోప దృష్టిలో క్షేత్రజ్ఞుడు గుణ సహితుడుగా తెలుస్తూ ఉన్నాడు. అంతేకాదు, ఉపాధి సహితంగా అర్థం కావడం చేత, అకర్త యైన జ్ఞేయ రూపునిలో కర్తృత్వము కూడా ఆరోపించ బడుతూ ఉంది. కన్ను చూస్తూ ఉన్నా, కన్ను ద్వారా మనస్సు చూస్తూ ఉన్నా, ***అహం పశ్యామి*** - 'నేను చూస్తున్నాను' అంటూ చూచే లక్షణాన్ని ఆత్మ యందు ఆరోపించడం జరుగుతూ ఉంది. వాస్తవానికి ***నైవ కించిత్ కరోమీతి*** - 'నేను ఏమీ చేయడం లేదు' *(5 వ అ - 8 వ శ్లో)* అనేదే జ్ఞేయ లక్షణము.

మరి, చేతనము వల్లనే కదా ఇంద్రియ వ్యాపారాలన్నీ సాగుతున్నాయి? అలాంటప్పుడు, క్షేత్ర వ్యాపారాలు క్షేత్రజ్ఞునికి సంబంధించినవి కాకుండా ఎలా పోతాయి? అనేది శంక. అందుకు, అతడు సర్వ వ్యాపార రహితుడు, సర్వేంద్రియ వివర్జితుడు అయిన నిరుపాధిక సత్తా స్వరూపము కనుక, అనేది సమాధానము. క్షేత్రజ్ఞుడు సర్వేంద్రియ గుణాభాసుడే కాదు. సర్వేంద్రియ వివర్జితుడు కూడా.

**గుణ రహితుడు**

క్షేత్రోపాధిని ప్రకాశింప చేస్తున్నా, ఇంద్రియాలలో వ్యాప్తమై ఉన్నా, క్షేత్ర వ్యవహారంతో, ఇంద్రియ వ్యాపారాలతో వ్యాపృతం కానందున (సంబంధము లేనందున), జ్ఞేయము సర్వేంద్రియ వివర్జితము. సర్వ కరణ రహితము. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, అంతఃకరణేంద్రియ వివర్జితము. అందుచేత జ్ఞేయము గుణ రహితము ***(అతః న కరణ వ్యాపారైః వ్యాపృతం తత్ జ్ఞేయమ్)***.

జ్ఞేయ సన్నిధి లోనే ఇంద్రియ వ్యాపారాలు సాగుతాయి. చేతనము లేకపోతే, క్షేత్ర వ్యవహారము నడవదు అనడానికి శవమే సాక్ష్యము. కానీ జ్ఞేయానికి ఉపాధి అవసరము లేదు. ఉపాధి లేకపోయినా చేతనము చలిస్తుంది. చరిస్తుంది.

**అపాణి పాదో జవనో గ్రహీతా పశ్య త్యచక్షుః స శ్రుణో త్యకర్ణః**

హస్తపాదాలు లేకపోయినా అది వేగంగా పయనిస్తుంది. కళ్ళు లేకుండా చూస్తుంది. చెవులు లేకుండా వింటుంది అన్నది శ్వేతాశ్వతరోపనిషత్తు. ఈ మంత్రాన్ని ఇంద్రియాలు లేకపోయినా చేతనము నడక సాగిస్తుంది అని అర్థం చేసుకోకూడదు. ఉపాధులను చలింప చేసే శక్తి కలది అని మాత్రమే అర్థం చేసుకోవాలి. స్వరూపతః చేతనము సర్వగత మైనది కనుక ఏ చలనమూ లేనిది అని అర్థం చేసుకోవాలి. ఇక్కడ మరొక సూక్ష్మ విషయం ఉంది.

ఇంద్రియాలు, మనోబుద్ధుల చలనానికి చేతనము కారణమై ఉంది కనుక, కార్యములో ఉన్నదంతా కారణమే కాబట్టి, కార్య లక్షణాలైన గుణాలు కారణమైన గుణిలో ఉండి తీరాలి అని భావించడానికి వీలు లేదు. ఇక్కడ సంబంధము కేవలం అధ్యస్త మనే విషయాన్ని విస్మరించ కూడదు.

గుణాలలో ఉన్నది చేతనమే కావచ్చు. అలాగని, చేతనములో గుణాలను ఆశించ కూడదు. కార్యాలైన ఆభరణాలలో ఉన్నది కారణమైన సువర్ణమే కావచ్చు. అంతమాత్రం చేత సువర్ణములో ఆభరణా లున్నాయని భావించడానికి వీలు లేదు.

అవస్థాత్రయంలో ఆత్మే ఉంది. జాగ్రత్స్వప్నాలలో సర్వ సంకల్పాలను, గుణాలను ప్రకాశింప చేసేది ఆత్మయే. కానీ సుషుప్తిలో, సమస్తమూ విలీనమైన దశలో గుణా లున్నాయా? సంకల్పా లున్నాయా? సుషుప్తిలో మనసే లేనపుడు గుణ సంకల్పాలు ఎలా ఉంటాయి? గుణాలు లేవు కనుక సుషుప్తిలో చైతన్యము కూడా లేదు అని అనగలమా? చైతన్యము ఉండబట్టే కదా నిద్ర లేస్తూ ఉన్నాము? మనస్సు లేకపోయినా చైతన్యము ఉంది అంటే, ఆ జ్ఞేయము సర్వేంద్రియ వివర్జితము కాదా? కనుక ఆరోప దృష్టిలో సర్వేంద్రియ గుణాభాసంగా తెలుస్తూ ఉన్న జ్ఞేయము స్వరూప దృష్టిలో సర్వేంద్రియ వివర్జితంగా భాసిస్తూ ఉంది ***(సర్వేంద్రియ వ్యాపృతం ఇవ తత్ జ్ఞేయమ్).***

**అసక్తుడు**

సర్వేంద్రియ శూన్యమైన జ్ఞేయ రూపునికి సంబంధాలు ఉంటాయా? ఉంటే ఎవరితో, దేనితో ఉంటాయి? తన కన్నా అన్యమైనది ఏముందని, ఏదుందని సంబంధాలు ఉంటాయి? ఈ కారణం చేత జ్ఞేయ చైతన్యము అసక్తము. అసక్త మంటే ఏ సంబంధాలు లేనిది అని అర్థము ***(అసక్తం సర్వ సంశ్లేష వర్జితమ్).*** మరి, ఏ విధమైన సంబంధాలు లేనపుడు క్షేత్రాన్ని, ఇంద్రియ సముదాయాన్ని భరించేది ఎవరు? ధరించేది ఎవరు? తానే. జ్ఞేయమే. ఏ సంబంధము లేకుండా భరించేది కనుకనే **అసక్తం సర్వ భృత్** అని చెప్పబడింది. సంబంధము లేనిదే అయినా జ్ఞేయము క్షేత్రాన్ని భరిస్తుంది. ఎలా?

**సర్వభృత్**

ఏదైతే ఉందో, ఆ సమస్తము ఉన్నట్లే కదా! కనుక, ప్రతిదీ సదాత్మకమే. సత్తా మాత్రమే ***(సదాస్పదం హి సర్వం).*** ప్రతి దానిలో ఉంది, ఉంది అనేది ఉంది. ***ఘటః అస్తి సన్ ఘటః, పటః అస్తి సన్ పటః -*** కుండ ఉంది, వస్త్రము ఉంది అన్నప్పుడు, ఆ 'ఉంది' అనే జ్ఞానము అంతటా ఉంది కదా! ***(సర్వత్ర సత్ బుద్ధి అనుగమాత్).***





అన్నిటిలో 'ఉంది' అనే ఏ జ్ఞానమైతే అనుగతమై ఉందో అదే సత్తు. కనుక సమస్తమూ సదాత్మకమే. పైగ ఉన్నా దానికి ఆధారంగా ఏదో 'ఉంది'. అది అంతటా ఉంది కనుక, అన్నిటినీ అదే భరిస్తూ **సర్వభృత్** అయింది.

నా అరచేతిలో పండు ఉంది. ఇక్కడ ఉన్న దేమిటి? పండు 'ఉంది'. ఉన్న పండుకు ఆధారంగా చేయి 'ఉంది'. చేయి ఉంది అని తెలియడానికి ఆధారంగా వెలుతురు 'ఉంది'. మరి వెలుతురుకు ఆధారం ఉందా, లేదా? అదేమిటో పద్దెనిమిదవ శ్లోకంలో చూస్తాం. ఇలా ఏదైతే అంతటా 'ఉంది' అనే దానిలో ఉందో, అదే ***సర్వభృత్.*** మరి, భరించే గుణం జ్ఞేయంలో ఉన్నట్లే కదా! జ్ఞేయం భరిస్తూ ఉంది గాని, దానిలో గుణం మాత్రం లేదు. కారణం, అది నిర్గుణం. నిర్గుణం కనుక నిష్క్రియం.

**నిర్గుణుడు**

నిర్గుణుడు అంటే గుణరహితుడు. సత్త్వ రజ స్తమో గుణాలే త్రిగుణములు. ఈ మూడు వరుసగా సుఖదుఃఖ మోహ హేతువులు. త్రిగుణాలు లేని వాడు క్షేత్రజ్ఞుడు కనుక జ్ఞేయము నిర్గుణము ***(సత్త్వ రజ స్తమాంసి గుణాః త్రైః వర్జితం తత్ జ్ఞేయం).*** గుణాలు జ్ఞేయానికి ఉపాధి యైన అంతఃకరణ ధర్మాలే గాని జ్ఞేయానికి సంబంధించినవి కావు. జ్ఞేయానికి ప్రకాశ లక్షణమే గాని ప్రవర్తక లక్షణం లేదు. ఇది అర్థం గాక నిర్గుణమైన జ్ఞేయానికి గుణాలను ఆపాదించి అవలోకిస్తారు.

కమలము విరబూస్తుంది. అలా వికసించడం కమల ధర్మమే గాని సూర్యుని ధర్మము కాదు. కమల ధర్మమును సూర్యుని యందు ఆరోపించడం చేత, సూర్యుడు కమలమును వికసింప చేస్తున్నాడు అని సూర్యుడికి కర్తవ్యాన్ని అంట గడుతున్నాం. ఆయనను కమలాప్తుడు, కమల బాంధవుడు అంటున్నాము. సూర్యుణ్ణి కమల బాంధవుడు అనడం ఔచిత్యమే గాని, కమలానికి సూర్యునితో సంబంధాన్ని అంట గట్టడాన్ని కమలం అర్థం చేసుకోలేదు; కమలాప్తు డైన సూర్యునికి అర్థమే కాదు. ఉభయులకూ అర్థం గాని ఈ ఉభయ సంబంధం వల్ల ఎవరికి ఉపయోగమో!

సూర్యోదయంలో పద్మము వికసించ వచ్చు. అది పద్మ ధర్మమే గాని సూర్యుని ధర్మము కాదు. వికసింప చేసే గుణము సూర్యునిలో ఉంటే, కమలమునే కాదు, కలువను కూడా సూర్యుడు వికసింప చేయగలగాలి. ఆరోపణలను ఎవ్వరూ ఆపలేరు. అలాగని, ఆరోపాలను స్వరూపాలుగా ఎవ్వరూ తీర్చి దిద్దలేరు. వికసింప చేసే గుణం సూర్యునిలో ఎలాగైతే లేదో, గుణ ప్రవర్తనము జ్ఞేయములో లేదు. అంటే, గుణాలలో జ్ఞేయం లేనట్లేనా? అలాగని ఎవరన్నారు? ఆత్మలో గుణాలు లేవు అంటున్నాడే గాని, గుణాలలో ఆత్మ లేదు అని అన్నాడా? కనుక జ్ఞేయము నిర్గుణమే కాదు; గుణభోక్త కూడా.

**గుణభోక్త**

ఆత్మలో గుణాలు లేకపోయినా, గుణాలలో ఆత్మ ఉంది. అందుచేతనే గుణాలు అర్థ మవుతున్నాయి. శబ్దాది విషయాల ద్వారా సుఖదుఃఖ మోహాలుగా మార్పు చెందిన సత్త్వరజ స్తమో గుణాలను గ్రహించడానికి ఆధారము చేతనమే కదా! చేతనము లేకుండా గుణ భోక్తృత్వం ఎలా ఉంటుంది?

రాత్రి పూట దీపం వెలిగించుకొని కార్యాలు నిర్వర్తిస్తూ ఉంటాము. దీపం లేకుండా కార్యాలు సాగుతాయా? అలాగని దీప సన్నిధిలో సాగే కార్యాల ఫలితాలు దీపానికి అందుతాయా? అలాగే నిర్గుణుడైన క్షేత్రజ్ఞుడు గుణభోక్తగా భాసిస్తాడు. గుణాలలో ఉన్నదంతా చైతన్యమే అని గ్రహించి ఆత్మను గుణభోక్తగా దర్శించడము అన్వయము. గుణాలలో ఆత్మ ఉన్నదే గాని, ఆత్మలో గుణాలు లేవు అని గ్రహించి గుణాలను నిరాకరించడము

వ్యతిరేకము. ఇదే శాస్త్రంలో అన్వయ వ్యతిరేక పద్ధతి. అసత్తు కాదు, సత్తూ కాదు అంటూ అద్వయ సత్తా స్వరూపాన్ని జ్ఞేయంగా దర్శించే విధానము.

ఇంకా చెబుతున్నాడు.

**బహి రన్తశ్చ భూతానా మచరం చర మేవ చ ।**
**సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥** 15

***బహిః-అంతః-చ-భూతానాం-అచరం-చరం-ఏవ-చ***
***సూక్ష్మత్వాత్-తత్-అవిజ్ఞేయం-దూరస్థం-చ-అంతికే-చ-తత్***

| | | | |
|---|---|---|---|
| భూతానాం | = ప్రాణులకు | సూక్ష్మత్వాత్ | = సూక్ష్మత్వము వలన |
| బహిః | = బాహ్యమును | అవిజ్ఞేయం | = తెలియ బడనిది |
| అంతః చ | = లోపలను | దూరస్థం చ | = దూరమున ఉన్నది |
| అచరం | = చరించనిది | అంతికే చ | = దగ్గర ఉన్నది |
| చరం ఏవ చ | = చరించునది | తత్ | = అది |

**అర్జునా! అది ప్రాణుల వెలుపల ఉంది. లోపల ఉంది. అది కదలదు. కానీ, కదులుతుంది కూడా. సూక్ష్మం కనుక దానిని తెలుసుకోవడం శక్యం కాదు. అది దూరంగా ఉంటుంది. దగ్గర గానూ ఉంటుంది.**

**వ్యాఖ్య**

జ్ఞేయ వస్తువు అసక్తము, అంటే ఏ విధమైన సంబంధము లేనిది అని పూర్వ శ్లోకంలో చూశాం. ఏ సంబంధము లేని దానిని పొందే దెలా? పొంద లేనపుడు అది జ్ఞేయం ఎలా అవుతుంది? అది జ్ఞేయమే అయితే, దానికి ఉపలబ్ధి స్థాన మేది? అది ఎలా ఉపలబ్ధ మవుతుంది? అనే సందేహాన్ని పరిహరిస్తున్నాడు.

**బాహ్యములో ఉంది - ఆంతర్యంలో ఉంది**

జ్ఞేయము బాహ్యాభ్యంతరాలలో ఉంది అంటున్నాడు. సాధారణంగా ఒకటి బయట ఉంది అంటే, అది లోపల లేదు అని అర్థము. లోపల ఉంది అంటే బయట లేదు అని అర్థము. బయట లోపల ఉంది అంటే, దేనికి బయట లోపల? అనే ప్రశ్న ఉదయిస్తుంది. దేహానికి బయట లోపల ఉంది అని అర్థము. మరి, బాహ్యంలో, ఆంతర్యంలో ఉంది అంటే, దాని అర్థం మధ్యలో లేదు అనే కదా! ***(బహిః అన్తః చ ఇత్యుక్తే మధ్యే అభావే ప్రాప్తే ఇదమ్).*** కాదు. మధ్యలో కూడా ఉంది. కుండ స్థాయి నుండి చూచి నపుడు ఆకాశం బయట ఉంది, లోపల ఉంది అంటాము. కానీ, ఆకాశం స్థాయి నుండి చూచి నపుడు ఏమనగలం? ఆకాశానికి లోపల బయట ఉందా? అన్నీ ఆకాశం లోనే ఉన్నాయని అర్థం.

దేహంలో క్షేత్రజ్ఞుడు ఉన్నా దేహానికి వేరుగా లేడు. సంచిలో కొబ్బరికాయ లాగా లేడు. కనుక కాయను సంచి నుండి వేరు చేసినట్లు జ్ఞేయాన్ని క్షేత్రం నుండి వేరు చేయలేము. కనుక బాహ్యాభ్యంతరాలలో ఉండట మనే దానిని ఆభరణములో అంతః బహిః బంగారమే ఉన్నట్లు, చరాచరాత్మకమైన క్షేత్ర జగత్తుకు లోపల, బయట జ్ఞేయమే ఉంది అని అర్థం చేసుకోవాలి. కనుక చరము, అచరము రెండు కూడా జ్ఞేయమే.

**అచరము - చరము**

అచరము అంటే కదలనిది. చరము అంటే కదిలేది. స్వరూపతః జ్ఞేయము స్థిరము, అంటే అచరము.





ఉపాధి దృష్ట్యా స్వభావతః అది చరము, అంటే కదిలేది. రజ్జువు అచరము. అది కదలదు. సర్పము కదుల్తూ ఉంది. అది చరము. చలించే సర్పము కూడా రజ్జువే. కదులు తున్నట్లు కనిపిస్తున్నా, కదిలే సర్పము కదలని రజ్జువు కన్నా అన్యము కానందున, చరము, అచరము రెండూ రజ్జువే. రజ్జువు నందు ఆరోపించ బడిన సర్పము రజ్జువే అయినట్లు, జ్ఞేయము నందు ఆరోపించ బడిన క్షేత్ర జగత్తూ జ్ఞేయమే. బ్రహ్మమే. ***స్వభావతః చరము; స్వరూపతః అచరము.*** మరి, చరాచర మంతా జ్ఞేయమే అయి నపుడు, 'ఇది జ్ఞేయము' అని ఎందుకు తెలియడం లేదు? సూక్ష్మము కావడం చేత తెలియడం లేదు ***(సూక్ష్మత్వాత్ అవిజ్ఞేయం).***

చరాచరము నందు సర్వవస్తు రూపంలో జ్ఞేయమే భాసిస్తూ ఉన్నా, అది ఆకాశం వలె సూక్ష్మం కావడం చేత గ్రహించడం సులభ సాధ్యం కాదు ***(వ్యోమవత్ సూక్ష్మం).*** సూక్ష్మ మైనప్పటికీ, స్వరూపమే కనుక ప్రమాణ జన్య జ్ఞానంతో తెలుసుకొనే అవకాశం ఉండినా, విద్వత్తు లేని వారికి దానిని గ్రహించడం శక్యం కాదు ***(అవిజ్ఞేయం అవిదుషాం).***

**దూరస్థము - సమీపస్థము**

అవిద్వాంసులకు తెలియ శక్యం కానిది కనుక, జ్ఞేయము వారికి చాలా దూరము ***(అవిజ్ఞాతతయా దూరస్థం).*** ఎప్పుడు కూడా దూరమును బట్టే కాలము. ఐదు కిలోమీటర్లు నడవడానికి మనిషికి గంట పడుతుంది. యాభై కిలోమీటర్లు నడవడానికి పది గంటలు పడుతుంది. కాని, జ్ఞానం లేని వారికి జ్ఞేయం ఎంత దూరము అంటే ఏమి చెప్పగలం? ఎప్పుడూ దూరమే. అలాంటి వారు కొన్ని వేల కోట్ల సంవత్సరాలకు సరిపడే జన్మ లెత్తినా గ్రహించ లేరు అన్నారు ఆచార్యులు ***(అవిజ్ఞాతతయా దూరస్థం వర్ష సహస్ర కోట్యాపి అవిదుషామ్ అప్రాప్యత్వాత్).*** కనుక, కాలమున ఏమి ఉపయోగం? అంధుడు ఎప్పుడు చూస్తాడు అంటే ఏమి చెప్పగలం? కనుక ఇక్కడ ఆశించ వలసింది కాలం కాదు. జ్ఞానం. జ్ఞానం ప్రాప్తిస్తే, జ్ఞేయము స్వరూపమే కనుక, క్రొత్తగా పొందేది కాదు కాబట్టి, ఆత్మయే కనుక, అది సమీపముననే ఉంటుంది. అవిద్వాంసులకు ఎంత దూరమో విద్వాంసులకు ఆత్మ, లేదా జ్ఞేయము అంత సమీపము ***(అన్తికే చ తత్, ఆత్మత్వాత్ విదుషామ్).***

ఇంకా వివరిస్తున్నాడు.

**అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్ ।**
**భూతభర్తృ చ త జ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥** 16

***అవిభక్తం-చ-భూతేషు-విభక్తం-ఇవ-చ-స్థితం***
***భూతభర్తృ-చ-తత్-జ్ఞేయం-గ్రసిష్ణు-ప్రభవిష్ణు-చ***

| | | | |
|---|---|---|---|
| భూతేషు | = భూతముల యందు | భూతభర్తృ చ | = భూతములను భరించునది |
| అవిభక్తం చ | = విభజింప బడనిది | గ్రసిష్ణు | = హరించునది |
| విభక్తం ఇవ చ | = వేరుచేయబడిన దాని వలె | ప్రభవిష్ణు చ | = కలిగించునది |
| స్థితం | = ఉన్నది | జ్ఞేయం | = తెలియ దగినది |
| తత్ | = అది | తత్ | = అది |

**అర్జునా! అది అవిభక్త మైనా విభక్తంలా ఉంది. ప్రాణులను భరించేది, హరించేది, తిరిగి పుట్టించేది అదే.**

**వ్యాఖ్య**

జ్ఞేయము ప్రాణులకు బాహ్యాభ్యంతరాలలో ఉంది అని పూర్వ శ్లోకంలో చూశాం. అది చరాచరాలలో

ఉంది అని కూడా చెప్పుకున్నాం. సూక్ష్మమైన ఈ సత్యాలు బుద్ధికి పట్టి నపుడు, కొన్ని శంకలు అంకురిస్తాయి. మరి, జ్ఞేయము బాహ్యాభ్యంతరాలలో ఉండే టప్పుడు, నేను - నాది అనే స్ఫురణ జీవులలో తెలుస్తూ ఉందే గాని, బాహ్యంలో తెలియడం లేదు కదా! చరములలో గోచరిస్తూ ఉందే గాని అచరములలో తెలియడం లేదు కదా! కనుక, జ్ఞేయము ఆంతర్యం లోనే ఉంది. బాహ్యంలో కాదు. ఆంతర్యంలో ఉంది కనుక, ఒక్కొక్క దేహంలో ఒక్కొక్క క్షేత్రజ్ఞుడు ఉన్నాడు. ఈ విధంగా ఆత్మలు అనేకము అనే అర్థరహిత మైన నిర్ణయాల వలన అద్వైతం కన్నా భిన్నమైన మతాలు, సిద్ధాంతాలు పుట్టు కొచ్చాయి. ఈ దోషాన్ని పరిహరించి, జ్ఞేయము ప్రాణులలో భిన్నంగా ఉన్నట్లు అజ్ఞాన దశలో గోచరించినా, వాస్తవానికి జ్ఞేయమైన క్షేత్రజ్ఞుడు అభిన్నుడే, అవిభక్తుడే, అద్వయుడే అనే సత్యాన్ని ప్రస్తుత శ్లోకం ఆవిష్కరిస్తూ, బ్రహ్మాభిన్నత్వ విజ్ఞానాన్ని ప్రతిపాదిస్తూ ఉంది.

**విభక్తం - అవిభక్తం**

**అహం, మమేదం** - నేను, ఇది నాది అనే చేతనమైన విషయము ప్రాణుల లోనే కనిపిస్తూ ఉన్నందున, దేహాల లోనే తెలుస్తూ ఉన్నందున ***(దేహేష్వేవ విభావ్య మానత్వాత్)***, దేహాలు వేరు వేరుగా ఉన్నవి కనుక, దేహాలలో గోచరిస్తున్న చేతనత్వము కూడా వేరు వేరుగా భిన్నమై ఉందని, విభక్తంగా ఉందని భావిస్తారు. భ్రమిస్తారు. వాస్తవానికి చైతన్యము ఆకాశం లాగా ***(వ్యోమవత్)*** అవిభక్తమే గాని విభక్తం కాదు.

కుండలో ఆకాశ ముంది. దానిని ఘటాకాశము అంటాము. గదిలో ఆకాశ ముంది. దానిని మఠాకాశము అంటాము. ఘట మఠాది ఉపాధుల కారణంగా ఘటాకాశము, మఠాకాశము అని మనం పిలుచుకున్నా, ఆకాశం ఏకమే గాని భిన్నం కాదు; అవిభక్తమే గాని విభక్తం కాదు. అయినా విభక్తంగా ఉన్నట్లు అనిపిస్తుంది. అదే అజ్ఞానము. కుండకు పరిమితమై ఉన్నట్లు గోచరించినా, ఆకాశము ఎలా ఏకమై, అనంతంగా భాసిస్తూ ఉందో, అలాగే దేహాలలో పరిమితంగా తెలుస్తూ ఉండినా, చైతన్యము పరిచ్ఛిన్న దోషము లేనిదై ఆకాశము వలె సర్వగతమై, నిత్యమై ఉంది అని శ్రుతి ప్రబోధము ***(ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః)***.

శ్రుతి ప్రతిపాదించి ఉండవచ్చు. కాని, శ్రుతి ప్రతిపాదిత మైన విషయము అనుభవ వ్యతిరిక్తంగా ఉంది కదా! స్థావర మైన కుండ, బండ, దండ మొదలైన వాటి యందు చేతనత్వ మున్నట్లు ప్రత్యక్షంగా అనుభవానికి అందడం లేదు. అది జీవులలో వ్యక్త మైనట్లు వ్యక్తం కావడం లేదు. అందుచేత, జ్ఞేయమైన చేతనత్వము పరిచ్ఛిన్నమే అని తెలుస్తూ ఉంది కదా!

కాదు. కానే కాదు. జ్ఞేయము ప్రత్యక్ష ప్రమాణం కాదు. అలాగని, ప్రత్యక్ష మైన వన్నీ ప్రమాణాలని భావించడానికి వీలు లేదు. ఆకాశం నీలంగా ఉన్నట్లు ప్రత్యక్ష ప్రమాణానికి అందుతూ ఉంది ***(నీలం నభః)***. అది వాస్తవ మేనా? కలశ జలంలో ప్రతిఫలిస్తూ చంద్రుడు కుంభస్థంగా కనిపిస్తున్నాడు. చంద్రుడు కుండ లోని జలంలో ప్రత్యక్షంగా కనిపిస్తూ ఉన్నాడు కనుక, చంద్రుడు కుండ లోని ప్రదేశానికి పరిమితుడా? ***(ప్రాదేశ మాత్రః చంద్రః)***. మరొక కోణంలో చూస్తే, జలాలలో ప్రతిఫలిస్తున్నాడు కనుక, చంద్రుడు జలాల లోనే ఉన్నా డని, స్థాణువులలో ప్రతిఫలించడం లేదు కనుక అసలు చంద్రుడే లేడని; ఒకవేళ ఉన్నా, ఎన్ని ప్రతిబింబా లున్నవో, అందరు చంద్రులు ఉన్నారని నిర్ణయించడం ప్రమాణ మవుతుందా? సత్య నిర్దేశము అనేది వస్తు నిర్ధారణపై ఆధారపడి ఉంటుందా లేక, ఉపాధిగత ఆరోపిత వస్తు నిర్ణయంపై ఆధారపడి ఉంటుందా?

కనుక, జ్ఞేయము పరిచ్ఛిన్నము, విభక్తము అని చెప్పడం ప్రమాణం కాదు. పరిచ్ఛిన్నత్వానికి ప్రమాణం లేదు. ఏది పరిచ్ఛిన్నమో అది నశిస్తుంది ***(యదల్పం తన్మర్త్యమ్)***. క్షేత్రజ్ఞుడు పరిమితు డైతే నిత్యుడు కాలేడు.





ఒకవేళ పరిచ్ఛిన్నుడే అయితే, విభక్తుడే అయితే, పరిమితాలు నశించినట్లు క్షేత్రజ్ఞుడు కూడా నశిస్తాడు. నశించే వాడు మృతుడు. మృతుడు అమృతుడు కాలేడు. మరి జ్ఞేయమును తెలుసుకుంటే నీవు అమృతత్వాన్ని పొందుతావు *(13 వ అ - 12 వ శ్లో)* అనే భగవ ద్వచనానికి దీని వల్ల విరోధము సంభవించడం లేదా? కనుక క్షేత్రజ్ఞుడు అవిభక్తుడే గాని విభక్తుడు కాడు. కానీ, విభక్త మైనట్లు కనిపిస్తున్నాడు ***(విభక్త మివ)***. ***ఇవ*** అనే పదము చాలా ప్రధాన మైంది. ఇది అర్థమైతే చాలు. క్షేత్రజ్ఞుడు విభజింప బడిన వాని వలె ***(ఇవ)*** తెలుస్తున్నాడే గాని వాస్తవానికి అవిభాజ్యుడే. అవిభక్తుడే అనేది అర్థ మవుతుంది. ఇదే ఉపనిషత్తు నిర్ణయము.

***ఏక ఏవతు భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః।***
***ఏకధా బహుధా చైవ దృశ్యతే జల చంద్రవత్॥***

అనేక జల పాత్రలలో ప్రతిబింబించిన చంద్రుని ప్రతిబింబాలు అనేకములుగా, విభక్తంగా తెలుస్తూ ఉన్నా, చంద్రుడు అవిభక్తుడే కదా! తన కన్నా అన్యమైన ప్రతిబింబాల కారణంగా చంద్రుడు విభక్తు డెలా అవుతాడు? అలాగే ప్రాణుల యందు ప్రతిఫలించే చేతనత్వము ఉపాధి భేదం వల్ల విభక్తంగా కనిపిస్తున్నా, వాస్తవానికి సర్వభూత స్థితుడైన బ్రహ్మము అవిభక్తమే. అఖండమే. అద్వైతమే. కనుక జ్ఞేయమైన క్షేత్రజ్ఞుడే బ్రహ్మము. ఈ సత్యాన్ని శ్లోకం లోని రెండవ పాదము నిశ్చయిస్తూ ఉంది.

**భర్త - హర్త - కర్త**

జ్ఞేయ రూపుడైన క్షేత్రజ్ఞుడు ఏకము, అవిభక్తమే కావచ్చు. కానీ, జగత్కారణ మైన బ్రహ్మము కన్నా వేరైన వాడు అని భ్రమించే ప్రమాదం లేక పోలేదు. లేకపోవడ మేమిటి? ఉంది. ఉండబట్టే ద్వైతం విహరిస్తోంది. ఈ భ్రమను తొలగించే ప్రయత్నంలో భాగంగా క్షేత్రజ్ఞుని భూతభర్తగా, భూతహర్తగా, భూతకర్తగా అభివర్ణిస్తున్నాడు.

స్థితి కాలంలో సర్వ భూతాలను భరించే వాడు భూతభర్త ***(భూతాని బిభర్తి స్థితి కాలే)***. సంహార సమయంలో భూతాలను మ్రింగే స్వభావము ***(ప్రలయ కాలే గ్రసిష్ణు గ్రసన శీలమ్)*** కలవాడు భూతహర్త. సృష్టి కాలంలో పుట్టించే స్వభావం కలవాడు భూతకర్త ***(ఉత్పత్తి కాలే ప్రభవిష్ణు చ ప్రభవన శీలం)***. ఇదే జగత్కారణ మైన బ్రహ్మ స్వభావము. కనుక, జగత్తు యొక్క స్థితి లయోత్పత్తికి కారణము క్షేత్రజ్ఞుడు అని చెప్పడం చేత క్షేత్రజ్ఞునికి, జగత్కారణం బ్రహ్మకు భేదము లేదని తెలుస్తూ ఉంది. ఇదే బ్రహ్మాత్మ జ్ఞానము. ఆత్మయే బ్రహ్మము అనే జ్ఞానము. అద్వయ జ్ఞానము.

**అద్వయ స్వరూపము**

బాగుంది. బ్రహ్మాత్మజ్ఞాన ఫలంగా అభేదమైన అద్వయ సత్తా స్వరూపమే ఉంది అని స్పష్టమైంది. ఇదే వాస్తవ మైతే, అద్వయ మైన బ్రహ్మము నుండి ఏమి పుడుతుంది? ఎలా పుడుతుంది? సృష్టి ఎలా జరుగుతుంది? సృష్టి జరిగే అవకాశం లేనపుడు పోషింప బడేది ఏది? లయించేది ఏది?

ప్రభవము, లేదా పుట్టుక అనే దానిని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. పుట్టింది అంటే వాస్తవంగా పుట్టింది అని కాదు. పుట్టినట్లుగా ఉంది అని అర్థం. అదే **ఇవ** శబ్ద ప్రయోగము. ఏదీ ప్రభవించక పోయినా, అంతా ప్రభవించినట్లు గోచరించడమే ఇక్కడ ప్రత్యేకత.

రజ్జువు నందు అధ్యస్తము లైన సర్పము, దండము మొదలైనవి ఎక్కడ నుండి పుట్టాయి? రజ్జువు నుండే పుట్టాయి. వాస్తవానికి రజ్జువు నుండి సర్పాదులు ప్రభవించాయా? లేదు. అయినా పుట్టినట్లు కనిపిస్తున్నాయి.

ఇలా కల్పించి పుట్టించేది, పుట్టించినట్లు కల్పించేది రజ్జువే. మాయాకల్పిత సర్పాలకు రజ్జ్వాదు లెలాగో, మిథ్యా జగత్తుకు బ్రహ్మము కూడా అంతే **(యథా రజ్జ్వాదిః సర్పాదేః మిథ్యా కల్పితస్య).**

సర్పాదులు పుట్టినట్లు, ఉన్నట్లు తెలుస్తూ ఉండినా, రజ్జు జ్ఞానంలో అధ్యస్త మైన సమస్తము తిరోభావాన్ని పొందుతూ ఉంది. రజ్జువే అద్వయంగా భాసిస్తూ ఉంది. అలాగే జగదుత్పత్తి స్థితి లయాదులు మాయా మాత్రంగా బ్రహ్మము నందు ఆరోపించ బడుతున్నాయి. అధిష్ఠాన వస్తు దర్శనంలో ఆరోపాలన్నీ అదృశ్య మైనట్లు, అవిభక్త మైన క్షేత్రజ్ఞ స్వరూపం అనుభూతం కాగానే సర్వమూ ఆ స్వరూపంలో ఏకంగా, అవిభక్తంగా ఉంటుంది **(పరే అవ్యయే సర్వ ఏకీ భవన్తి!).**

*బ్రహ్మము అవిభక్తంగా, అద్వయంగా శోభించే టప్పుడు కనిపించ దెందుకని? తెలిసిరా దెందుకని? బహుశ చీకటిలో ఉందా? కనిపించక పోవడానికి అదే కారణమా? సమాధానం వినండి.*

**జ్యోతిషా మపి త జ్జ్యోతి స్తమసః పర ముచ్యతే ।** 17
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥**

**జ్యోతిషాం-అపి-తత్-జ్యోతిః-తమసః-పరం-ఉచ్యతే**
**జ్ఞానం-జ్ఞేయం-జ్ఞానగమ్యం-హృది-సర్వస్య-విష్ఠితం**

| | | | |
|---|---|---|---|
| జ్యోతిషాం అపి | = జ్యోతులకు కూడా | జ్ఞానగమ్యం | = జ్ఞానము చేత పొంద దగినది |
| జ్యోతిః | = ప్రకాశము | సర్వస్య | = సమస్త భూతముల యొక్క |
| తమసః | = చీకటికి | హృది | = హృదయము నందు |
| పరం | = పరమైనది | విష్ఠితం | = ఉన్నదని |
| జ్ఞానం | = జ్ఞానము | ఉచ్యతే | = చెప్పబడుతూ ఉంది |
| జ్ఞేయం | = జ్ఞేయము | | |

**అర్జునా! అది వెలుగులకు వెలుగు. అంధకారానికి అతీతము. అది జ్ఞానము; జ్ఞేయము; జ్ఞానగమ్యము కూడా. సర్వుల హృదయాలలో అది దివ్యంగా ప్రకాశిస్తూ ఉంది.**

**వ్యాఖ్య**

జ్ఞేయ రూపమైన ఆత్మ అంతటా ఉన్నా గోచరం కావడం లేదు అంటే, అది జడవస్తు వేమో అనే సందేహాన్ని నివారిస్తూ, అది స్వప్రకాశ చైతన్యమే అయినా, రూపరహితం కనుక గోచరించడం లేదు అని చెబుతూ నిత్య ప్రకాశాత్మను నిర్ధారణము చేస్తున్నాడు.

**జ్యోతిస్సులకు జ్యోతిస్సు**

జ్ఞేయమైన క్షేత్రజ్ఞ స్వరూపము వెలుగులకు వెలుగై వెల్గొందుతోంది. అటు బాహ్యంలో వెలిగే సూర్య, చంద్ర, నక్షత్ర, అగ్నులకు, ఇటు ఆంతర్యములో ప్రకాశించే మనోబుద్ధులకు చైతన్య జ్యోతియే అవభాసకము. దాని వల్లనే జడ జ్యోతులకు అవభాసకత్వము.

**జ్యోతిః** అంటే ప్రకాశము. ప్రకాశము అంటే ప్రకాశింప చేసేది అని అర్థము. ప్రకాశింప చేసే జ్యోతులు రెండు విధాలు. ఒకటి, తన ప్రకాశానికై మరొక జ్యోతిపై ఆధారపడి ఉండేది. రెండు, స్వప్రకాశమై, తన ప్రకాశానికై మరొక దానిపై ఆధార పడకుండా, సమస్తాన్ని ప్రకాశింప చేసేది. మొదటిది జడ ప్రకాశము. రెండవది చైతన్య ప్రకాశము.





బాహ్య ప్రకాశము లైన ఆదిత్యాదుల నుండి, ఆంతర్యము లోని బుద్ధ్యాదుల వరకు వెలిగే కాంతులన్నీ జడ ప్రకాశాలే. అవన్నీ ఏ ప్రకాశంపై ఆధారపడి ప్రకాశిస్తున్నవో అదే చైతన్య ప్రకాశము. చైతన్యజ్యోతి. అదే క్షేత్రజ్ఞ స్వరూపము. జ్ఞేయ విషయము.

చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రుని ప్రకాశం స్వప్రకాశం కాదని మనకు తెలుసు. అది సూర్యుని నుండి గ్రహించిన ప్రకాశము. అందుచేత, చంద్రుని ప్రకాశము జడ ప్రకాశమే గాని స్వప్రకాశము కాదు. మరి కాస్త ముందుకు సాగితే, సూర్యుని ప్రకాశం కూడా స్వప్రకాశం కాదని, జడ ప్రకాశమే నని తెలుస్తుంది.

వేడి పాలు అని అంటాము. పాలు వేడిగా ఉండవు. చల్లగా ఉంటాయి. వేడిపాల లోని వేడి అగ్నిదే గాని పాలది కాదు. అలాగే సూర్యుని లోని ప్రకాశము సూర్యునిది కాదు. చైతన్య ప్రకాశము వల్లనే సూర్యునికి ప్రకాశకత్వము ప్రాప్తిస్తూ ఉంది. ఏ తేజస్సు ప్రాప్తించడము చేత సూర్యుడు ప్రకాశిస్తున్నాడో, ఆ తేజస్సు చైతన్య తేజస్సే నని తైత్తిరీయ బ్రాహ్మణము ***(యే సూర్యః తపతి తేజసేద్ధః).*** చైతన్య తేజమే స్వప్రకాశము. మిగిలిన ప్రకాశా లన్నీ జడప్రకాశాలే. మరొక దానిపై ఆధారపడి ప్రకాశించే ఈ జడ ప్రకాశాలన్నీ స్వప్రకాశమైన చైతన్యప్రకాశాన్ని అనుసరించే ప్రకాశిస్తున్నాయి. ***తస్య భాసా సర్వ మిదం విభాతి*** - దాని ప్రకాశం చేతనే ఇదంతా ప్రకాశిస్తూ ఉంది అని కఠ, ముండక, శ్వేతాశ్వతరోపనిషత్తులు మూడూ ప్రముఖంగా ముచ్చటించాయి.

***అయం ఘటః*** - 'ఈ కుండ' అన్నప్పుడు, కుండ వెలుగులో ఉంది కనుక, దానిని చూచి 'ఇది కుండ' అంటున్నాము. కుండ తాను ఉన్నట్లు తనకు తానుగా ప్రకటించుకో గలదా? స్వయం ఉద్దీపనం కుండకు సాధ్యమా? సూర్యుని ప్రకాశంలో ఉద్దీప్త మైన ఘటమును నువ్వు నేత్రంతో చూస్తున్నావు. బాహ్యంలో ఘటము ఉన్నా, అది ప్రకాశంలో ఉన్నప్పుడే, అది ఉన్నట్లు మనకు తెలుస్తుంది.

ఇంకా కాస్త ముందుకు వెళితే, ఘటము సూర్యుని ప్రకాశం లోనే ఉంది. కానీ, చూచే వాడు అంధుడైతే ఎలా తెలుసుకుంటాడు? సూర్యుడు కుండను ప్రకాశింప చేయగలడే గాని, కుండను తెలుసుకోగలడా? తననే తాను తెలుసుకోలేని సూర్యుడు, కుండ నెలా తెలుసుకుంటాడు? సూర్యుడైనా, సూర్య ప్రకాశంలో భాసించే ఘటమైనా నేత్రానికే గోచరం కావాలి. కుండ, కుండను ప్రకాశింప చేసే సూర్యుడు, ఇద్దరూ నేత్రము చేత ప్రకాశింప బడుతున్న వారే.

నేత్రము వస్తువును ప్రకాశింప చేయగలదే గాని వస్తువును తెలుసుకో గలదా? నేత్రము కూడా జడమే. కనుక, నేత్రంలో ప్రతిఫలించే వస్తువును, నేత్రాన్ని ప్రకాశింప చేసే మనస్సు తెలుసుకుంటూ ఉంది. అయితే మనస్సు స్వప్రకాశమా? మనస్సు స్వప్రకాశ మైతే అది ఎప్పుడూ ఉండాలి కదా! సుషుప్తిలో మనస్సు ఉందా? లేదు. కనుక, మనస్సు తెలుసుకోవడ మనేది చైతన్య ప్రకాశం మీద ఆధారపడి ఉంది ***(చైతన్య జ్యోతిషా అవభాసితస్య మనసః మనన సామర్థ్యం*** - కేన భాష్యము). కనుక, బాహ్యం లోని సూర్యాదులు మొదలు ఆంతర్యం లోని బుద్ధ్యాదుల వరకు సమస్తమును ప్రకాశింప చేసేది స్వప్రకాశ చైతన్య మైన క్షేత్రజ్ఞ స్వరూపమే. చైతన్యాత్మక మైన ఈ క్షేత్రజ్ఞ జ్యోతి చేత ఉద్దీప్తము లైన ఆదిత్యాదులు, అగ్ని తప్తమైన లోహ గోళము వలె వాటి కంటే అన్యమైన విషయాలను ప్రకాశింప చేస్తున్నాయి.

సమస్తాన్ని ఈ విధంగా ప్రకాశింప చేసే క్షేత్రజ్ఞ ప్రకాశము తన ప్రకాశానికి మరొక దానిపై ఆధార పడనిది కావడం చేత, అది ఆదిత్య వర్ణమని, అజ్ఞాన మనే చీకటికి దూరస్థ మైనదని వేదం కీర్తించింది ***(ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్).***

**తిమిర తేజస్సులకు సాక్షి**

తెలిసేది వెలుగు. తెలియనిది చీకటి. చీకటి వెలుగులు రెండిటిని ప్రకాశింప చేసే సాక్షీ ప్రదీపము చైతన్య జ్యోతి. జ్ఞానాన్ని, అజ్ఞానాన్ని రెండిటిని ప్రకాశింప చేసే సర్వ సాక్షి క్షేత్రజ్ఞుడే.

**యో జాగర మన్వభూవం యః స్వప్న మద్రాక్షం య స్సుఖ మస్వాప్సం సోఽ హమస్మి!**

'జాగ్రదవస్థను అనుభవించినది, స్వప్న జగత్తును చూచినది, సుషుప్తిలో గాఢముగా, హాయిగా నిద్రించినది ఎవరో, అది నేనే'.

జాగ్రత్స్వప్నాలలో వ్యక్తమైన ప్రకాశాన్ని, సుషుప్త్యవస్థలో అవ్యక్త మైన ప్రకాశాన్ని, రెండిటిని ప్రకాశింప చేస్తూ, సాక్షిమాత్ర ప్రకాశంగా శోభించేది క్షేత్రజ్ఞ ప్రకాశమే. అందుకే అది చీకటికి దూరమైనది, అతీత మైనది **(తమసః పరమ్).** అంటే, అజ్ఞానానికి పరమై, అస్పర్శంగా భాసిస్తూ ఉంది ***(తమసః అజ్ఞానాత్, పరమ్ అసంస్పృష్టమ్, ఉచ్యతే )*** అని అర్థం.

**జ్ఞానం - జ్ఞేయం - జ్ఞానగమ్యం**

దేనిని తెలుసుకుంటే అమృతత్వము ప్రాప్తిస్తుందో, అట్టి జ్ఞేయమును చెబుతాను అంటూ పన్నెండవ శ్లోకంలో జ్ఞేయ రూపుడైన క్షేత్రజ్ఞుని స్వరూపాన్ని **అనాదిమత్, న అసత్, న సత్** అంటూ ప్రారంభించి వరుసగా ఐదు శ్లోకాలలో తటస్థ లక్షణము ద్వారా నిషేధ మార్గంలో దానిని వివరించి, చివరగా స్వరూప లక్షణం ద్వారా విధి మార్గంలో జ్ఞానం - జ్ఞేయం - జ్ఞానగమ్యం అని జ్ఞేయ రూపుడైన క్షేత్రజ్ఞ స్వరూపాన్ని బోధించి విషయాన్ని సమాప్తం చేస్తున్నాడు.

ప్రస్తుతము భగవంతుడు **జ్ఞానం** అని చెబుతున్నది పూర్వం చెప్పిన అమానిత్వాది సాధన పరమైన జ్ఞానము. ఈ విధమైన జ్ఞాన సాధన ఫలించిన తరువాత, ప్రమాణ జన్యమైన అహంవృత్తి యందు అభివ్యక్త మయ్యే జ్ఞానమే ఇక్కడ **జ్ఞేయము.** ఇలా తెలియ బడిన జ్ఞేయమే జ్ఞానఫలం కావున అది ***జ్ఞానగమ్యం (జ్ఞాన గమ్యమ్*** **- జ్ఞేయ మేవ జ్ఞాతం సత్ జ్ఞానఫలం ఇతి జ్ఞాన గమ్యమ్ ఉచ్యతే).** కనుక, జ్ఞానము, జ్ఞేయము, జ్ఞానగమ్యము - ఈ మూడు కూడా జ్ఞేయమైన క్షేత్రజ్ఞుని స్వరూపమే. జ్ఞప్తిరూప బ్రహ్మమే. మరి, ఆ జ్ఞప్తిరూప బ్రహ్మానికి ఉపలబ్ధి స్థాన మేది? బుద్ధియే. హృదయమే.

**హృదయాలయం**

జ్ఞేయ మేదో అది జ్ఞానం లోనే ఉంది. మోక్షం జ్ఞానరూపంలో ఉంది అని పదే పదే చెప్పడం లోని ఆంతర్య మిదే. **జ్ఞానస్య అభ్యన్తరే జ్ఞేయం మాధుర్యం పయసో యథా** - పాలలో తియ్యదనం లాగా జ్ఞానం లోనే జ్ఞేయం ఉంది అని శాస్త్ర వాక్యము. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాన గమ్యము - అంతా అఖండమే. అద్వయమే. అలాంటి దానిని ఎక్కడ పొందాలి? ఎప్పుడు పొందాలి? దాని ఉపలబ్ధి స్థానం ఏది? అది గ్రామాంతరం లాగా దేశము చేత వ్యవహితమై ఉందా? వేరు చేయబడి ఉందా? లేక, బాల్యాది అవస్థల లాగా కాలం చేత వ్యవహితమై ఉందా? లేదు. అది ఎప్పుడూ ఉంది, కనుక ఇప్పుడే ఉంది. అది అంతటా ఉంది కనుక ఇక్కడే ఉంది. బుద్ధి యందే ఉంది. హృదయ మందే ఉంది ***(తత్ హృది బుద్ధౌ సర్వస్య ప్రాణి జాతస్య, విష్ఠితం విశేషేణ స్థితమ్).*** సర్వ ప్రాణుల హృదయ మందిరాలలో దర్శింప బడుతూ ఉంది.

*ఇంతవరకు ప్రవచించిన విషయాన్ని ఉపసంహరించడం కొరకు తరువాత శ్లోకం ప్రస్తావింప బడుతూ ఉంది.*





ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః । 18
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే ॥

*ఇతి-క్షేత్రం-తథా-జ్ఞానం-జ్ఞేయం-చ-ఉక్తం-సమాసతః*
*మద్భక్తః-ఏతత్-విజ్ఞాయ-మద్భావాయ-ఉపపద్యతే*

| | | | |
|---|---|---|---|
| ఇతి | = ఈ విధముగా | ఉక్తం | = చెప్పబడింది |
| క్షేత్రం | = క్షేత్రము | మద్భక్తః | = నా భక్తుడు |
| తథా | = అటులే | ఏతత్ | = దీనిని |
| జ్ఞానం | = జ్ఞానము | విజ్ఞాయ | = తెలిసికొని |
| జ్ఞేయం చ | = జ్ఞేయమును | మద్భావాయ | = నా భావమును పొందుటకు |
| సమాసతః | = సంగ్రహముగా | ఉపపద్యతే | = తగినవా డవుతున్నాడు |

**అర్జునా! క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము - వీటిని గూర్చి నీకు సంక్షేపంగా చెప్పాను. దీనిని చక్కగా గ్రహించిన నా భక్తుడు నన్నే పొందుతాడు.**

**వ్యాఖ్య**

క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము - ఈ మూడు విషయాలను ఇంతవరకు ప్రవచించిన భగవానుడు, వాటిని ఈ శ్లోకంతో ఉపసంహరిస్తున్నాడు. ***మహాభూతాది ధృత్యన్తము*** క్షేత్రము అని ఐదు, ఆరు శ్లోకాలలో బోధించాడు. ఏడవ శ్లోకంలో అమానిత్వాదుల నుండి ఆరంభమై పదకొండవ శ్లోకంలో తత్త్వజ్ఞానార్థ దర్శనం వరకు జ్ఞానము అనే జ్ఞాన సాధనములను ఎరుక పరచాడు. అలాగే పన్నెండవ శ్లోకంలో అనాదిమత్ మొదలు పదిహేడవ శ్లోకంలో హృది సర్వస్య విష్ఠితమ్ వరకు జ్ఞేయ విషయమును ప్రసంగించి, క్షేత్ర - జ్ఞాన - జ్ఞేయ విషయమును సంక్షేపంగా వివరించి వేదార్థమును, గీతార్థమును కూడా ఉపసంహరిస్తున్నాడు ***(ఏతావాన్ హి సర్వః వేదార్థః గీతార్థశ్చ ఉపసంహృత్య ఉక్తః).*** అంటే, క్షేత్ర, - జ్ఞాన - జ్ఞేయ విషయంలో ఇదే వేదార్థము; గీతార్థము కూడా ఇదే అని అభిప్రాయము. వేదసారాన్ని, గీతాసారాన్ని కూడా ఈ అధ్యాయంలో ఇప్పటికే సారభూతంగా అందించాడని భావించ వచ్చు. వాస్తవానికి గీతలో ఉన్నదంతా ఇదే. గీతా శాస్త్రాన్ని ఎక్కడ బట్టి చూచినా ఈ మూడిటికి సంబంధించిన జ్ఞానమే ఉంటుంది. కాకపోతే, వాటిని ప్రత్యేకించి ప్రస్తుత అధ్యాయంలో ప్రవచించడం చేత శ్రోతలలో విషయం విస్పష్ట మైంది.

సింహావలోకన న్యాయంగా ఒక్కసారి వెను దిరిగి అర్జునుని ప్రశ్నను అవలోకిస్తే, అర్జునుని శ్లోకంలో కనిపించిన మూడు ప్రశ్నలకు సమాధానం లభించినట్లే అయింది. అందుచేతనే, ప్రస్తుత శ్లోకాన్ని ***ఇతి*** అంటూ ప్రారంభించి విషయం సమాప్త మైందని సూచిస్తున్నాడు. దీనికి తోడు ఫలశ్రుతిని, అధికారిని గూర్చి ప్రస్తావించడం చేత విషయం సమాప్త మైంది అని చెప్పడానికి గొప్ప ఊత మిచ్చిన ట్లైంది.

**అధికార యోగ్యత్వం**

సర్వ వేదార్థ సారము, సమస్త గీతా తాత్పర్య మైన ఈ సమ్య గ్దర్శనానికి అధికారి ఎవరో చెబుతున్నాడు. అధికార యోగ్యత్వం భక్తునికే ఉంది; భగవద్భక్తునికే ఉంది అని చెబుతున్నాడు. నా భక్తునికే అర్హత ఉంది అంటున్నాడు ***(మద్భక్తః).*** నా భక్తుడు అని భగవంతుడు చెబుతున్న ఆ భక్తు డెవరు? ఎలాంటి వాడు?

మద్భక్తుడు అంటే పరమేశ్వరుడు, పరమగురువు, వాసుదేవుడు అయిన భగవంతుని యందు సర్వమును

సమర్పించి, సర్వము సర్వేశ్వరుడే అని భావించే వాడు (**మద్భక్తః మయి సర్వేశ్వరే పరమ గురౌ వాసుదేవే సమర్పిత సర్వాత్మ భావః**). అతడే భగవద్భక్తుడు. పూర్వాధ్యాయంలో **యేతు సర్వాణి కర్మాణి** అనే రెండు శ్లోకాలలో చెప్పబడిన భక్తుడు; పదకొండవ అధ్యాయం చివర **మత్కర్మ కృత్** అనే శ్లోకంలో దీప్తిమంత మైన పూర్ణ భక్తుడు, భగవత్ప్రియు డైన మద్భక్తుడు.

ఈ సందర్భములో పరమేశ్వరుడు, వాసుదేవుడు అని ఆగకుండా పరమగురు వైన తన యందు భక్తి గల వాడు అని ప్రత్యేకించి ఆచార్యుల వారు గురువును ప్రస్తావించడంలో విశేషం లేక పోలేదు. ఆదిగురువుకు అస్మద్గురువుకు భేదం లేదని భక్తుడు అవశ్యం గుర్తించాలి అనేదే ఇక్కడ అంతర్భావము. అట్టివాడే మోక్షాన్ని పొందుతాడు అని ప్రమాణ శ్లోకము కూడా ఉంది.

**యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥**

'భగవంతుని యందు ఎవరి కైతే ఉత్కృష్ట మైన భక్తి ఉందో, భగవంతుని యందు గల భక్తి గురుదేవుని యందు కూడా సమంగా ఉందో, అట్టి మహాత్ముడైన భక్తునికే చెప్పబడిన ఈ విషయాలన్నీ బోధ పడతాయి' అని శ్రుతి ప్రబోధము. గీత - పద్దెనిమిదవ అధ్యాయం - డెబ్బై నాల్గవ శ్లోకంలో సంజయుడు అర్జునుని మహాత్ముడు (**పార్థస్య చ మహాత్మనః**) అని పలికిన విషయాన్ని మననం చేసుకోవడం ప్రస్తుతం సందర్భం కాకపోయినా, సముచితమే నని నా అభిప్రాయము.

భగవంతుని పరమగతిగా విశ్వసించి, గురుదేవుని పరమాత్మ స్వరూపంగా హృదయంలో నిలుపుకొని, నిర్మలమైన భక్తితో సమ్యగ్దర్శన జ్ఞానమును పొందు భక్తుడు భగవంతుని పొంది తరిస్తాడు. ఈ సత్యాన్ని భాగవతం కూడా దివ్యంగా ప్రవచించింది.

క॥ **గురుభక్తిం జిత్తము మత్పరమై విలసిల్లు నంత పర్యంతము స**
**త్పురుషుల కిహ లోకమునఁ జిరతర మోక్షోదయంబు సేకూరు చుండున్ !**

'సాధు పురుషులు ఎంత వరకు నేనే పరమగతి అని భావించి, మనస్సును నా యందే నిలిపి, గురుభక్తితో ఉంటారో, అంతవరకు వారికి ఈ లోకం లోనే, అంటే జీవించి ఉండగానే మోక్షము ప్రాప్తిస్తుంది' అని భగవంతుడే స్వయంగా భాగవతంలో ప్రవచించాడు (పోతన భాగవతము - తృతీయ స్కంధము).

ఇక ప్రకృతి పురుషులను గూర్చిన ప్రసంగాన్ని ప్రారంభిస్తున్నాడు.

**ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।** 19
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సమ్భవాన్ ॥**

**ప్రకృతిం-పురుషం-చ-ఏవ-విద్ధి-అనాదీ-ఉభౌ-అపి**
**వికారాన్-చ-గుణాన్-చ-ఏవ-విద్ధి-ప్రకృతి సంభవాన్**

| | | | |
|---|---|---|---|
| ప్రకృతిం | = ప్రకృతిని | వికారాన్ చ | = వికారములను |
| పురుషం చ ఏవ | = పురుషుని | గుణాన్ చ ఏవ | = గుణములను |
| ఉభౌ అపి | = ఇరువురిని | ప్రకృతి సంభవాన్ | = ప్రకృతి వలన పుట్టిన వానినిగా |
| అనాదీ | = ఆది లేని వారుగా | విద్ధి | = తెలుసుకో |
| విద్ధి | = తెలుసుకో | | |





**అర్జునా! ప్రకృతి పురుషు లిద్దరూ ఆది లేనివారు. ఇక గుణాలు, వికారాలు అంటావా? అవి ప్రకృతికి సంబంధించినవి.**

**వ్యాఖ్య**

సప్తమాధ్యాయము - విజ్ఞాన యోగము నందు ఈశ్వరుని రెండు ప్రకృతులను గూర్చి చెప్పడం జరిగింది. ఒకటి అపరా ప్రకృతి, రెండవది పరాప్రకృతి. వీటిలో అపరా ప్రకృతి క్షేత్రరూపము. పరాప్రకృతి క్షేత్రజ్ఞ స్వరూపము. ఈ ప్రకృతి ద్వయంతో పరమేశ్వరుడు ఈ జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకు కారణ మవుతున్నాడు అని ఏడవ అధ్యాయం ప్రసంగిస్తే, క్షేత్ర క్షేత్రజ్ఞ లక్షణమైన ఈ ప్రకృతి ద్వయాన్ని నిరూపించడం ద్వారా పరమేశ్వర తత్త్వాన్ని నిర్ధారణ చేయవచ్చు అంటూ ప్రస్తుత అధ్యాయం ప్రారంభమైంది.

సమస్త భూతజాలమునకు ఈ పర - అపర ప్రకృతులే కారణము. అపరా ప్రకృతియే మాయ. త్రిగుణాత్మక మైన ఈ మాయ బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉంది. కనుక ఈ మాయాశక్తి ఈశ్వర సంబంధ మైనది. ఇదే క్షేత్ర స్వరూపము.

ఇక రెండవది అయిన పరాప్రకృతియే జీవుడు. అతడే పురుషుడు. క్షేత్రజ్ఞ స్వరూపుడు. ఈ ప్రకృతి పురుషులు ఉభయులూ అనాదులు. ఆది లేని వారు. అర్జునా! ప్రకృతి పురుషు లిరువురినీ అనాదులుగా తెలుసుకో! (***ప్రకృతిం పురుషం చైవ విద్ధి అనాదీ ఉభావపి***) అంటున్నాడు భగవంతుడు. ***అనాదీ*** అనే పదాన్ని ఈ సందర్భములో జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

***న విద్యతే ఆదిః యయోః తౌ అనాది*** - 'వేటికి ఆది లేదో అవి అనాదులు' అని బహువ్రీహి సమాసము. ఉభయ ప్రకృతులు ఈశ్వర సంబంధ మైనవే కనుక, అవి ఈశ్వరుడు నిత్యుడు. ఈశ్వరుడు నిత్యు డైనపుడు ఉభయ ప్రకృతులను కలిగి ఉండటము చేతనే ఈశ్వరుడు కూడా నిత్యములే అయి ఉండాలి. నిత్యము లైన ఈ ఉభయ ప్రకృతులను కలిగి ఉండటము చేతనే ఈశ్వరుడు జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకు కారణ మవుతున్నాడు. కనుక ఈశ్వరుని ప్రకృతులు రెండూ అనాదులుగా ఉంటూ సంసారానికి కారణ మవుతున్నాయి.

***అనాదీ*** శబ్దాన్ని నిర్వచించడంలో సాంఖ్యులు మరో విధంగా అర్థం చెప్పారు. ***న ఆదీ అనాదీ*** - ఆదులు కానివి అన్నారు. అంటే, ఆది నుండి లేనివి అని తత్పురుష సమాసంగా గ్రహించారు. ఇలా చెప్పడం చేత ఈశ్వరునికి జగత్కారణత్వం సిద్ధిస్తుంది అనేది వారి వాదము. ప్రకృతి పురుషులు ఆది లేనివారై నిత్యులైతే జగత్తు వారి సృష్టి అవుతుందే గాని ఈశ్వర సృష్టి కాదు అనేది వారి విచిత్ర వాదము. ఈ వాదము అయుక్తము, అసంగతము.

వీరి వాదన ప్రకారము ఆది నుండి లేనివి అనే అర్థాన్ని గ్రహిస్తే, ప్రకృతికి ఆది ఉన్నట్లే కదా! కారణ మున్నట్లే కదా! అదే వాస్తవ మైతే, ప్రకృతి, లేదా మాయకు కారణ మేమిటి? అనే ప్రశ్న పుడుతుంది. మాయకు కారణము లోయ అన్నా రనుకోండి. మళ్ళీ లోయకు కారణ మేమిటి? అనే ప్రశ్న అనివార్య మవుతుంది. ఇలా చెప్పుకుపోతే అనవస్థా దోషం ఏర్పడుతుంది. అంతేగాని, మూల ప్రకృతి ఒకటి ఉందని వారు భావించినట్లు సమాధానం రాదు. అలాంటప్పుడు సృష్టి కార్యమే అసంభవ మవుతుంది. కనుక ప్రకృతి కూడా అనాది అని అంగీకరించక తప్పదు.

***ప్రధాన క్షేత్రజ్ఞ పతి ర్గుణేశః*** - ప్రధాన క్షేత్రజ్ఞులకు, అంటే ప్రకృతి పురుషులకు ఈశ్వరుడే ప్రభువు అని వేదం చెబుతూ ఉంది. అలాంటప్పుడు మరొక ప్రకృతి ప్రత్యేకంగా ఎలా ఉంటుంది? ఒకవేళ అలా వేరుగా మూల ప్రకృతి అనేది ఒకటుంటే, సృష్టి కార్య నిర్మాణానికి ఈశ్వరుడు ఆ మూల ప్రకృతిపై ఆధారపడ వలసి

వస్తుంది. అదే జరిగితే, ఈశ్వరుని యొక్క సర్వ శక్తిమత్వానికి, సర్వజ్ఞత్వానికి భంగం వాటిల్లుతుంది.

ప్రకృతికి ఆది ఉందని చెప్పడం చేత, ఈశ్వరునికి జగత్కారణత్వం సిద్ధిస్తుందని వీరు ప్రతిపాదించే విషయము కూడా పస లేనిదే. ఈశ్వరుడే జగత్కారణం అని చెబితే, వెంటనే సృష్టిలో భేదాలు ఎలా సాధ్య మయ్యాయి? అనే ప్రశ్న పుడుతుంది. సృష్ట్యాదిలో పాపపుణ్యాల ప్రసక్తే లేదు కదా! అలాంటప్పుడు నిర్హేతుకంగా నిమ్నోన్నతాలను పరమేశ్వరుడు ఎందుకు సృష్టించాడు? అనే విమర్శకు సమాధానమే లభించదు. ఈశ్వరుని కూడా మన లాగే రాగద్వేషాల పల్లకీలో కూర్చోబెట్టి ఊరేగించ వలసి వస్తుంది.

ఈశ్వరుడు అంటే ఏమిటి? **ఈశితుం శీల మస్య ఈశ్వరః** - ఆధిపత్యము వహించే శక్తి కలవాడు. నియమన శక్తి కలవాడు. ఈ ఉభయ ప్రకృతులకు ఆది ఉందని చెబితే, ఈ ప్రకృతి ద్వయం పుట్టక ముందు ఈశ్వరుడు నియమించ వలసింది, ఆధిపత్యం వహించ వలసింది ఏదీ లేదని అర్థం. అలాంటప్పుడు ఈశ్వర శబ్దానికి అర్థ మేమిటి? ఈశ్వరునికి అనీశ్వరత్వం ప్రాప్తించినట్లే కదా! రాజ్యం ఉంటేనే కదా రాజు అనే పదానికి అర్థం! కనుక, ఈశ్వరునికి ఈశ్వరత్వం ఈ ప్రకృతి ద్వయం ఉంటేనే సాధ్యం **(ప్రకృతి ద్వయవత్త్వ మేవ హి ఈశ్వరస్య ఈశ్వరత్వమ్).**

ఈశ్వరునికి ఈశ్వరత్వం లేనపుడు జగత్తు యొక్క అస్తిత్వ మేపాటిది? జగత్తు నిమిత్తం లేనిది అవుతుంది. సంసారానికి నిమిత్తము, లేదా కారణము లేకపోతే ముక్తి కూడా లేనిదే అవుతుంది. సంసార హేతువు ఒకటి ఉంది అని చెప్పి, దానిని తొలగించుకుంటే మోక్షము అని చెబితే అంగీకరించడానికి అభ్యంతరం ఉండదు. అలా కాకుండా, సంసార హేతువే లేదు అని చెబితే, దానిని నిర్మూలించుకునే అవకాశమే లేనందున, మోక్షప్రాప్తి అనేదే ఉండదు **(సంసారస్య నిర్నిమిత్తత్వే అనిర్మోక్ష ప్రసంగాత్).** బంధమోక్ష ప్రసక్తి ఉండే అవకాశమే లేదు. బంధమోక్ష ప్రసంగమే లేనపుడు శాస్త్రం యొక్క అవసర మేమిటి? శాస్త్రం నిరర్థక మవుతుంది **(శాస్త్రానర్థక్య ప్రసంగాత్, బంధమోక్ష అభావ ప్రసంగాచ్చ).** కనుక, ప్రకృతి ద్వయము ఆది లేనిదై, నిత్య మైనపుడే ఇదంతా సిద్ధిస్తుంది. అదెలాగో ఈ ప్రకృతి పురుష వివేక ప్రకరణంలో చూస్తాం.

ఉభయ ప్రకృతులు ఈశ్వర సంబంధ మైనవే. క్షేత్రము అపరా ప్రకృతి. మాయోపాధితో వర్తిస్తూ ఉంటుంది. క్షేత్రజ్ఞుడు, లేదా పురుషుడు పరాప్రకృతి. అవిద్యోపాధితో కూడి ఉంటాడు. ఈ రెండూ అనాదులే. సృష్టికి హేతువులే. ప్రకృతి వికారం చెందుతూ ఉంటుంది. పురుషుడు నిర్వికారి.

ప్రకృతి మాయాశక్తి. వికారాలకు హేతువు. వికారాలకు, గుణాలకు ప్రకృతియే కారణము. అందుచేత గుణ వికారాలు ప్రకృతి సంభవాలు. అంటే, ప్రకృతి యొక్క పరిణామాలు. అర్జునా! ప్రకృతి పురుషులు ఎలా అనాదులో అర్థమైంది కదూ? అయితే, వికారాలు, గుణాలు ప్రకృతి పరిణామాలే నని తెలుసుకో! ***(వికారాన్ గుణాన్ చ విద్ధి, ప్రకృతి సంభవాన్, ప్రకృతి పరిణామాన్).*** ఈ దృశ్యమాన ప్రపంచము ప్రకృతి యొక్క స్థూల విషయానికి సంబంధించినది కాగా, సుఖదుఃఖ మోహాత్మకాలైన గుణాలు ప్రకృతి యొక్క సూక్ష్మ విషయానికి సంబంధించినవిగా తెలుసుకో.

*ప్రకృతి సంభవాలైన వికారాలు, గుణాలు అంటే ఏమిటి? చెబుతున్నాడు.*

**కార్యకరణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।** 20
**పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే ॥**

**కార్యకరణ కర్తృత్వే-హేతుః-ప్రకృతిః-ఉచ్యతే**
**పురుషః-సుఖదుఃఖానాం-భోక్తృత్వే-హేతుః-ఉచ్యతే**



| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రకృతిః | = | ప్రకృతి | సుఖదుఃఖానాం | = | సుఖదుఃఖములను |
| కార్యకరణ కర్తృత్వే | = | కార్యకరణ కర్తృత్వములకు | భోక్తృత్వే | = | అనుభవించుట యందు |
| హేతుః | = | హేతువుగా | హేతుః | = | హేతువుగా |
| ఉచ్యతే | = | చెప్పబడుతున్నది | ఉచ్యతే | = | చెప్పబడుతున్నాడు |
| పురుషః | = | పురుషుడు | | | |

**అర్జునా! కార్యకరణాల పుట్టుకకు ప్రకృతి కారణము. సుఖదుఃఖాలను అనుభవించడానికి పురుషుడు హేతువు.**

### వ్యాఖ్య

కార్యము అంటే శరీరము. శరీరములో ఉన్న పదమూడు ఇంద్రియాలు కరణాలు. పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారము - ఈ పదమూడు ఇంద్రియాలు కరణాలు.

పాంచభౌతిక మైన శరీరము కార్యము కనుక శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాత్మక మైన ఇంద్రియ విషయాలు కూడా కార్యము క్రిందికే వస్తాయి. అలాగే ప్రకృతి నుండే పుట్టిన సుఖదుఃఖ మోహాత్మకా లైన గుణాలు పదమూడు ఇంద్రియాలైన కరణాలను ఆశ్రయించుకొని ఉన్నందున అవి 'కరణ' శబ్దం చేత గ్రహింప బడతాయి. ఈ కార్యకరణాలను పుట్టించడము 'కార్యకరణ కర్తృత్వం'. ఇక్కడ కర్తృత్వము అంటే ఉత్పాదకత్వము ***(తేషాం కార్య కరణానాం కర్తృత్వమ్ ఉత్పాదకత్వం యత్ తత్ కార్యకరణ కర్తృత్వమ్).***

#### హేతువు ప్రకృతి

ఈ కార్యకరణ కర్తృత్వానికి ప్రకృతే ఆరంభం కనుక, అదే హేతువుగా చెప్పబడుతూ ఉంది. కార్యానికి ఏది కారణంగా ఉంటుందో దానినే ఆరంభకం అంటాము. మట్టికుండకు మట్టి ఆరంభకం కనుక, ఆరంభక మైన మట్టి, కుండకు హేతువు అవుతుంది. అదే ఉపాదాన కారణము. ఈ విధంగా కార్యకరణ కర్తృత్వము నందు ప్రకృతి హేతువు కావడం చేత, సంసారానికి ప్రకృతియే కారణముగా తెలుస్తూ ఉంది.

ఈ శ్లోకమున ***కార్యకరణ కర్తృత్వే*** అనే చోట ***కార్యకారణ కర్తృత్వే*** అనే పాఠాంతరము ఉంది. ఈ విధమైన దీర్ఘ పాఠమును గ్రహిస్తే, ఏది దేని యొక్క విపరిణామమో అది దాని కార్యము అవుతుంది. వికారము లన్నీ కార్యములు. వికారము గలది వికారి. అంటే, వికార వికారి రూపాలైన కార్యకారణముల యొక్క కర్తృత్వము నందు ప్రకృతి హేతువుగా ఉందని అర్థము ***(వికార వికారిణోః కార్యకారణయోః కర్తృత్వ ఇతి).***

#### కారణం పురుషుడు

సంసారమునకు పురుషుడు ఎలా కారణమో చెబుతున్నాడు. పురుషుడు, జీవుడు, క్షేత్రజ్ఞుడు, భోక్తా - ఈ పదాలన్నీ సమానార్థక పదాలు, అంటే పర్యాయ పదాలు అన్నారు భాష్యంలో ఆచార్యులు ***(పురుషః జీవః క్షేత్రజ్ఞః భోక్తా ఇతి పర్యాయః).*** భోగ్యాలైన సుఖదుఃఖాలను అనుభవించడములో పురుషుడు కారణ మని చెప్పబడ్డాడు.

'కార్యకరణ కర్తృత్వము' చేత ప్రకృతి, 'సుఖదుఃఖ భోక్తృత్వము' వలన పురుషుడు - ఈ విధంగా ప్రకృతి పురుషు లిరువురు సంసార హేతువులుగా తెలుస్తున్నారు. ప్రకృతి అచేతనము కనుక, ప్రకృతికి కర్తృత్వము సంభవించదు. అలాగే పురుషుడు ప్రకృతి విలక్షణుడు కావడం చేత పురుషుడికి భోక్తృత్వము సంభవించదు. అలాంటప్పుడు సంసారము ఎలా సాధ్యము? సాధ్యమే. దేహేంద్రియాది విషయాకారముగా, సుఖదుఃఖాది ప్రత్యయాకారముగా పరిణమించిన ప్రకృతితో దానికి భిన్నమైన పురుషునికి అవిద్యా రూపమైన సంబంధం,

లేదా సంయోగం ఎప్పుడైతే ఏర్పడుతుందో అప్పుడే **అహం - మమ** - 'నేను - నాది' అనే సంసారము ఉత్పన్న మవుతుంది. ఇలా కార్యకరణ కర్తృత్వం ద్వారా, సుఖదుఃఖ భోక్తృత్వం ద్వారా ప్రకృతి పురుషుల సంసారానికి కారణత్వం చెప్ప బడుతూ ఉంది **(ప్రకృతి పురుషయోః కార్యకరణ కర్తృత్వేన సుఖదుఃఖ భోక్తృత్వేన చ సంసార కారణత్వమ్ ఉక్తమ్ తత్ యుక్తమ్)**. కనుక సంసార మనేది ఏదో కాదు సుఖదుఃఖ భోగమే సంసారము **(సుఖ దుఃఖ సంభోగః సంసారః)**. పురుషుడు సుఖదుఃఖాలను అనుభవించడమే సంసారిత్వము **(పురుషస్య సుఖ దుఃఖానాం సంభోక్తృత్వం సంసారిత్వమ్ ఇతి)**.

*సంసారిత్వ మేమిటో చెప్పబడింది. ఇంతకీ, దానికి నిమిత్త మేమిటి? చదవండి.*

పురుషః ప్రకృతి స్థో హి భుఙ్క్తే ప్రకృతిజా న్గుణాన్ ।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మసు ॥ 21

**పురుషః-ప్రకృతిస్థః-హి-భుంక్తే-ప్రకృతిజాన్-గుణాన్**
**కారణం-గుణసంగః-అస్య-సదసద్యోనిజన్మసు**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రకృతిస్థః | = | ప్రకృతి యందున్నవాడై | అస్య | = | ఇతనికి |
| పురుషః | = | పురుషుడు | సదసద్యోని జన్మసు | = | సుకృత దుష్కృతములయిన యోనులందు |
| ప్రకృతిజాన్ | = | ప్రకృతిచే బుట్టిన | | | |
| గుణాన్ | = | గుణములను | గుణసంగః | = | గుణసంగము |
| భుంక్తే హి | = | అనుభవించును గదా | కారణం | = | కారణము |

**అర్జునా! ప్రకృతి యందున్న పురుషుడు ప్రకృతి సంభవాలైన గుణాలను అనుభవిస్తున్నాడు. ఈ గుణ సంగము వల్లనే అతనికి నీచోన్నత జన్మలు కలుగు తున్నాయి.**

**వ్యాఖ్య**

సుఖదుఃఖాలను అనుభవించడమే సంసారము అని గ్రహించాము. వాస్తవానికి సంసారిత్వమే బంధము. పురుషు డెవరు? పురుషుడు జీవుడు; క్షేత్రజ్ఞుడు. క్షేత్రజ్ఞుడు, లేదా పురుషుడు జ్ఞేయరూపుడైన పరమాత్మయే అని పూర్వ ప్రకరణం లోనే తెలుసుకున్నాం. పరమాత్మ అనంతరూపుడు. అనంతుడైన వానికి బంధము అసంభవము. అయినా, సంసారిత్వ మనే బంధము ఉంది అంటే, దానికి నిమిత్త మేమిటి? ***(తస్య కిం నిమిత్తం?)***. ప్రకృతి అవిద్య, లేదా అజ్ఞానము. అవిద్యా లక్షణం కలది, కార్యకరణ రూపంలో పరిణామం చెందినది అయిన ప్రకృతి యందు ఉన్నవాడై ప్రకృతియే తాను అని భావిస్తున్న వాడు, ప్రకృతి సంభవాలై సుఖదుఃఖ మోహాది రూపాలలో వ్యక్తమయ్యే గుణాలను అనుభవిస్తూ - **సుఖీ, దుఃఖీ, మూఢః, పండితః అహమ్** - నేను సుఖిని, దుఃఖిని, మూర్ఖుణ్ణి, పండితుణ్ణి అని భావించుకుంటూ ఆయా గుణాలను అనుభవిస్తున్నవాడు పురుషుడు. అతడే ప్రకృతిస్థుడు.

పురుషునకు ప్రకృతితో సంబంధము నిత్యము కాదు. నిరవయవు డైన పురుషునికి సావయవ మైన ప్రకృతితో సంబంధము అసంభవము. లేని సంబంధము ఉన్నట్లు గోచరిస్తే, దానిని ఆధ్యాసిక సంబంధము అని చెప్పుకోవాలి. ఈ సంబంధమే సంసారాన్ని తయారు చేసి పురుషుని సంతాపానికి గురి చేస్తుంది. ఏకమైన తనను, తాను గాని అనేకములు బాధించేలా చేస్తుంది.

అనాత్మ యైన ప్రకృతితో సంయోగము చేత, అనాత్మ యందు ఆత్మబుద్ధిని అధ్యసించి తాను కాని దానిని తానుగా, తనది కాని దానిని తనదిగా భావించడం జరుగుతూ ఉంది. ఇదే అవిద్య, లేదా అజ్ఞానము.



ఈ విధంగా ఆత్మ యైన పురుషుడు స్వరూపతః అసంగుడే అయినా, దేహేంద్రియ మనస్సులతో తాదాత్మ్యం చెందడం వల్ల అభోక్త యైన తాను భోక్త అవుతున్నాడు ***(ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః)***. అనన్య స్వరూపుడైన తాను అన్య ధర్మములను తనవిగా భావించడమే సంసారము. ఈ విధమైన సంసారము అవిద్యా ప్రాప్తము. అవిద్య చేత శబ్దాది విషయాల యందు, సుఖదుఃఖ మోహాత్మకము లైన గుణాల యందు అభిలాష ఏర్పడుతుంది. అదే గుణసంగము, లేదా కామము. ఈ అవిద్యా కామాలే జన్మలకు కారణము.

***స యథా కామో భవతి త త్క్రతు ర్భవతి!***
***యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే!***
***యత్కర్మ కురుతే త దభి సంపద్యతే!***

'ఎవడు దేనిని కామిస్తున్నాడో వాడు దానికి సంబంధించిన సంకల్పాలనే కలిగి ఉంటాడు. ఎట్టి సంకల్పాలు కలిగి ఉంటాడో అట్టి కర్మలే ఆచరిస్తాడు. ఏ కర్మలను ఆచరిస్తాడో తత్సంబంధమైన ఫలాలనే పొందుతాడు'.

పుణ్య సంకల్పాలు కలిగి పుణ్యకర్మలు ఆచరించే వారు ఉత్తమ జన్మ లెత్తుతారు. సుర, ముని జన్మలలో శోభిస్తారు. అవి సద్యోనులు. వారు సద్యోని జాతులు. పాపకర్మలు మాత్రమే చేసి పాపయోనుల యందు జన్మించు ప్రాణులు రాక్షస, పిశాచ, పశ్వాది యోనులలో పుడతారు. అవి అసద్యోనులు. వారు అసద్యోని జాతులు. పుణ్యాపాపాలను కలిపి ఆచరించే వారు మధ్యవర్తు లైన మానవులుగా జన్మిస్తారు. అవి సదసద్యోనులు. వారు సదసద్యోని జాతులు ***( కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు )***.

అధ్యాసయే సంసారానికి కారణము. అనుభవింపబడే సుఖదుఃఖ మోహాదుల యందు సంగత్వమే, ఆత్మ భావమే సంసారానికి, తద్వారా జన్మలకు కారణ మవుతూ ఉంది. ఇదే బంధము. బంధమే జనన మరణ రూప ప్రవాహానికి హేతువు అవుతూ ఉంది. అనాత్మ యందు ఆత్మభావమును కలిగి ఉండటం చేత నువ్వు కర్తవు అవుతున్నావు. కర్తగా కర్మలను ఆచరిస్తున్నావు కనుక, ఆ కర్మఫలాలను అనుభవించడానికి భోక్తవు అవుతున్నావు. కర్తగా పుణ్యాపాపాలను తయారు చేసుకుంటావు. ఆయా పుణ్యాపాప ఫలాలను అనుభవించడానికి జన్మ లెత్తుతావు. మళ్ళీ కర్మాచరణమే, ఆ తరువాత ఫలానుభవమే; తిరిగి జన్మ నెత్తడమే.

జననమరణ రూపమైన ఈ సంసార నివృత్తి జరగాలి అంటే, ఆధ్యాసిక సంబంధము తెగి పోవాలి. ఈ ఆధ్యాసిక సంబంధము, లేక అనిత్య సంబంధము తొలగాలి అంటే, స్వరూప జ్ఞానము కలగాలి. దానినే ప్రస్తుత అధ్యాయంలో జ్ఞేయముగా మనం చెప్పుకున్నాం. ఏది తెలుసుకుంటే అమృతత్వము ప్రాప్తిస్తుందో ***(యత్ జ్ఞాత్వా అమృత మశ్నుతే*** *- 12 వ శ్లో )* అదే జ్ఞేయము. క్షేత్రజ్ఞ స్వరూపము. అదే పురుష స్వరూపము.

*అందుచేత పురుషుని స్వరూపము వర్ణింప బడుతూ ఉంది.*

ఉపద్ర ష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమా త్మేతి చాప్యుక్తో దేహేఽస్మి న్పురుషః పరః ॥ 22

**ఉపద్రష్టా-అనుమంతా-చ-భర్తా-భోక్తా-మహేశ్వరః**
**పరమాత్మా-ఇతి-చ-అపి-ఉక్తః-దేహే-అస్మిన్-పురుషః-పరః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అస్మిన్ | = | ఈ | ఉపద్రష్టా | = | సాక్షియు |
| దేహే | = | దేహము నందు | అనుమంతా చ | = | అనుమతించు వాడు |
| పరః | = | పరుడైన | భర్తా | = | భరించు వాడు |
| పురుషః | = | పురుషుడు | | | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| భోక్తా | = | అనుభవించువాడు | పరమాత్మా ఇతి చ అపి | = | పరమాత్మ అని కూడా |
| మహేశ్వరః | = | మహేశ్వరుడు | ఉక్తః | = | చెప్పబడు తున్నాడు |

**అర్జునా! ఈ దేహంలో ఉన్న పరమ పురుషుడే ఉపద్రష్ట; అనుమన్తుడు; భర్త, భోక్త, మహేశ్వరుడు, పరమాత్మ కూడా.**

**వ్యాఖ్య**

ప్రకృతితో ఏర్పడిన మిథ్యా సంబంధం వలన పురుషునికి సంసారిత్వం ప్రాప్తించిందే గాని, స్వరూపతః పురుషునికి సంసారిత్వం లేదు. ఈ పరతత్త్వాన్ని స్పష్టం చేయడానికి పురుషుని యొక్క ప్రకృతి సంబంధ రాహిత్యాన్ని, ప్రకృతి సంబంధ కార్య శూన్యతను ప్రస్తుత శ్లోకంలో వివరిస్తున్నాడు. కార్యకరణాలలో ఉంటూ విలక్షణంగా ప్రకాశించే క్షేత్రజ్ఞ స్వరూపాన్ని వివరించే ఈ శ్లోకము అందమైనది; అద్భుత మైనది కూడా. **స చ యో యత్ప్రభావశ్చ** అనే మూడవ శ్లోకంలో క్షేత్రజ్ఞుని, క్షేత్రజ్ఞుని ప్రభావాన్ని చెబుతాను అన్నాడు భగవంతుడు. జ్ఞేయ రూపంగా క్షేత్రజ్ఞుని గూర్చి ఇంతవరకు వివరంగా తెలుసుకున్నాం. ఇక ఇప్పుడు, క్షేత్రజ్ఞుని ప్రభావాన్ని తెలుసుకుంటాము. దేహంలో ఉంటూ, దేహ ధర్మాలకు అంటకుండా, ఇంద్రియ మనోబుద్ధులను ప్రకాశింప చేస్తూ, వాటి చేత స్పృశింప బడకుండా విలక్షణంగా శోభించే పురుషుణ్ణి ఆరు విశేషణాలతో భగవంతుడు వర్ణిస్తున్నాడు.

**ఉపద్రష్ట**

ద్రష్ట అంటే చూచేవాడు. 'ఉప' అనే ఉపసర్గ సామీప్యార్థకము. కనుక సమీపమున ఉండి చూచేవాడు ఉపద్రష్ట. పరీక్షలు వ్రాసే గదిలో విద్యార్థులు పరీక్ష వ్రాస్తూ ఉంటే, పర్యవేక్షకుడు సమీపంలో ఉండి చూస్తూ ఉంటాడు. తాను ఏమీ చేయకుండా, చేసే వారిని చూస్తూ ఉండేవాడు ఉపద్రష్ట ***(సమీపస్థః సన్ ద్రష్టా స్వయం అవ్యాపృతః).*** అలాగే దేహేంద్రియాలకు దగ్గరలో ఉంటూ, వాటితో ఏ విధమైన సంబంధము లేకుండా చూచేవాడు కనుక పురుషుడు ఉపద్రష్ట ***(కార్యకరణానాం స వ్యాపారాణాం సామీప్యేన ద్రష్టా ఉపద్రష్టా).***

మరో విధంగా చెప్పుకుంటే దేహము, కన్ను, మనస్సు, బుద్ధి, ఆత్మ - ఇవన్నీ ద్రష్టలే ***(దేహ చక్షుర్మనో బుద్ధ్యాత్మానః ద్రష్టారః).*** వీటిలో బాహ్యమును అవలోకించే దేహము బాహ్యద్రష్ట. అక్కడ నుండి వెనుదిరిగి కన్ను, మనస్సు, బుద్ధి మొదలైన ద్రష్టలను దాటుకుంటూ క్రమేపి అంతర్ముఖ మైతే, ప్రత్యక్షంగా, సమీపంలో ఉండే ద్రష్ట ఆత్మ. అందుకే అది ఉపద్రష్ట. సర్వసాక్షి అయిన ఈ ఉపద్రష్టను దర్శించే ద్రష్ట మరొకడు లేడు. అంటే, ఒక దశలో ద్రష్టలుగా తెలిసే దేహేంద్రియ మనోబుద్ధులు, మరొక దశలో దృశ్యా లవుతున్నాయి. ఉపద్రష్ట యైన ఆత్మ మాత్రం సదా ద్రష్టయే గాని, ఏ స్థితి లోనూ దృశ్యం కాదు. అది కూడా ఏ విధమైన సంబంధము, సంపర్కము లేని ద్రష్టగా ఉంటుంది. దృశ్య సంబంధం లేనిదై శోభిస్తుంది.

**స య త్రత్ర కించి త్పశ్య త్యనన్వాగత స్తేన భవ త్యసఙ్గో హ్యయం పురుషః !**

కార్యకరణాలకు సమీపముగా ఉన్న ఉపద్రష్ట వాటిలో ఏది చూచినా, దానితో చేరకుండా చూస్తూ ఉంటాడు. కనుక ఉపద్రష్ట యైన పురుషుడు అసంగుడు అన్నది వేదం.

**అనుమన్త**

అనుమన్త అంటే అనుమతించే వాడు, లేదా ఆమోదించే వాడు అని అర్థము ***(అనుమన్తా చ అనుమోదనమ్ అనుమననమ్).*** దేహేంద్రియ మనోబుద్ధులు వాటి వాటి పనులలో నిమగ్నమై ఉంటే, వాటిని బౌసనక, కాదనక



సాక్షిగా వీక్షించే వాడు అనుమన్త. విలక్షణంగా అతడు వీక్షిస్తూ ఉంటే, ఆయా కార్యాలను సమ్మతించినాడా! ఆమోదించినాడా! అన్నట్లు ఉంటుంది. వాస్తవానికి అతడు అసంగుడు. విలక్షణుడు. కనుక సాక్షిగా వీక్షిస్తాడే గాని నివారించే ప్రయత్నం చేయడు ***(ప్రవృత్తాన్ స్వ వ్యాపారేషు తత్సాక్షి భూతః కదాచిదపి న నివారయతి ఇతి అనుమన్తా).***

**భర్త**

భరించే వాడు భర్త. భర్త భార్యను పోషించినట్లు కార్యకరణ సంఘాతాన్ని పోషించే వాడు కావడం చేత క్షేత్రజ్ఞుడు, లేదా పురుషుడు భర్త. తాను ఆధారంగా ఉండటం చేతనే క్షేత్రము ప్రకాశిస్తూ, ప్రవర్తిస్తూ ఉంది. అందుచేత, పురుషుడు భర్త.

***క్షేత్రస్య అధిష్ఠానత్వేన భరణాత్ భర్తా*** - క్షేత్రానికి సత్తా స్ఫూర్తులను ప్రసాదించి, అధిష్ఠాన స్వరూపంగా క్షేత్రాన్ని పోషించే వాడు కావడం చేత తాను భర్త. భరణీయముల కంటే భర్త భిన్నమైన వాడు కాన, భర్త యైన పురుషుడు ప్రకృతి రూపమైన క్షేత్రానికి అన్యమైన వాడుగా తెలుస్తున్నాడు.

**భోక్త**

అగ్నికి ఉష్ణము ఎలా సహజమో, ఆత్మకు నిత్య చైతన్య స్వరూపము అలా సహజము. అగ్ని యొక్క ఉష్ణత్వం సమీపంలో ఉన్న వస్తువులకు సంక్రమించి, అవి కూడా వేడిగా మారినట్లు, అంటే అగ్ని వాటిని ఆశ్రయించినట్లు; ఆత్మ యొక్క నిత్య చైతన్య స్వరూపము సమీపములో ఉన్న అచేతన మైన బుద్ధిని ఆశ్రయించి, బుద్ధి లోని సుఖదుఃఖ మోహాత్మకము లైన వృత్తులను కూడా వ్యాపిస్తుంది. అందుచేత ఆత్మ భోక్త అని చెప్ప బడింది.

**మహేశ్వరుడు**

ఆత్మ సర్వాత్మకము. స్వతంత్రము ***(సర్వాత్మత్వాత్ స్వతంత్రత్వాచ్చ).*** ఇలా మహత్తైనది, నియంత అయినది కావడం చేత ఆత్మ మహేశ్వరుడని చెప్పబడింది ***(మహాన్ ఈశ్వరశ్చ ఇతి మహేశ్వరః).***

**పరమాత్మ**

అవిద్యా కల్పితమైన దేహాది బుద్ధ్యంత వికారాలకు ఉపద్రష్టగా ఉంటూ, ప్రత్యగాత్మగా శోభిస్తూ, ఉత్కృష్టమై ఉండటం చేత ఆత్మ పరమాత్మ అనబడింది. ఈ పరమాత్మ దేహము నందే ఉన్నాడు ***(సః అన్తః పరమాత్మా).*** ఆత్మయే బ్రహ్మము అని మహావాక్య నిర్ణయము కనుక ***(అయమాత్మా బ్రహ్మ).*** ఆత్మయే పరమాత్మ శబ్దం చేత చెప్పబడ్డాడు.

ఇక్కడ వాక్యార్థ విశేషం కూడా ఉంది. పిండస్థ మైన క్షేత్రజ్ఞుణ్ణి ***త్వం*** పద శోధన క్రమంలో 'ఉపద్రష్ట', 'అనుమన్త', 'భర్త', 'భోక్త' అనే మొదటి నాలుగు విశేషణాల ద్వారా చెప్పి, బ్రహ్మాండమైన చైతన్యమును ***తత్*** పద శోధన ప్రక్రియలో 'మహేశ్వరుడు', 'పరమాత్మ' అనే చివరి రెండు విశేషణాల ద్వారా ప్రవచించి, ***తత్త్వమసి*** వాక్య బోధను కూడా ఇక్కడ ఆవిష్కరించడం జరిగింది. ***క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి*** అని ప్రారంభించి ప్రసంగించిన విషయం ఇక్కడ సమాప్త మౌతూ ఉంది.

**య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥** 23

**యః-ఏవం-వేత్తి-పురుషం-ప్రకృతిం-చ-గుణైః-సహ**
**సర్వథా-వర్తమానః-అపి-న-సః-భూయః-అభిజాయతే**

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు | సః | = వాడు |
| ఏవం | = ఈ విధంగా | సర్వథా | = అన్ని విధాల |
| పురుషం | = పురుషుని | వర్తమానః అపి | = ప్రవర్తిస్తున్నా కూడా |
| గుణైః సహ | = గుణములతో గూడ | భూయః | = తిరిగి |
| ప్రకృతిం చ | = ప్రకృతిని | న అభిజాయతే | = పుట్టడు |
| వేత్తి | = తెలుసుకుంటున్నాడో | | |

**అర్జునా! క్షేత్రజ్ఞుడైన పురుషుని, గుణాలతో కూడిన ప్రకృతిని తెలుసుకున్న వాడు వ్యవహారంలో ఎలా ప్రవర్తించినా తిరిగి పునర్జన్మను పొందడు.**

**వ్యాఖ్య**

క్షేత్రజ్ఞుని స్వరూపమును, ప్రభావమును విస్తారముగా వివరించిన భగవంతుడు, అట్టి జ్ఞాన వైభవము యొక్క ఫలమును చివరగా ఈ శ్లోకంలో చెబుతున్నాడు.

జ్ఞేయ స్వరూపంగా తెలియబడిన క్షేత్రజ్ఞుని తన స్వరూపం గానే తెలుసుకొని, నేనే ఈ పురుషుణ్ణి **(అయమహ మస్మి)** అని సాక్షాత్కారమును పొందిన వాడు, అలాగే వికారయుత మైన క్షేత్రమును గూర్చి కూడా సమగ్రముగా తెలుసుకున్న వాడు, జ్ఞానోత్ప త్త్యనంతరము ఏ విధమైన జీవితమును కొనసాగించినా, **(సర్వథా సర్వ ప్రకారేణ వర్తమానః అపి)** తన విద్వద్దేహము పతనమైన తరువాత, తిరిగి జన్మించి మరొక శరీరమును ధరించడు **( స భూయః పునః పతితే అస్మిన్ విద్వ ఛ్ఛరీరే దేహాంతరాయ నాభిజాయతే నోత్పద్యతే).** క్షేత్ర క్షేత్రజ్ఞ స్వరూప జ్ఞానము సంపూర్ణంగా పొందిన వారు జన్మల నుండి విడిపడి తరించి పోతున్నారు అనేది ఫలశ్రుతి.

తేజము తిమిరాన్ని అదృశ్యం చేసినట్లు, విద్య అవిద్యను, అవిద్యా కార్యాలను కూడా అంతం చేస్తుంది. జన్మ అనేది కూడా అవిద్యా కార్యమే కనుక కారణమైన అజ్ఞాన నాశము జరిగిన తరువాత, కార్యాలైన జన్మాదులు సంభవించే అవకాశము లేదు.

జన్మ అనేది కర్మలతో ముడిపడి ఉంటుంది. కర్మ ఫలానుభవానికే జీవుడు జన్మలను పొందుతాడు. నేను క్షేత్రజ్ఞుణ్ణి, నేనే బ్రహ్మమును అనే జ్ఞానము ప్రాప్తించిన కారణంగా **(బ్రహ్మ అహ మితి విజ్ఞానాత్),** కలలో ఆచరించిన కర్మల యొక్క ఫలితాలు నిద్ర నుండి మేల్కొన్న వానిని అంటనట్లు **(యథా స్వప్న కర్మవత్ ప్రబోధాత్),** జ్ఞానిని కర్మలు, కర్మఫలాలు స్పృశించ లేవు. కర్మలు, కర్మఫలాలు ప్రకృతికి సంబంధించినవే గాని, పుట్టుక లేని ఆత్మకు సంబంధించినవి కావు కదా! ఇక జ్ఞాని వ్యవహార మంటారా? దేహము తాను కాదని తెలుసుకున్న ఆత్మవిదునికి ఉపాధియే లేనందున వ్యవహారము కూడా ఉండదు. చూచే వారి దృష్టిలో ఆత్మవిదుడు వ్యవహారంలో ఉన్నట్లు కనిపించినా, ఆత్మజ్ఞాని అకర్త గానే శోభిస్తాడు. చేసినా చేయని వాడే. స్వప్నద్రష్ట లాగా దేనినీ అంటని వాడే.

జ్ఞానప్రాప్తి జరిగిన తరువాత, వ్యవహారంలో కర్తృత్వము గోచరించినా, అది జ్ఞానికి సంబంధించినది కాదు. అది బాధిత కర్తృత్వము. అగ్నిలో కాలిన విత్తనము లాంటిది. కాలిన బీజాలు ఎలా తిరిగి మొలకెత్త లేవో, దగ్ధమైన అవిద్యా కామ్య కర్మ బీజాలు కూడా జన్మలకు, తద్వారా సంసారానికి కారణం కాలేవు.

**బీజా న్యగ్న్యుప దగ్ధాని న రోహన్తి యథా పునః ।**
**జ్ఞాన దగ్ధై స్తథా క్లేశైః ఆత్మా సంపద్యతే పునః ॥**



'అగ్నిలో కాలిన బీజాలు తిరిగి ఎలా మొలకెత్తవో, అలాగే అజ్ఞానము దగ్ధమై క్లేశము లన్నీ నశించిన తరువాత, ఆత్మ తిరిగి జన్మించదు' అని మహాభారతము - అరణ్యపర్వము.

*అట్టి అద్భుత దర్శనార్థము సాధనోపాయాలను చెబుతున్నాడు.*

ధ్యానే నాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ **24**

**ధ్యానేన-ఆత్మని-పశ్యంతి-కేచిత్-ఆత్మానం-ఆత్మనా**
**అన్యే-సాంఖ్యేన-యోగేన-కర్మయోగేన-చ-అపరే**

| | | | |
|---|---|---|---|
| కేచిత్ | = కొందరు | అన్యే | = మరి కొందరు |
| ధ్యానేన | = ధ్యానము చేత | సాంఖ్యేన | = జ్ఞాన సంబంధమైన |
| ఆత్మని | = ఆత్మ యందు | యోగేన | = యోగము చేత |
| ఆత్మనా | = ఆత్మ చేత | అపరే | = ఇతరులు |
| ఆత్మానం | = ఆత్మను | కర్మయోగేన చ | = కర్మయోగము చేతను |
| పశ్యంతి | = చూస్తున్నారు | పశ్యంతి | = చూస్తున్నారు |

**అర్జునా! కొందరు ధ్యానాన్ని అవలంబించి శుద్ధ బుద్ధి కలిగి, ఆత్మను హృదయంలో దర్శిస్తారు. కొందరు జ్ఞానయోగం చేత, మరి కొందరు కర్మయోగం చేత ఆత్మను దర్శిస్తారు.**

**వ్యాఖ్య**

**ధ్యాన జీవనము**

కొందరు ధ్యాన మనే అంతరంగ సాధన చేత శుద్ధి పడిన బుద్ధిలో ఆత్మను దర్శిస్తారు. ***వివిక్త దేశే చ సుఖాసనస్థః*** అని గీత - ఆరవ అధ్యాయంలో చెప్పినట్లు, ***ఏకాంతే సుఖ మాస్యతాం పరతరే చేతః సమాధీయతాం*** - ఏకాంతములో సుఖంగా ఆసీనులై పరమాత్మ యందే చిత్తాన్ని నిలపాలి అని శ్రీ శంకరులు సాధన పంచకంలో చెప్పినట్లు, ధ్యానాసనంపై కూర్చుని, బహిర్ముఖమై శబ్దాది విషయాల వైపు పరుగులు తీసే శ్రోత్రాది ఇంద్రియాలను నిగ్రహించి, అంతర్యంలో ఏకాగ్రతతో చింతించడమే ధ్యానము. నిరభ్యంతరంగా సాగే సరళ చింతనము.

ధ్యానము అనేది కేవలం మానస వ్యాపారము. అన్య సంకల్పాలను అరికట్టి, కేవలం బ్రహ్మాకార వృత్తినే కొనసాగించే సరళ చింతనము. విజాతీయ రహిత సజాతీయ వృత్తి ప్రవాహ రూప బ్రహ్మవిషయ మానస వ్యాపారము. కనుక, ధ్యాన మనేది తైలధార లాగా ఉండాలి అన్నది శాస్త్రం.

**ధ్యాయతీవ బకః ధ్యాయ న్తీవ పర్వతాః** - కొంగ ధ్యానం చేస్తున్నట్లు ఉంది. పర్వతాలు ధ్యానం చేస్తున్నట్లు ఉన్నాయి అనే ఉపమానాలు అలాగే ప్రాచుర్యాన్ని పొందాయి.

కొంగ గట్టుపై కూర్చుని, నీటిలో చలించే చేపనే తదేకంగా చూస్తూ ఉంటుంది. ఆ క్షణంలో తన లక్ష్య మైన మత్స్యము తప్ప మరొకటి కొంగకు కనిపించదు. అలాగే ధ్యానయోగి మనస్సును తన లక్ష్య మైన పరబ్రహ్మము నందే ఉంచుతాడు, అలా ఉంచాలి అనేది దృష్టాంతము.

ఇక పర్వతము అంటే, చలించదు అని అర్థము. దేహమును పర్వతం లాగా చలించకుండా నిలిపి, మనస్సును బకము వలె లక్ష్యము నందే స్థిరం చేసి ధ్యానయోగులు బుద్ధిలో ఆత్మను దర్శిస్తారు.

ధ్యానం వల్ల అంతఃకరణ నైశ్చల్యము ఏర్పడుతుంది. శ్రవణ సంస్కార జన్యమైన జ్ఞానము నిశ్చలమై, నిర్మలమైన బుద్ధి యందు ధ్యాన సమయంలో స్థిరపడి, సమస్త దృశ్యమాన క్షేత్రమును ప్రకాశింప చేస్తున్న నిర్విశేష పరిపూర్ణ పరబ్రహ్మమును దర్శింప చేస్తుంది. ఈ విధంగా ధ్యానయోగులు ఆత్మదర్శనం చేస్తారు.

**జ్ఞానదృష్టి**

ధ్యానయోగులు శుద్ధ బుద్ధి చేత హృదయంలో ఆత్మదర్శనం చేస్తే, మరి కొందరు సాంఖ్యయోగులై ఆత్మదర్శనం చేస్తారు ***(అన్యే సాంఖ్యేన యోగేన).*** గుణాలన్నీ క్షేత్ర సంబంధ మైనవి. అవన్నీ నాకు దృశ్యాలు. నేను ద్రష్టను. దృశ్యాలకు విలక్షణమైన వాణ్ణి. సాక్షిని అని ఆత్మానుచింతనము సాగించే జ్ఞానసాధనే సాంఖ్యము. నేను అకర్తను. అభోక్తను. అవస్థాత్రయ సాక్షిని అని సదా ఎరుక కలిగి ఉండటము సాంఖ్యము. ఈ విధమైన జ్ఞానము ఆత్మను సాక్షాత్కరింప చేసి, సంసారమును నశింప చేయడం చేత దీనిని సాంఖ్యము అన్నారు.

**చిత్తశుద్ధి**

కొందరు ధ్యానం చేత, కొందరు సాంఖ్య యోగము చేత ఆత్మదర్శనము చేస్తూ ఉంటే, మరి కొందరు కర్మయోగులై ఆత్మదర్శన మార్గంలో చరిస్తూ ఉంటారు. ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలను ఆచరించడం చేత శుద్ధి పడిన బుద్ధి ఇటు ధ్యానయోగానికి ఉపకరిస్తుంది, అటు సాంఖ్య మార్గంలో జ్ఞానోత్పత్తికి కూడా సహకరిస్తుంది. ఈ విధంగా జ్ఞాన సహకారి అయిన కర్మయోగం ద్వారా కొందరు ఆత్మదర్శనం చేస్తారు.

ఏదైనా, అర్హతను బట్టే ఆచరణలు సాగాలి. సాధనలు కొనసాగాలి. ఎవరి అర్హతను వారు అవలోకించుకొని, వారికి అనుగుణమైన సాధనా మార్గంలో వారు చరించాలి. మార్గానుసరణము అనేది అధికారి భేదాన్ని బట్టే గాని, సాధనా వైశిష్ట్యాన్ని బట్టి కాదు.

*ఈ మూడు సాధనలలో ఏ ఒక్క దానిని కూడా ఆచరించ లేని వారి విషయ మేమిటి? వినండి.*

**అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతి తరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥** 25

***అన్యే-తు-ఏవం-అజానంతః-శ్రుత్వా-అన్యేభ్యః-ఉపాసతే***
***తే-అపి-చ-అతి-తరంతి-ఏవ-మృత్యుం-శ్రుతిపరాయణాః***

| | | | |
|---|---|---|---|
| అన్యే తు | = కొందరు | ఉపాసతే | = ఉపాసిస్తున్నారు |
| ఏవం | = ఈ విధంగా | శ్రుతిపరాయణాః | = శ్రవణాసక్తు లయిన |
| అజానంతః | = గ్రహించలేని వారై | తే అపి చ | = వారు కూడా |
| అన్యేభ్యః | = ఇతరుల వలన | మృత్యుం | = మృత్యువును |
| శ్రుత్వా | = ఆలకించి | అతితరంతి ఏవ | = దాటుతునే ఉన్నారు |

**అర్జునా! ఈ విధంగా గ్రహించలేని వారు ఇతరుల ద్వారా విని ఉపాసన కొనసాగిస్తారు. శ్రవణాసక్తులు కావడం చేత వీరు కూడా మృత్యువును దాటుతారు.**

**వ్యాఖ్య**

పూర్వ శ్లోకంలో మనం తెలుసుకున్న మూడు సాధనలను చేయుటకు వివేకం లేని వారు ***(వివేక రహితాః)***, కేవలం పరుల ఉపదేశము వందే ప్రమాణ బుద్ధి గలవారై ***(కేవలం పరోపదిష్ట ప్రమాణకాః)***, వారు



ఎలా చెబితే అలా శ్రద్ధతో సాధన చేస్తారు. వీరిని శ్రుతి పరాయణులు అన్నారు. అంటే శ్రవణాసక్తి కలవారు అని అర్థము. పెద్దల ఆప్తవాక్యాలను ఔదల దాల్చి, భక్తి శ్రద్ధలతో ఆచరించే ఈ పుణ్యాత్ములు కూడా మృత్యువును దాటుతారు.

ఎవరు ఎలా ఉన్నారో, ఎక్కడ ఉన్నారో, అలా ఉండటం, అక్కడ ఉండటం వారికి ఇష్టం లేక పోవచ్చు. కానీ, ఎవరు ఉండవలసిన చోట వారు ఉన్నారు, ఎవరు ఉండవలసిన విధంగా వారు ఉన్నారు అనే సత్యాన్ని కష్టపడి అయినా అర్థం చేసుకోక తప్పదు.

ధ్యానయోగ్యత, జ్ఞానదృష్టి, కర్మయోగము మొదలైన సాధనలు తెలియని వివేక హీనులను గూర్చి ఈ శ్లోకం ముచ్చటిస్తూ ఉంది. యోగ్యత లేదని అయోగ్యులుగా పడి ఉండటం యుక్తమా? యోగ్యత లేకుండా ఎందు కున్నామో అర్థం చేసుకోదగిన విషయమే గాని విచారించ దగిన విషయం కాదు. యోగ్యత లేదు కదా అని అయోగ్యులుగా పడి ఉండటమే నిజానికి మ్రింగుడు పడని విషయం.

యోగ్యత లేకపోయినా యోగ్యులుగా జీవించాలని, జీవించి తరించాలని భావించే పుణ్యాత్ములనే ఈ శ్లోకంలో 'శ్రుతి పరాయణులు' అన్నారు. తమకు వివేకం లేకపోయినా, వివేకం గల వారు ఉపదేశించిన విషయాల్ని ప్రసాదంగా స్వీకరించి, శ్రద్ధాభక్తులతో ఆచరించే భక్తులు, ఒక దశలో భగవత్కృపకు పాత్రులై, భగవదనుగ్రహాన్ని పొంది తరిస్తారు.

భాగవతంలో ధ్రువుడు పరమేశ్వరుని దర్శనం పొందిన తరువాత కూడా, మహాత్ముల సాంగత్యాన్ని కోరుతూ, వారి ప్రబోధాలను ఆలకించాలనే శ్రవణాసక్తితో సజ్జన మైత్రిని వాంఛిస్తూ శ్రీహరిని ప్రార్థించాడు.

చ॥ *హరి భజనీయ మార్గ నియతాత్మకులై భవదీయ మూర్తిపై*
*వఱలిన భక్తి యుక్తు లగు వారల సంగతి గల్ల జేయు స*
*త్పురుష సుసంగతిన్ వ్యసన దుస్తర సాగర మప్రయత్నతన్*
*సరస భవత్కథామృత రసంబున మత్తుడనై తరించెదన్!*

'హే భగవంతా! శ్రీహరీ! పవిత్రాత్ములై నీ భక్తి మార్గమున అవిచ్ఛిన్న మైన ఆసక్తితో భక్తి చేయు మహాత్ములతో నాకు సాంగత్యాన్ని ప్రసాదించు. వారి సహచర్య ప్రభావం చేత నీ కథామృతాన్ని మనసారా పానం చేసి, పరవశించి, సంసార సాగరాన్ని దాటి తరిస్తాను' అన్నాడు భాగవతము - చతుర్థ స్కంధములో ధ్రువ కుమారుడు.

శ్రుతి పరాయణులై ధ్రువ ప్రహ్లాదాది భక్తులు తరించారు. శబరి, గజేంద్రుడు, గోపికలు మొదలైన వారెందరో శ్రుతి పరాయణులయ్యే తరించారు.

ఈ సందర్భములో శ్లోకం లోని ***తేఽపి*** అనే చోట కనిపిస్తున్న ***అపి*** - 'కూడా' అనే శబ్ద స్వారస్యమును అవలోకించాలి. వివేకం లేకపోయినా శ్రద్ధాసక్తులు కలిగి, శ్రుతి పరాయణులైన వారు కూడా ***(అపి)*** తరిస్తారు అన్నప్పుడు, ఇక వివేకవంతులై, ప్రమాణ విషయము నందు విచార సమర్థులైన వారు తరిస్తారని ప్రత్యేకంగా చెప్ప వలసిన అవసర ముందా? అనేది ***అపి*** శబ్దార్థము.

*క్షేత్రజ్ఞ ఈశ్వర ఏకత్వమును గూర్చిన జ్ఞానం అమృతత్వాన్ని ప్రసాదిస్తుందని చెప్పుకున్నాం (13 వ అ - 12 వ శ్లో). దానికి హేతువు ఏమిటో చెబుతున్నాడు.*

**యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజఙ్గమమ్ ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ ॥** 26

**యావత్-సంజాయతే-కించిత్-సత్త్వం-స్థావర జంగమం**
**క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్-తత్-విద్ధి-భరతర్షభ**

| | | | |
|---|---|---|---|
| భరతర్షభ | = అర్జునా! | సంజాయతే | = పుడుతున్నదో |
| స్థావరజంగమం | = స్థావరజంగమ రూపమైన | తత్ | = అది |
| సత్త్వం | = వస్తువు | క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ | = క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము వలననే |
| యావత్ కించిత్ | = ఏ కొంచెము | విద్ధి | = తెలుసుకో! |

**అర్జునా! స్థావర జంగమాత్మక మైన వస్తువు ఏది జనించినా, అది క్షేత్ర క్షేత్రజ్ఞుల కలయిక వల్లనే పుడుతున్న దని తెలుసుకో!**

### వ్యాఖ్య

ప్రకృతి పురుషుల సంబంధమే దుఃఖ హేతువైన సంసారానికి కారణము అని తెలుసుకున్నాం. కనుక ప్రకృతి పురుషుల స్వరూప వివేకమే సంసార నివృత్తికి కారణ మని తెలుస్తూ ఉంది. సంసారము అవిద్యా కల్పితము కనుక, మోక్షము విద్య తోనే ప్రాప్తము. ఈ విషయాన్ని నిశ్చయించి నిర్ధారణ చేయడానికి సంసార ప్రవృత్తి నివృత్తి రూపమైన జ్ఞానము నంతటిని ఇక ఈ అధ్యాయాంతం వరకు చర్చించడము జరుగుతుంది.

'అర్జునా! స్థావర జంగమాత్మక మైనది ఏది పుట్టినా, అది క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగము వల్లనే జరుగుతూ ఉంది' అన్నాడు భగవంతుడు.

సంయోగము అంటే సంబంధము. మరి, క్షేత్ర క్షేత్రజ్ఞుల సంబంధము ఎలాంటి సంబంధము? అనేది ముందుగా అర్థం కావాలి.

క్షేత్ర క్షేత్రజ్ఞుల సంబంధము సంయోగ సంబంధమా? లేక సమవాయ సంబంధమా?

కుండకు త్రాడుకు ఉన్న సంబంధము సంయోగ రూప సంబంధము. అంటే, అవయవాల కలయిక వల్ల ఏర్పడే సంబంధము. అలాంటి సంయోగ రూప సంబంధము క్షేత్ర క్షేత్రజ్ఞుల మధ్య సంభవించే అవకాశం ఉందా? క్షేత్రజ్ఞుడు ఆకాశము వలె అవయవ రహితుడు. క్షేత్ర మేమో సావయవము. సావయవ నిరవయవములకు సంబంధము అసాధ్యము. కనుక, క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంయోగ రూప సంబంధము కుదిరే ప్రసక్తి లేదు.

ఇక రెండవది సమవాయ సంబంధము. రెండిటి మధ్య కార్యకారణ భావము ఉన్నప్పుడు అది సమవాయ సంబంధము అనిపించు కుంటుంది. తంతు పటములకు కారణ కార్య సంబంధము ఉంది కనుక అది సమవాయ సంబంధము. దారానికి, వస్త్రానికి కారణ కార్య సంబంధ మున్నట్లు, క్షేత్ర క్షేత్రజ్ఞులలో కార్య కారణ సంబంధం ఉందా? ఉంటే, ఏది కార్యము? ఏది కారణము? కనుక, క్షేత్ర క్షేత్రజ్ఞుల మధ్య సమవాయ సంబంధము కూడా లేదు.

క్షేత్ర క్షేత్రజ్ఞుల మధ్య ఏ విధమైన సంబంధము ఉండటం చేత సంసారము ప్రాప్తించిందో, ఆ సంబంధ మేదో తెలిస్తే దానిని తొలగించుకొని సంసారాన్ని నివృత్తి చేసుకోవచ్చు.

సంయోగ, సమవాయ సంబంధాలు క్షేత్ర క్షేత్రజ్ఞుల మధ్య ఉండేందుకు అవకాశమే లేదని తెలుసుకున్నాం. మరి ఏ సంబంధం ఉంది? సంయోగ సమవాయ సంబంధాల కంటే వేరుగా సంబంధమే లేదు.

క్షేత్రము దృశ్యము; క్షేత్రజ్ఞుడు ద్రష్ట. క్షేత్రము జ్ఞేయము; క్షేత్రజ్ఞుడు జ్ఞాత. క్షేత్రము జడము, అప్రకాశము; క్షేత్రజ్ఞుడు చైతన్యము, ప్రకాశ స్వరూపము. క్షేత్రము వికారి; క్షేత్రజ్ఞుడు అవికారి. క్షేత్రము అనిత్యము; క్షేత్రజ్ఞుడు



నిత్యుడు. క్షేత్రము సావయవము; క్షేత్రజ్ఞుడు నిరవయవము. క్షేత్రము అనేకము; క్షేత్రజ్ఞుడు ఏకము. ఈ విధంగా పరస్పర విరుద్ధమైన స్వరూపాలతో పరస్పర విలక్షణంగా గోచరిస్తున్న క్షేత్ర క్షేత్రజ్ఞుల మధ్య సంబంధము ఎలా పొసగుతుంది? మరి, సంబంధము వల్లనే సంసారము ప్రాప్తించింది అన్నప్పుడు, అట్టి సంసార నివృత్తికి సంబంధము తొలగాలి కదా? మరి సంబంధమే అర్థం కానపుడు దానిని తొలగించుకొనేది ఎలా? ఒక విధంగా చెప్పాలంటే, క్షేత్ర క్షేత్రజ్ఞుల మధ్య అర్థం గాని సంబంధమే ఉంది. అంతుపట్టని సంబంధమే ఉంది. అదే మిథ్యా రూప సంబంధము. కల్పిత సంబంధము. అధ్యాస రూప సంబంధము.

### అన్యోన్యాధ్యాస

***అధ్యాసో నామ అతస్మిన్ తద్బుద్ధిః*** - 'అది కాని దాని యందు అది అనే బుద్ధి అధ్యాస' అని ఆచార్యుల వారి బ్రహ్మసూత్ర భాష్యము. త్రాడు ఉంది. పాము ఉంది. ఇవి పరస్పర విరుద్ధ మైన ధర్మాలతో ఉన్నాయి. రజ్జుసర్పాలకు ఏ విధమైన సంబంధమూ లేదు. అయినా, వాటిని వేరు వేరుగా గుర్తించక పోవడం చేత, త్రాడును పాము అని భావించి భ్రమిస్తున్నాము. అలాగే ముత్యపు చిప్ప ఉంది. వెండి ఉంది. ఆ రెండిటిని వేరు వేరుగా గుర్తించక పోవడం చేత ముత్యపు చిప్పను వెండి అని భ్రమిస్తున్నాము. వాటికి సంబంధించిన వివేక జ్ఞానము లోపించడం చేత ఈ విధమైన అధ్యాస, అంటే 'అది కాని దాని యందు అది అనే బుద్ధి' కలుగుతూ ఉంది. ఒక దాని లక్షణాలను మరొక దాని యందు ఆరోపించడం జరుగుతూ ఉంది ***(రజ్జు శుక్తికాదీనాం తద్వివేక జ్ఞాన అభావాత్ అధ్యారోపిత సర్పరజతాది సంయోగవత్)***. రజ్జు శుక్తికాలకు సంబంధించిన జ్ఞానం లోపించడం చేత సర్ప రజతాలను వాటి యందు ఆరోపించడం జరిగింది. ఇదే అధ్యాస. ఈ సంబంధమే అధ్యాస రూప సంబంధము; లేదా మిథ్యారూప సంబంధము; లేదా కల్పిత తాదాత్మ్య సంబంధము.

క్షేత్ర క్షేత్రజ్ఞులు కూడా భిన్న స్వభావాలతో ఉన్నారు. క్షేత్రము తెలియబడుతూ ఉంది కనుక అది విషయము. క్షేత్రజ్ఞుడు తెలుసుకొనే వాడు అయినందున అతడు విషయి. ఇరువురు పరస్పర విరుద్ధమైన ధర్మాలతో తెలుస్తూ ఉన్నారు ***(క్షేత్ర క్షేత్రజ్ఞయోః విషయ విషయిణోః భిన్న స్వభావయోః ఇతరేతర తద్ధర్మ అధ్యాస లక్షణః సంయోగః)***. క్షేత్ర క్షేత్రజ్ఞులను వేరు వేరుగా తెలుసుకోక పోవడం చేత, వాటి స్వరూపానికి సంబంధించిన జ్ఞానం లేకపోవడం చేత, క్షేత్ర ధర్మాలను క్షేత్రజ్ఞుని యందు, క్షేత్రజ్ఞుని ధర్మాలను క్షేత్రము నందు ఆరోపిస్తున్నాము. ఒక దాని లక్షణాలను మరొక దానిలో పరస్పరం ఆరోపించడం అన్యోన్యాధ్యాస. ఇదే సంసార హేతువు.

క్షేత్రజ్ఞుని ధర్మాలైన సత్తా స్ఫురణలను క్షేత్రము నందు ఆరోపించి 'నేను దేహము' అంటూ క్షేత్ర ధర్మాలైన దుఃఖ ద్వైతాలను క్షేత్రజ్ఞుని యందు ఆరోపించి, 'నేను పుట్టాను'; 'నేను చస్తాను' అని పలుకుతూ, ఈ విధమైన కల్పిత తాదాత్మ్య సంబంధము ద్వారా సంసారాన్ని తయారు చేసుకుంటున్నాము. అలా కాకుండా, ఉపాధి విశేషాలను దూరం చేసి, జ్ఞేయమైన క్షేత్రజ్ఞుని యథార్థ స్వరూపాన్ని తెలుసుకోవాలి. ఇది సత్యజ్ఞానము. సత్య జ్ఞానము మిథ్యా జ్ఞానానికి విరుద్ధ మైనది కావడం చేత, తేజము తిమిరాన్ని హరించినట్లు, సత్యజ్ఞానము మిథ్యా జ్ఞానమును, అది కల్పించిన సంసారాన్ని సమూలంగా నిర్మూలిస్తూ ఉంది.

*అవిద్యను అంత మొందించే సమ్యగ్దర్శనాన్ని చెబుతున్నాడు.*

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।** 27
**వినశ్య త్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥**

**సమం-సర్వేషు-భూతేషు-తిష్ఠంతం-పరమేశ్వరం**
**వినశ్యత్సు-అవినశ్యంతం-యః-పశ్యతి-సః-పశ్యతి**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వేషు | = | సమస్తములైన | అవినశ్యంతం | = | నశించని వానినిగా |
| భూతేషు | = | భూతముల యందు | యః | = | ఎవడు |
| సమం | = | సమముగా | పశ్యతి | = | చూస్తున్నాడో |
| తిష్ఠంతం | = | ఉన్న | సః | = | వాడు |
| పరమేశ్వరం | = | పరమేశ్వరుని | పశ్యతి | = | చూస్తున్నాడు |
| వినశ్యత్సు | = | నశిస్తున్న వాటిలో | | | |

**అర్జునా! సమస్త భూతాలలో సమంగా విలసిల్లుతూ, దేహాలు నశించి పోతున్నా పరమేశ్వరుడు నశించకుండా ఉన్నాడు. ఆ దివ్యాత్ముని ఎవడు చూస్తాడో వాడే నిజమైన చూపు కలవాడు.**

### వ్యాఖ్య

అవిద్య వలన ఏర్పడిన క్షేత్ర క్షేత్రజ్ఞుల కల్పిత మిథ్యా రూప సంబంధమే జన్మకు కారణ మని అర్థ మయింది. సమ్యగ్దర్శన కారణంగా అవిద్య అంతరించి సంసారము నశిస్తుంది అని కూడా స్పష్ట మయింది. సంసార బీజాలను దగ్ధం చేసి జన్మరాహిత్యానికి కారణమయ్యే సమ్యగ్దర్శనాన్ని ఇప్పుడు వివరిస్తున్నాడు.

అర్జునా! సర్వభూతాలలో సమంగా ఉంటూ, దేహాలు నశిస్తున్నా **(వినశ్యత్సు)** నశించని పరమేశ్వరుని ఎవడు చూస్తున్నాడో **(యః పశ్యతి)** వాడే నిజమైన చూపు గలవాడు అని సమ్యగ్దర్శన వైభవాన్ని వర్ణిస్తున్నాడు భగవంతుడు. అదే క్షేత్రజ్ఞ దర్శనం.

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు** - సర్వ క్షేత్రాలలో ఉండే క్షేత్రజ్ఞుణ్ణి నన్నుగా తెలుసుకో అని రెండవ శ్లోకంలో ప్రసంగించాడు. ఆ విషయాన్నే ప్రస్తుత శ్లోకంలో ధృవపరుస్తూ క్షేత్రజ్ఞ ఈశ్వరుల ఏకత్వాన్ని నిరూపిస్తున్నాడు. అక్కడ **సర్వ క్షేత్రేషు** అన్నాడు. ఇక్కడ **పరమేశ్వరం** అంటున్నాడు. అలా అనడంలో క్షేత్రజ్ఞునికి, పరమేశ్వరునికి మధ్య అభేదాన్ని దర్శింప చేస్తూ, సమ్యగ్దర్శనాన్ని ఆవిష్కరిస్తున్నాడు.

### పరమేశ్వర దర్శనం

క్షేత్రమును ఉపాధిగా కలవాడు క్షేత్రజ్ఞుడు. మాయను ఉపాధిగా కలవాడు ఈశ్వరుడు. క్షేత్రానికి ప్రభువు క్షేత్రజ్ఞుడు. మాయా జగత్తుకు ప్రభువు ఈశ్వరుడు. నియంత్రించి పాలించే శక్తి గల ప్రభువు ఈశ్వరుడు **(ఈశన శీలః)**. కానీ, సృష్టిలో పాలించే ప్రభువులు అనేక మంది కనిపిస్తారు. సృష్టికర్త యైన బ్రహ్మదేవుడు ప్రభువే. అలాగే లోకాలను పాలించే దేవతలూ ప్రభువులే. ఈ లోకంలో రాజ్యాలు పాలించే వారు కూడా ప్రభువులే. అందరికీ కొద్దోగొప్పో ఈశ్వరత్వం ఉంది. కానీ, ఈ విధమైన ప్రభువులకు, పరమాత్మకు తేడా ఉంది. ఈశన శీలత్వం అందరిలో అగుపిస్తున్నా, వారు పరిమిత శక్తిమంతులు. పరమాత్మ లాగా అనంతులు కారు. ఈ తేడాను సూచించడానికే ఈ శ్లోకంలో పరమేశ్వర దర్శనం చేయిస్తున్నాడు గీతాచార్యుడు.

**పరమశ్చ అసౌ ఈశన శీలశ్చ ఇతి పరమేశ్వరః** - పరమేశ్వరుడు అంటే, పాలించే సామర్థ్యము (ఈశన శీలత్వం) కలవాడు మాత్రమే కాదు. ఆయన పరముడు, అనగా అనంతుడు కూడా. అందుచేతనే ఆయన పరమేశ్వరు డయ్యాడు. అట్టి అనంతుడైన పరమేశ్వరుడు నశించే దేహాలలో ఉన్నా నశించే వాడు కాడు **(వినశ్యత్సు అవినశ్యన్తం)**.



### సమత్వం - అవినాశిత్వం

సర్వ భూతాలలో నిర్విశేషంగా ఉండటం చేత పరమేశ్వరుడు 'సముడు' ***(సమం నిర్విశేషం)***. నశించే దేహాలలో ఉన్నా నశించే వాడు కానందున ఆయన 'అవినాశి'. కాలగతాలు నశిస్తాయి. అనంతుడైన పరమేశ్వరుడు కాల పరిచ్ఛేదము లోకి రాడు కనుక ఆయన నశించే వాడు కాడు. అవినాశి.

దేహాలన్నీ నశించే స్వభావం కలవి. అవి ప్రకృతి సంబంధ మైనవి కనుక వికారం చెందుతూ నశిస్తాయి. పరమేశ్వరుడు నశించే వాడు కాడు అంటే, దేహాల వలె వికారం చెందేవాడు కాడు అని అర్థము.

భావ వికారా లన్నిటికీ పుట్టుక మూలం. అలా పుట్టిన తరువాత నశించే వరకు అనేక వికారాలు చోటు చేసుకుంటాయి. చివరి భావ వికారము వినాశము. పరమేశ్వరునికి వినాశము లేదు అంటే చివరి వికారము లేదు అని అర్థము. చివరి వికారము లేదు అని చెప్పడం చేత, దానికి ముందున్న వికారాలు కూడా లేవని చెప్పి నట్లైంది ***(అన్త్య భావ వికార అభావ అనువాదేన పూర్వ భావినః సర్వే భావ వికారాః ప్రతిషిద్ధా భవన్తి!)***. అందుచేత వికార రహితుడైన పరమేశ్వరునికి నిర్విశేషత్వం చెప్పబడింది. అదే సమం.

పరమేశ్వరుడు సముడు. సర్వ వికారములు లేనివాడు కావడం చేత ఆయన సముడు. సదా, అంటే సర్వ కాలాలలో సముడు ***(సర్వ కాలేషు సర్వ వికార రహితత్వాత్ సమః)***. మార్పులు, లేదా వికారాలన్నీ ప్రకృతి సంభవాలు. క్షేత్ర ధర్మాలు. పరమేశ్వరుడు ప్రకృతికి విలక్షణుడు కావడం చేత ఆయన వికార రహితుడు. అవినాశి. సమరూపుడు. సమరూపుడైన పరమేశ్వరుడు సర్వభూతాలలో ఉన్నందున, పరమేశ్వరుడు ఎవరో కాదు, క్షేత్రజ్ఞుడే. సర్వ క్షేత్రాలలో సముడై ప్రకాశించే అట్టి పరమేశ్వరుని దర్శనమే సమ్యగ్దర్శనము.

### సమదర్శనమే సత్య దర్శనము

క్షేత్రము నశించినా నశించని వాడు క్షేత్రజ్ఞుడు. ప్రకృతి నశించినా నశించని వాడు పురుషుడు. ప్రపంచము లేకపోయినా ఉండేవాడు పరమేశ్వరుడు. ప్రపంచానికి పరమాత్మ ఆధారము. ప్రపంచము, లేదా ప్రకృతి ఆరోపము. క్షేత్రజ్ఞునిలో క్షేత్ర ధర్మాలను ఆరోపించినట్లు, పరమాత్మ స్వరూపము నందు ప్రపంచాన్ని ఆరోపించడం జరిగింది.

రజ్జువు నందు సర్పము ఆరోపించ బడింది. ఇదే మిథ్య, లేదా మాయ. అధిష్ఠానమైన రజ్జు దర్శనంతో ఆరోపమైన సర్పము అదృశ్య మవుతుంది. అధిష్ఠానమైన రజ్జువును చూడటం సత్యదృష్టి. అధ్యస్త మైన సర్పమును చూడటము మిథ్యా దృష్టి. నామరూపాల దృష్టి.

మట్టిపాత్ర లన్నీ నామరూపాలే. వాటికి ఆధారమైన మృత్తికను దర్శించడమే సత్యదృష్టి. నామరూపాలతో గోచరించే మట్టిపాత్ర లన్నీ మిథ్యారూపాలే. నామరూపాలతో కనిపించే కుండలకు పుట్టుక ఉంది. కనుక నాశము కూడా ఉంది. నశించే కుండలలో నశించకుండా ఉండేది మట్టే. అదే సత్యం. అదే సమం **(మృత్తికేత్యేవ సత్యమ్)**.

మట్టికుండ ఉంది. కళ్ళున్న వారందరూ దానిని చూస్తారు. కళ్ళున్న వారు కుండను చూస్తారు. కానీ, జ్ఞాననేత్ర మున్నవారు మాత్రమే కుండగా ఉన్న మట్టిని దర్శిస్తారు. కుండను కుండగా చూచేవాడు చూపు గలవాడు. కుండను మట్టిగా చూచేవాడు నిజమైన చూపు గలవాడు. సత్యదృష్టి గలవాడు. సమదృష్టి గలవాడు. ఇదే జ్ఞానదృష్టి. ఇదే సమ్యగ్దర్శనము. ఏకత్వమును దర్శించడము సత్యదర్శనము; అద్వైత దర్శనము. అనేకత్వమును దర్శించడము మిథ్యా దర్శనము; ద్వైత దర్శనము. ఆత్మను మాత్రమే సర్వత్ర సమంగా దర్శించే వాడు నిజ దర్శనం చేసే వాడు ***(ఆత్మానం యః పశ్యతి స ఏవ పశ్యతి)***. అలా కాకుండా అన్యములను దర్శించే

వాడు చూచినా చూడని వాడే **(పశ్యన్నః అపి న పశ్యన్ని)**. గగనంలో ఒకే చంద్రుని దర్శించే వాడే సత్యద్రష్ట. నేత్ర రోగము చేత విపరీతంగా అనేక చంద్రులను చూచేవాడు చూచినా చూడని వాడే **(పశ్యన్నః అపి న పశ్యన్ని విపరీత దర్శిత్వాత్ అనేక చంద్ర దర్శివత్ ఇత్యర్థః)**. ఇదే ద్వైత చత్వారము.

సమ్యగ్దర్శనానికి ఫలమును ప్రవచించిన భగవానుడు దానిని స్తుతి చేస్తున్నాడు.

> సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।
> న హిన స్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ 28

**సమం-పశ్యన్-హి-సర్వత్ర-సమవస్థితం-ఈశ్వరం**

**న-హినస్తి-ఆత్మనా-ఆత్మానం-తతః-యాతి-పరాం-గతిం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వత్ర | = | అంతట | ఆత్మనా | = | ఆత్మ చేత |
| సమం | = | సమముగా | న హినస్తి | = | హింసింపడో |
| సమవస్థితం | = | ఉన్నటువంటి | తతః | = | తరువాత |
| ఈశ్వరం | = | ఈశ్వరుని | పరాం | = | ఉత్తమమైన |
| పశ్యన్ హి | = | చూచుచున్న వాడై | గతిం | = | స్థానమును |
| ఆత్మానం | = | తనను | యాతి | = | పొందుతున్నాడు |

**అర్జునా! సర్వత్ర సమంగా ఉన్న పరమేశ్వరుని దర్శించే వాడు తనను తాను హింసించుకోడు. అందుచేత ఉత్తమగతిని పొందుతాడు.**

### వ్యాఖ్య

సమస్త భూతాలలో సమంగా ఉంటూ, అవినాశిగా శోభిస్తున్న పరమేశ్వరుని దర్శించు వాడు నిజమైన చూపు గల వాడు, సత్యదృష్టి గల వాడు అని పూర్వ శ్లోకంలో సమదర్శిని మనం దర్శించాము. సర్వులలో పర్వేశ్వర దర్శనం చేయడము అంటే, తనలో కూడా తనను తాను సర్వేశ్వరునిగా దర్శిస్తున్నాడు అని అర్థము. అప్పుడే అతడు సమదర్శి అవుతాడు. అప్పుడే అతనిది సమదృష్టి అవుతుంది. అలా కాకుండా, తనను తాను వేరు చేసుకుని, తనకు అన్యమైన దంతా పరమేశ్వరుడు అని దర్శించే వాడు ద్వైత దర్శనం చేస్తున్నాడే గాని సమదర్శనం చేయడం లేదు. ఇది భేద దృష్టి, భేద దర్శన మౌతుందే గాని సమ్యగ్దర్శనం కానే కాదు. ఎంతటి పవిత్రుడైనా, మహాత్ముడైనా, ద్వైతి దారి తప్పేది ఇక్కడే. అంతా పరమేశ్వరుడే, అందరిలో పరమేశ్వరుడే, కానీ, నేను మాత్రం ప్రత్యేకంగా, ఈశ్వర భిన్నంగా ఉన్నాను అని భావించడమే ద్వైత భ్రాంతి. ఈ భ్రాంతి ఉన్నంత వరకు మనిషికి దుఃఖం తప్పదు, సుఖం సమీపించదు.

బాధను భరించడం, హింసను సహించడం ఎవరి కైనా కష్టమే. ఇతరులు బాధించినా, తనను తాను బాధించుకున్నా బాధ బాధే. హింస హింసే. ఇతరులు మనల్ని హింసిస్తే మనం బాధ పడతాము. అలాగని, మనల్ని మనం హింసించుకుంటే సుఖ పడతామా? ఆలోచించండి. కనుక, పూర్వ శ్లోకంలో మనం చూచిన సమదర్శనం జరగనంత వరకు ప్రతి ఒక్కరు తమను తాము హింసించుకొనే వారే. గమ్యాన్ని చేర లేక చతికిల బడే వారే.

సర్వులలో **(సర్వత్ర)** సమంగా **(సమం)** ఉన్న పరమేశ్వరుని **(సమవస్థితమ్ ఈశ్వరమ్)** ఎవడు దర్శిస్తాడో అతడు తనను **(ఆత్మానమ్)** తన చేత **(ఆత్మనా)** హింసించుకోడు **(న హినస్తి)**. అందుచేత **(తతః)** ఉత్తమ గతిని పొందుతాడు **(పరాంగతిం యాతి)**. ఇది శ్లోకార్థము.



### ఆత్మ హింస

తనను తాను చంపుకోవడం ఆత్మహత్య అయితే, తనను తాను హింసించుకోవడం ఆత్మహింస అవుతుంది. ఎవరైనా తమను తాము హింసించు కుంటారా? పరులను హింసిస్తారు అంటే అర్థం చేసుకోవచ్చు. తమను తాము హింసించుకోవడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఇది చాలా నిర్హేతుకంగా, అయుక్తంగా కనిపిస్తుంది. ఎవడు కూడా తనను తాను హింసించుకోడు **(న ఏవ కశ్చిత్ ప్రాణీ స్వయం స్వమ్ ఆత్మానం హినస్తి)**. అలా అవకాశం లేని దానిని ప్రస్తావించడం, ప్రాప్తం కాని దానిని నిషేధించడం అయుక్తం. దోషం. దీనినే శాస్త్రంలో 'అప్రాప్త ప్రతిషేధము' అంటారు. అప్రసక్త మైన హింసను ప్రతిషేధించడము అప్రాప్త ప్రతిషేధము అనే దోషం క్రిందికే వస్తుంది కదా! అనేది శంక.

ఈ విధమైన పూర్వ పక్షానికి ఆధారము లేక పోలేదు. దేవతార్చన ముగిసిన తరువాత, పూజానంతరము నిర్మాల్యాన్ని భూమిపై పడేయ కూడదు అంటే అర్థం చేసుకోగలం. ఆకాశంలో, స్వర్గంలో కూడా పడేయ కూడదు అన్నా రనుకోండి. దానిని ఎలా అర్థం చేసుకోవాలి? అలా పడేసే అవకాశమే లేనపుడు, దానిని నిషేధించే ప్రసంగము అప్రస్తుతం కాదా? అయుక్తం కాదా? అనేది పూర్వ పక్షానికి ఆధారమైన తర్కము. అలాగే తనను తాను హింసించుకోవడం అనేది ఉండదు కనుక, అభావాన్ని ప్రసంగించడం అప్రాప్త ప్రతిషేధము అనే దోషం క్రిందికి రాదా? అనేది సందేహము.

రానే రాదు. ఈ విధమైన దోషం లేనే లేదు. ఎలా లేదో కూడా తెలుసుకుందాం. పూర్వ శ్లోకంలో మనం చూచిన పరమేశ్వరుని సమరూపము ఆత్మయే కదా! ఈ విధమైన జ్ఞానం లేని వారు, అంటే అజ్ఞానులు ఆత్మ దర్శనం చేయలేక పోతున్నారు కదా! అట్టి అజ్ఞానులు ఆత్మను తిరస్కరిస్తున్నారా లేదా? **(అజ్ఞానామ్ ఆత్మ తిరస్కర ణోపపత్తేః!)**. ఇది ఆత్మహననం కాదా? తొందర పడకండి. ఇక్కడ మరి కొంత అర్థం కావలసి ఉంది. ఆత్మను గుర్తించి దర్శించ లేని అజ్ఞానులు ఆత్మదర్శనం అసలే చేయకుండా ఉన్నారా? చేస్తున్నారు. ఎలా? అనాత్మను ఆత్మగా దర్శిస్తున్నారు. అంటే, దేహాన్ని ఆత్మగా భావిస్తున్నారు. అవునా? కావచ్చు. అంత మాత్రాన అందులో తప్పే ముంది? ఆత్మ అనంతము కదా! దేహము కూడా ఆత్మే కదా! అలాంటప్పుడు దేహమును ఆత్మగా దర్శించడం దోష మెలా అవుతుంది? అవుతుంది. అదీ దోషమే అవుతుంది. ఎలాగో వినండి.

దేహము ఆత్మే అనడంలో ఏ మాత్రము విరోధము లేదు. కానీ అనంతాత్మ అంత మయ్యే దేహము కాదు అని తెలియక పోవడం దోషం. ఇప్పుడు అర్థమైంది అనుకుంటాను. ఇది అర్థం కాక, అనాత్మ యైన దేహమే ఆత్మ అని భావించే అజ్ఞానులు, ధర్మాధర్మాలను ఆచరించి, ఇటువంటి మిశ్రమ కర్మఫలంగా సాధించుకొనిన దేహాన్ని (ఆత్మను) చంపుకొని, మరొక నూతన మైన దేహాన్ని (ఆత్మను) పునర్జన్మలో పొందుతున్నారు. మళ్ళీ దానిని చంపుకొని వేరొక దానిని పొందుతున్నారు. ఈ విధంగా మళ్ళీ మళ్ళీ దేహాన్ని పొందుతూ, మళ్ళీ మళ్ళీ చంపుకుంటూ పోవడం ఆత్మహింస కాదా? ఆత్మహత్య కాదా? ఆత్మహననము కాదా? కనుక ప్రతి అజ్ఞాని ఆత్మ హింస చేసుకుంటూనే ఉన్నాడు **(ఇత్యేవమ్ ఉపాత్తమ్ ఉపాత్తమ్ ఆత్మానం హన్తీతి ఆత్మహా సర్వః అజ్ఞః)**. ఇలా చూచినపుడు సమ్యగ్దర్శనం అలవడని అవిద్వాంసు లందరూ ఆత్మ ఘాతకులే. దేహమును ఆత్మగా భావించి, దేహ హింసకు పాల్పడుతున్న వారే. అటు పారమార్థికంగా చూచినా, సత్యాత్మ దర్శనం చేయలేక ఆత్మను కూడా హింసించిన వారే అవుతున్నారు.

### ఆత్మదర్శనం

ఆత్మహింస చేసే వారికి భిన్నంగా, ఎవరైతే సర్వత్ర సమరూపుడైన పరమాత్మను దర్శిస్తున్నాడో, అతడు

రెండు విధాల ఆత్మను హింసించని వాడు అవుతున్నాడు. ఇటు అనిత్యమైన దేహాత్మను హింసించడం లేదు. అటు నిత్యమైన సత్యాత్మనూ హింసించడము లేదు **(ఆత్మదర్శీ ఉభయ థాఽ పి ఆత్మనా ఆత్మానం న హినస్తి).** అందుచేత అతడు ఉత్తమగతిని పొందుతున్నాడు. అంటే, మోక్షరూప మైన ఫలాన్ని అందుకుంటున్నాడు **(తతః యాతి పరాంగతిమ్, యథోక్తం ఫలం తస్య భవతి ఇత్యర్థః).**

సమ్యగ్దర్శన ఫలంగా తనను తాను హింసించుకోడు అని చెప్పిన వాదము సమంజస మేనా? విభిన్నమైన గుణ కర్మలతో, పుణ్య పాప కర్మల నాచరించి, విభిన్న ఫలాల ననుభవిస్తూ అనేక దేహాలలో అనేకాత్మలు గోచరించే టప్పుడు సమ్యగ్దర్శనము ఎలా సాధ్యం?

**ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।** 29
**యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి ॥**

**ప్రకృత్యా-ఏవ-చ-కర్మాణి-క్రియమాణాని-సర్వశః**
**యః-పశ్యతి-తథా-ఆత్మానం-అకర్తారం-సః-పశ్యతి**

| | | | |
|---|---|---|---|
| సర్వశః | = సర్వ విధముల | అకర్తారం | = కర్త గాని వానినిగా |
| ప్రకృత్యా ఏవ చ | = ప్రకృతి చేతనే | యః | = ఎవడు |
| కర్మాణి | = కర్మలు | పశ్యతి | = చూస్తున్నాడో |
| క్రియమాణాని | = చేయబడు చున్నవిగా | సః | = వాడు |
| తథా | = అటులనే | పశ్యతి | = చూస్తున్నాడు |
| ఆత్మానం | = తనను | | |

**అర్జునా! సమస్త కర్మలను ప్రకృతే చేస్తూ ఉంది. ఆత్మ కర్త కాదు. ఇలా చూచే వాడే సత్యాన్ని చూచే వాడు.**

**వ్యాఖ్య**

కర్మలన్నీ ప్రకృతి సంభవాలు. ప్రకృతి వశాలు. కర్త లేకుండా కర్మ జరగదు. ***అహం కర్తా అహంకారః*** - నేను చేస్తున్నాను అనే అహంకారమే, అహంబుద్ధియే కర్త. జడ రూపాలైన దేహేంద్రియ మనోబుద్ధులు కర్మలను ఆచరించ లేవు. బుద్ధి జడము. ఆత్మస్ఫూర్తి లేకుండా బుద్ధి కర్త కాలేదు. కనుక ఆత్మ లేనిదే కర్త లేడు. అలాగని ఆత్మ కర్త కాదు. ఆత్మలో కర్తృత్వము కనిపించడం లేదు.

ఆత్మ కర్తే అయితే, కర్తృత్వము లేకుండా ఉండ లేదు. సుషుప్తిలో ఏ విధమైన కార్యాలు సాగడం లేదు. అక్కడ కర్తృత్వము దర్శనీయం కావడం లేదు. కానీ, సుషుప్తిలో ఆత్మ ఉందా, లేదా? ఆత్మ సుషుప్తిని కూడా ప్రకాశింప చేస్తూ ఉంది. ఆత్మ గనుక కర్త అయ్యేట ట్లైతే, సుషుప్తిలో ఆత్మ ఉంది కనుక, ఆత్మలో కర్తృత్వము కనిపించాలి. సుషుప్తిలో కూడా కర్మలు సాగుతూ ఉండాలి. కానీ, అలా జరగడం లేదు. ఎందుకో తెలుసా! సుషుప్తిలో కర్త మైన బుద్ధి లేకపోవడం వల్ల. అంతేగాని, ఆత్మ లేక పోవడం వల్ల కాదు. సుషుప్తిలో ఆత్మ ఉంది. కానీ అకర్తగా ఉంది. అందుకే ఆత్మను ఉపద్రష్ట అని చెప్పుకున్నాం ( *13 వ అ - 22 వ శ్లో* ).

**మాయా కార్యాలు**

**అర్జునా!** అంతట **(సర్వశః)** కర్మలు **(కర్మాణి)** ప్రకృతి చేతనే **(ప్రకృత్యైవ)** చేయబడు తున్నాయి **(క్రియ మాణాని)** అంటున్నాడు భగవంతుడు.

ప్రకృతి అంటే త్రిగుణాత్మకమైన మాయ **(మాయాం తు ప్రకృతిం విద్యాత్ -** శ్వేతాశ్వతరోపనిషత్తు).



కార్య కారణాలన్నీ మాయాధీనాలే. ప్రకృతియే కార్య కారణ రూపంలో వ్యాపించి ఉంది కనుక, ప్రకృతే కర్మలను చేస్తూ ఉంది. కార్యకారణాలకు ప్రకృతియే హేతువుగా ఉందని ఈ అధ్యాయం లోనే చెప్పుకున్నాం ( *20 వ శ్లో* ). కనుక కర్మలన్నీ ప్రకృతికి సంబంధించినవే. విజ్ఞానాత్మ యైన బుద్ధియే కర్త. బుద్ధి కూడా ప్రకృతి లోనిదే. బుద్ధి కూడా క్షేత్ర సంబంధ మైనదే. పరమాత్మ సన్నిధిలో, ఆయన అధ్యక్షతలో ప్రకృతి కర్మ ప్రవాహంలో నిమగ్నమై ఉంది ( *9 వ అ - 10 వ శ్లో* ). కానీ చైతన్యాత్మ అకర్త గానే, అభోక్త గానే శోభిస్తూ ఉంది. ఈ సత్యాన్ని దర్శించిన వాడే సమదర్శి.

**సాక్షీ చైతన్యం**

ఆత్మను అకర్తగా, కర్మసాక్షిగా తెలుసుకున్న వాడు కర్మల చేత బంధింప బడడు. క్షేత్ర ధర్మాలైన కర్మలను సాక్షిగా వీక్షించే చైతన్య స్వరూపుడే క్షేత్రజ్ఞుడు. అకర్తగా భాసించే వాడు. సర్వోపాధి రహితుడు. ఇలా ఎవడు తెలుసుకుంటాడో అతడే పరమార్థమును దర్శించిన వాడు ***(ఆత్మానమ్ క్షేత్రజ్ఞమ్, అకర్తారం సర్వోపాధి వివర్జితం పశ్యతి సః పరమార్థ దర్శీ).*** ఆకాశంలో భేద దర్శనం ఎలా సాధ్యం కాదో, ఆకాశాని కన్నా సూక్ష్మతర మైన సాక్షీ చైతన్యంలో భేదమును దర్శించడము సాధ్యము కాదని, అభేదమే దర్శనీయ మని ఎరిగిన వాడు.

*అభేద మైన అఖండాత్మ దర్శనాన్ని వివరిస్తున్నాడు.*

**యదా భూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి ।** 30
**తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా ॥**

***యదా-భూతపృథగ్భావం-ఏకస్థం-అనుపశ్యతి***
***తతః-ఏవ-చ-విస్తారం-బ్రహ్మ-సంపద్యతే-తదా***

| | | | |
|---|---|---|---|
| యదా | = ఎప్పుడు | అనుపశ్యతి | = చూస్తున్నాడో |
| భూతపృథగ్భావం | = ప్రాణుల వేర్వేరు భావమును | తదా | = అప్పుడు |
| ఏకస్థం | = ఏకస్థము గాను | బ్రహ్మ | = బ్రహ్మము |
| తతః ఏవ చ | = దాని వలననే | సంపద్యతే | = అవుతున్నాడు |
| విస్తారం | = విస్తారము గాను | | |

**అర్జునా! వేరు వేరుగా కనిపిస్తున్న సమస్త భూతములు ఒకే ఆత్మ యందు ఉన్నాయి. ఆత్మ వల్లనే విస్తరిస్తున్నాయి. ఇలా దర్శించే వాడు బ్రహ్మమే అవుతున్నాడు.**

**వ్యాఖ్య**

భూత ప్రాణులు అనేకంగా కనిపిస్తూ ఉన్నా ఆత్మ ఏకంగా, అద్వయంగా శోభిస్తూ ఉంది. అంటే, భేద రహితంగా ఉంది. ఏక మంటే అదే. పారమార్థిక దృష్టిలో సజాతీయ, విజాతీయ, స్వగత భేదాలు లేని స్వరూపమే ఆత్మ. అందుచేత ఆత్మ ఏకము ***(పరమార్థతః సజాతీయ విజాతీయ స్వగత భేద వినిర్ముక్తత్వాత్ ఏకః).*** కనుక, ఏకాత్మ అనంతాత్మగా ఉంది. అనంతాత్మలో భేదము దర్శనీయం కాదు. పృథక్త్వము (వేరు వేరుగా ఉండటము) ఊహ కందదు. పృథక్త్వం ఏకత్వానికి భిన్నం కనుక, భిన్నత్వ మనేది కల్పితమే గాని సత్యం కాదు. భిన్నత్వ మంతా మిథ్యా రూపమే. ఏకత్వమే సత్యం. ఆత్మ ఒక్కటే సత్యము. దానికి అన్యంగా కనిపించే దంతా మిథ్యా రూపమే ***(ఆత్మా సత్యం తదన్యత్ సర్వం మిథ్యేతి).***

### అద్వయాత్మ

కల్పితము అనేది ఏదైనా ఆరోపించ బడిందే. భూతముల పృథక్త్వము ఆత్మ యందు అలాగే కల్పితము. సముద్రంలో అలలు ఉన్నాయి. అల లన్నీ కల్పితాలు. సముద్రమే సత్యము. అల లన్నీ సముద్రంలో అభిన్నంగా ఉన్నట్లు, భూత ప్రాణు లన్నీ ఒకే ఆత్మలో ఉన్నాయి.

ఒక పొలానికి నాలుగు వైపుల గట్లను నిర్మించి, ఆ గట్ల మధ్య ఉన్న భూమి 'నాది' అంటారు. బాగుంది. మరి, పొలం గట్లు ఏమిటి? భూమి కాదా! గట్ల బయట విస్తరించి ఉన్నది భూమి కాదా? భూమి ఏకమే కదా! మరి అనేక పొలా లేమిటి? అదే కల్పితము, లేదా మిథ్య.

అల లన్నీ ఒకే సముద్రంలో ఏకమై ఉన్నట్లు, భూతాలన్నీ ఒక్క ఆత్మలో ఏకమై ఉన్నాయి. సముద్రం వల్లనే అలలు విస్తరించినట్లు, ఆత్మ వల్లనే భూతాలు విస్తరిస్తున్నాయి. వాస్తవానికి అదంతా సముద్రమే. అలాగే ఇదంతా ఆత్మే (**అత్మ ఏవ ఇదం సర్వమ్** - బృహదారణ్యాకం). ఇలా దర్శించే వాడు ఆత్మనే దర్శిస్తున్నాడు. ఆత్మను దర్శించే ఆత్మవిదుడు ఆత్మయే. ఆత్మయే బ్రహ్మము. ఇదే బ్రహ్మాత్మజ్ఞానము ***(అయమాత్మా బ్రహ్మ)***. ఈ విధంగా బ్రహ్మమును దర్శించే వాడు బ్రహ్మమే అవుతాడు ***(యః అనుపశ్యతి సః బ్రహ్మ సంపద్యతే బ్రహ్మైవ భవతి)***. ఎప్పుడు అవుతాడు? అప్పుడే అవుతాడు. ఏకమైన ఆత్మను ఎప్పుడు దర్శిస్తాడో, ఆ క్షణం లోనే బ్రహ్మ అవుతాడు. దానికి కాల వ్యవధి లేదు. ఏ విధంగా అయితే సూర్యోదయము - తమోపగమము ( వెలుగు వచ్చుట - చీకటి పోవుట) ఒకే కాలంలో జరుగుతాయో, అలాగే జ్ఞానోదయానికి - అవిద్యా చీకటి అంతరించడానికి మధ్య అంతరాల కాలము ఉండదు.

*ఏకమైన ఆత్మ సమస్త దేహాలలో ఉన్నా అసంగము గానే ఉంటుంది.*

**అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽ యమవ్యయః ।** 31
**శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే ॥**

***అనాదిత్వాత్-నిర్గుణత్వాత్-పరమాత్మా-అయం-అవ్యయః***
***శరీరస్థః-అపి-కౌంతేయ-న-కరోతి-న-లిప్యతే***

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = అర్జునా! | పరమాత్మా | = పరమాత్మ |
| అనాదిత్వాత్ | = అనాది యైనందున | శరీరస్థః అపి | = దేహము నందున్నను |
| నిర్గుణత్వాత్ | = నిర్గుణ మైనందున | న కరోతి | = చేయడు |
| అవ్యయః | = అవ్యయ మైనందున | న లిప్యతే | = అంటడు |
| అయం | = ఈ | | |

**అర్జునా! ఆత్మకు ఆది లేదు. గుణము లేదు. ఆత్మ నాశ మెరుగదు. దేహాలలో ఉన్నా ఆత్మ కర్మ చేయదు. కర్మకు అంటుకోదు.**

**వ్యాఖ్య**

ఉన్నవే మనకు తెలుస్తాయి. ప్రపంచం ఉంది. ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి. వాటిని మనం తెలుసు కుంటున్నాము. అలాగే పరమాత్మ ఉన్నాడు. పరమాత్మను కూడా తెలుసు కుంటున్నాము.

ప్రపంచము, పరమాత్మ ఇరువురూ ఉన్నట్లే తెలుస్తున్నా, వాటి మధ్య అంతరము ఎంతో ఉంది. ప్రపంచం ఉంది. ఉన్న ప్రపంచం నశిస్తూ ఉంది. ఇక్కడ అంతము గలవి తెలుస్తున్నాయి అంటే, అవి



ఆది కలవిగా ఉంటాయి. వాటి ఆది ఎప్పుడో, ఎక్కడో మనకు తెలియక పోయినా, అంతమును పొందు తున్నాయి కనుక, ఆది కలవి గానే ఉంటాయి. ప్రపంచంలో అన్నీ ఇలాగే తెలుస్తున్నాయి. పరమాత్మ ఒక్కడే వీటికి విలక్షణంగా ఆద్యంతాలు లేని వాడుగా తెలుస్తున్నాడు. అట్టి పరమాత్మను వర్ణిస్తూ, ***అయం*** అనే పదాన్ని ప్రయోగించాడు పరమేశ్వరుడు.

### నిత్యాత్మ

*అయం* అంటే ఇది. ఇది అనేది సామీప్యాన్ని సూచిస్తుంది. ఆత్మ కన్నా సమీప మైనది లేనందున ***(అయమాత్మా బ్రహ్మ) అయం*** అనేది ఆత్మను తెలియ చేస్తుంది. శ్లోకంలో పరమాత్మ శబ్దం ప్రయోగింప బడటం చేత ఆత్మే పరమాత్మ అని ద్యోతక మవుతూ ఉంది.

ప్రపంచం, ప్రపంచంలో మనకు తెలిసే వస్తువుల లాగా ఆత్మ నశించదు. అందుచేత అది అవ్యయము. మార్పు లేనిది, నశించనిది కావడం చేత ఆత్మ అవ్యయము ***(అయం అవ్యయః న అస్య వ్యయః విద్యతే ఇత్యవ్యయః)***. ఆత్మ అవ్యయ మైనది కనుక ఆది లేనిదై ఉండాలి.

ఆత్మకు ఆది లేదు. ఆది అంటే కారణము. దేని కైతే ఆది ఉంటుందో, అది కారణాన్ని కలిగి ఉంటుంది. కార్యంగా నిలిచి ఉంటుంది. కార్యము తన ధర్మం చేత మార్పు చెందుతూ ఉంటుంది. మార్పు చెందేది నశిస్తుంది. దేని కైతే కారణం లేదో అది అనాది. అది ఆత్మ ఒక్కటే. కనుక అనాదిత్వం గల ఆత్మ నశించదు ***(అనాదిత్వాత్ ఆదిః కారణం తత్ యస్య నాస్తి తత్ అనాది)***.

ఆత్మ ఎలా అవ్యయము, అనాదియో అలాగే నిర్గుణము. అంటే గుణాలు లేనిది. దేని కైతే గుణాలు ఉంటాయో, ఆ గుణాలు తొలగిపోయి నపుడు అది మార్పు చెందుతూ ఉంటుంది. ఆత్మ గుణాలు లేనిది కనుక అవ్యయము. అనాది, నిర్గుణము, అవ్యయము కావడం చేత ఆత్మ నిత్యము.

లేకుండా వచ్చినవి లేకుండా పోతాయి. ఆత్మకు పుట్టుక లేదు. ఆత్మ లేకుండా వచ్చింది కాదు కనుక పోకుండా ఉంటుంది. అదే ఆత్మ యొక్క నిత్యత్వము ***(ఆత్మా నిత్యః అజత్వాత్)***. అందుచేత ఆత్మకు అయ్య లేడు, అధికుడూ లేడు అన్నది శ్రుతిమాత ***(న తస్య కశ్చి జ్జనితా న చాధిపః)***.

### అసంగాత్మ

అవ్యయాత్మ అనంతము కనుక అది శరీరములో ఉన్నా సర్వగతమై ఉంటుంది. అందుచేత అది శరీరంలో ఉన్నా కర్మాచరణం లేకుండా ఉంటుంది. అకర్తగా ఉంటుంది. కర్మ చేసిన వాడిని ఫలం వరిస్తుంది. కర్మ చేయని వాడికి ఫలసంగం ఎలా ఉంటుంది? ***(అయం తు అకర్తా అతః న ఫలేన లిప్యతే)***. కనుక, దేహంలో ఉన్నా ఆత్మ కర్మ చేయదు ***(న కరోతి)***. కర్మ నంటదు ***(న లిప్యతే)***.

ఇంతకీ దేహంలో కర్మ చేసే దెవరు? కర్మ ఫలితంతో అంటుకొనే దెవరు? జీవుడు అంటారా? జీవుడు అంటే క్షేత్రజ్ఞుడే కదా! జీవుడు కర్మఫలాసక్తి కలవాడైతే, జీవేశ్వరైక్యం అసంభవం కదా! మరి ఈశ్వరుని కన్నా వేరుగా దేహి లేనపుడు, కర్మ చేసే దెవరో, కర్మ ఫలానుభోక్త ఎవరో చెప్పవలసి ఉంటుంది. భగవంతుడు బోధిస్తున్న ఈ ఉపనిషత్ సిద్ధాంతము దుర్విజ్ఞేయంగా ఉంది. అందుచేతనే వేదాంతము ప్రతిపాదించే ఈ ఆత్మతత్త్వాన్ని అర్థం చేసుకోలేక సాంఖ్యులు, వైశేషికులు, జైన బౌద్ధులు వేదాంత సిద్ధాంతాన్ని త్యజించారని శ్రీ శంకరులు అభిప్రాయ పడ్డారు ***(సర్వథా దుర్విజ్ఞేయం చేతి భగవత్రోక్షమ్ ఔపనిషదం దర్శనం పరిత్యక్తం వైశేషికైః సాంఖ్యార్హత బౌద్ధైశ్చ)***. కర్మలు, కర్తృత్వము, ఫలసంగము అనే విషయాలలో సృష్టిని కల్పిస్తూ, ***స్వభావస్తు ప్రవర్తతే*** అని ఐదవ అధ్యాయం - పద్నాల్గవ శ్లోకంలో భగవంతుడు ఈ సమస్యను పరిహరించే ఉన్నాడు.

కనుక, కర్తృత్వ భోక్తృత్వాలు అవిద్య చేత వ్యవహారంలో గోచరిస్తున్నాయే గాని, ఏకమైన అద్వయాత్మలో వాస్తవానికి అవి లేనే లేవు.

*ఆత్మ ఆచరించదు, అంటుకోదు. ఈ విషయానికి దృష్టాంతాన్ని చూపుతున్నాడు.*

**యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే ।**
**సర్వ త్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥** 32

**యథా-సర్వగతం-సౌక్ష్మ్యాత్-ఆకాశం-న-ఉపలిప్యతే**
**సర్వత్ర-అవస్థితః-దేహే-తథా-ఆత్మా-న-ఉపలిప్యతే**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వగతం | = | సర్వగతమైన | దేహే | = | దేహము నందు |
| ఆకాశం | = | ఆకాశము | సర్వత్ర | = | అంతటను |
| సౌక్ష్మ్యాత్ | = | సూక్ష్మ మైనందున | అవస్థితః | = | ఉన్నటువంటి దైన |
| యథా | = | ఎటుల | ఆత్మా | = | ఆత్మ |
| న ఉపలిప్యతే | = | అంటబడదో | న ఉపలిప్యతే | = | అంట బడదు |
| తథా | = | అటుల | | | |

**అర్జునా! అంతటా వ్యాపించి ఉన్నప్పటికీ, సూక్ష్మ మైనది కావడం చేత ఆకాశము దేనినీ అంటదు. అలాగే ఆత్మ అన్ని దేహాలలో వ్యాపించి ఉన్నా, దేనినీ అంటదు.**

వ్యాఖ్య

ఆత్మ ఏదీ చేయదు, దేని చేతనూ అంట బడదు. అది అసంగము అని పూర్వ శ్లోకంలో చెప్పిన విషయాన్ని ఆకాశ దృష్టాంతము ద్వారా విశదీకరిస్తూ, దార్ష్టాంతిక మందు సమన్వయిస్తున్నాడు.

ఆకాశము ఏకము. సూక్ష్మము. జగత్తంతా అది వ్యాపించి ఉన్నా, దేని చేతనూ అంట బడక నిర్మలంగా ఉంటుంది. పరిమిత మైన ఘటాదులలో ఉండి ఘటాకాశ మని పిలిపించుకున్నా, అది ఘటాదులకు పరిమితంగా లేదు.

కుండలో కల్లు నింపితే, కుండలో కల్లు వాసన వస్తుంది. అలాగని కుండ లోని ఆకాశానికి సురాగంధము అంటదు **(నభః ఘటయోగేన, తద్గత సురాగంధేన న లిప్యతే).**

వాస్తవానికి కుండలో ఆకాశం లేదు. ఆకాశం లోనే కుండ ఉంది. ఒక్క కుండే కాదు. అన్నీ ఆకాశం లోనే ఉన్నాయి. విశాలమైన ఆకాశము ఘటాదులకు పరిమితం కాదు. అన్నీ ఆకాశం లోనే ఊగుతున్నాయి. ఊరేగుతున్నాయి.

శీతాకాలము ఆకాశాన్నంతా పొగమంచు కప్పేస్తుంది. కానీ, ఆ పొగమంచు నిర్మలమైన ఆకాశాన్ని తడప లేదు. ఆకాశంలో భయంకరమైన ఉరుములు, మెరుపులు వినిపిస్తాయి, కనిపిస్తాయి. అంతమాత్రాన ఆకాశంలో ఎటువంటి మార్పు చోటు చేసుకోదు. ఆకాశం ముక్కలు కాదు. వానలు ఆకాశాన్ని తడప లేవు. ఎండలు ఆకాశాన్ని ఎండించ లేవు. అది సూక్ష్మ మైనది కావడమే ఆ విధమైన అసంగత్వానికి కారణము.

ఆత్మ ఆకాశం కన్నా సూక్ష్మము. అన్నీ ఆకాశంలో ఉన్నాయి. ఆకాశం ఆత్మలో ఉంది.

**ఘట సంవృత మాకాశం నీయమానే ఘటే యథా ।**
**ఘటో నీ యేత నాకాశః తద్వజ్జీవో నభో పమః ॥**



కుండను ఒక చోట నుండి మరొక చోటికి మనం తీసుకొని పోవచ్చు. అలా చెయడంలో కుండ పయనిస్తుందే గాని, కుండ లోని ఆకాశం పయనించదు. అలాగే కుండ పగిలిపోతే, కుండ లోని ఆకాశము నశించదు.

సర్వగతమై, సూక్ష్మమై, ఏకమైన ఆకాశము కుండలో ఉన్నంత మాత్రాన ఆ కుండ లోని కల్లు వాసన చేత ఎలా లిప్తము కాదో (అంటబడదో), అలాగే సర్వగతమై, సూక్ష్మాతి సూక్ష్మమైన అద్వయాత్మ దేహాదులలో ఉన్నంత మాత్రాన, ఉపాధి ధర్మాల చేత అంట బడదు ***(ఆత్మ ఉపాధి యోగేన తత్ ధర్మైః న లిప్యతే!).*** దేహం లోని క్షుత్పిపాసలకు, మనస్సు లోని రాగద్వేషాదులకు, శోకమోహాదులకు అంటకుండా ఆత్మ దేహంలో అసంగంగా భాసిస్తుంది.

*ఆకాశం వలె సర్వగతుడై పరమాత్మ ఎలా అసంగుడై ఉన్నాడో, అలాగే ఆదిత్యుని వలె ప్రకాశ రూపుడై క్షేత్రాన్ని ప్రకాశింప చేస్తున్నాడు.*

**యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః ।**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥** 33

**యథా-ప్రకాశయతి-ఏకః-కృత్స్నం-లోకం-ఇమం-రవిః**
**క్షేత్రం-క్షేత్రీ-తథా-కృత్స్నం-ప్రకాశయతి-భారత**

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | | ప్రకాశయతి | = | ప్రకాశింప చేస్తున్నాడో |
| భారత | = | అర్జునా! | తథా | = | అటుల |
| ఏకః | = | ఒక్కడైన | క్షేత్రీ | = | క్షేత్రజ్ఞుడు |
| రవిః | = | సూర్యుడు | కృత్స్నం | = | సమస్తమైన |
| ఇమం | = | ఈ | క్షేత్రం | = | క్షేత్రమును |
| కృత్స్నం | = | సమస్తమైన | ప్రకాశయతి | = | ప్రకాశింప చేస్తున్నాడు |
| లోకం | = | లోకమును | | | |
| యథా | = | ఏ విధంగా | | | |

**అర్జునా! ఈ సమస్త ప్రపంచాన్ని ఒకే సూర్యుడు ప్రకాశింప చేస్తున్నాడు. అలాగే ఈ సమస్త క్షేత్రాన్ని క్షేత్రజ్ఞుడొక్కడే ప్రకాశింప చేస్తున్నాడు.**

వ్యాఖ్య

ఈ అఖిల జగత్తును సూర్యు డొక్కడే ఎలా ప్రకాశింప చేస్తున్నాడో, ***మహాభూతాది ధృత్యన్తం*** - సమస్తాన్ని ఒకే జ్ఞేయ రూపుడైన పరమాత్మ ప్రకాశింప చేస్తున్నాడు.

పూర్వ శ్లోకంలో పరమాత్మ అస్తిత్వాన్ని, అంటే సద్రూపాన్ని వర్ణించి, ప్రస్తుత శ్లోకంలో పరమాత్మ యొక్క ప్రకాశత్వాన్ని, అంటే చిద్రూపాన్ని వర్ణిస్తున్నాడు.

***ఆకాశవత్ ఆత్మా అస్తి, ఆదిత్యవత్ ఆత్మా భాతి*** - ఆకాశం లాగా ఆత్మ అనంతంగా ఉంది. సూర్యుని లాగా ఆత్మ దివ్యంగా ప్రకాశిస్తూ ఉంది. సూర్యు డెలా స్వప్రకాశమో, ఆత్మ కూడా అలా స్వయం ప్రకాశమై విరాజిల్లుతోంది. ఆత్మ సత్తా స్ఫురణాత్మకము అని ఈ రెండు శ్లోకాలు చెబుతున్నాయి.

ప్రపంచంలో ఉన్న వన్నీ ఆకాశం లోనే ఉన్నాయి. కనుక ఆకాశము అస్తిత్వానికి ప్రతీకము. అలాగే ప్రకాశాలన్నీ సూర్యుని అనుసరించి ప్రకాశిస్తున్నాయి. కనుక భానుడు ప్రకాశత్వానికి ప్రతీకము.

ఆత్మ తాను స్వతస్సిద్ధంగా ఉంది. ఆకాశం కూడా ఆత్మను ఆశ్రయించుకొని ఉంది. ఆత్మ తాను స్వప్రకాశంగా ఉంది **(స్వయం భాతి)**. సూర్యుడు కూడా ఆత్మ ప్రకాశాన్ని ఆశ్రయించుకొని ప్రకాశిస్తున్నాడు.

అధ్యాయాన్ని సమాప్తం చేస్తున్నాడు.

**క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా ।** 34
**భూతప్రకృతి మోక్షం చ యే విదు ర్యాన్తి తే పరమ్ ॥**

**క్షేత్ర క్షేత్రజ్ఞయోః-ఏవం-అంతరం-జ్ఞానచక్షుషా**
**భూతప్రకృతి మోక్షం-చ-యే-విదుః-యాంతి-తే-పరం**

జ్ఞానచక్షుషా = జ్ఞానదృష్టిచే
ఏవం = ఈ రీతి
క్షేత్రక్షేత్రజ్ఞయోః = క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క
అంతరం = భేదమును
భూతప్రకృతి = భూతప్రకృతిని
మోక్షం చ = మోక్షమును
యే = ఎవరు
విదుః = తెలుసుకుంటున్నారో
తే = వారు
పరం = మోక్షమును
యాంతి = పొందుతున్నారు

**అర్జునా! ఈ విధంగా క్షేత్ర క్షేత్రజ్ఞుల భేదాన్ని, భూతప్రకృతుల మోక్షాన్ని జ్ఞాననేత్రం చేత ఎవరైతే తెలుసుకుంటారో, వారు పరమాత్మను పొందుతారు.**

**వ్యాఖ్య**

పరిణామశీలము, ప్రకాశ రహితము, వినాశ రూపము అయిన క్షేత్ర రూపాన్ని; పరిపూర్ణ యుతము, ప్రకాశైక స్వరూపము, అవ్యయ రూపము అయిన క్షేత్రజ్ఞ స్వరూపాన్ని జ్ఞాననేత్రం ద్వారా దర్శించే వారు పరమాత్మను పొంది తరిస్తారు.

శాస్త్ర ప్రమాణము, ఆచార్యోపదేశము వలన ప్రాప్తించి, స్వానుభవంలో నిలిచిన జ్ఞానమే ఇక్కడ జ్ఞాన నేత్రము **(జ్ఞాన చక్షుషా, శాస్త్రాచార్యోపదేశ జనితమ్ ఆత్మప్రాత్యయికం జ్ఞాన చక్షుః, తేన జ్ఞాన చక్షుషా)**. అట్టి జ్ఞాన చక్షువు చేత ముముక్షువు క్షేత్ర బంధం నుండి విడిపడి, క్షేత్రజ్ఞ జ్ఞానయుతుడై, పరమాత్మను పొందుతాడు. శాస్త్రము నందు, గురువు నందు అకుంఠిత విశ్వాసము (**శ్రద్ధ**) గల వారే అట్టి జ్ఞాన నేత్రాన్ని పొందుతారు. శ్రద్ధ గల వారే ఆత్మజ్ఞానాన్ని పొందుతారు (**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం**). ఈ విధంగా, మాయ నుండి విముక్తులై, మహిమలో తేజరిల్లే దివ్య స్థితిని ఈ క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము ప్రసాదిస్తుంది.

**ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం**
**యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగో నామ త్రయోదశోఽధ్యాయః**

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగ మనే పదమూడవ అధ్యాయము.**



# అకారాది శ్లోకానుక్రమణిక



## అష్టమాధ్యాయము



# అకారాది శ్లోకానుక్రమణిక



## నవమాధ్యాయము






# అకారాది శ్లోకానుక్రమణిక




## దశమాధ్యాయము



# అకారాది శ్లోకానుక్రమణిక



## ఏకాదశాధ్యాయము

| శ్లోకము | శ్లోక సంఖ్య | పుట |
|---|---|---|
| **అ** | | |
| అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా | 45 | 342 |
| అనాదిమధ్యాన్త మనన్తవీర్యం | 19 | 308 |
| అనేక బాహూదర వక్త్రనేత్రం | 16 | 302 |
| అనేక వక్త్రనయనమ్ | 10 | 297 |
| అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః | 26 | 317 |
| అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి | 21 | 311 |
| **ఆ** | | |
| ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో | 31 | 323 |
| **ఇ** | | |
| ఇ త్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా | 50 | 348 |
| ఇ హైకస్థం జగ త్కృత్స్నం | 7 | 294 |
| **ఏ** | | |
| ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య | 35 | 331 |
| ఏవ ముక్త్వా తతో రాజన్ | 9 | 296 |
| ఏవ మేత ద్యథాత్థ త్వమ్ | 3 | 288 |
| **క** | | |
| కస్మాచ్చ తే న నమేర న్మహాత్మన్ | 37 | 334 |
| కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో | 32 | 324 |
| కిరీటినం గదినం చక్రహస్తమ్ | 46 | 343 |
| కిరీటినం గదినం చక్రిణం చ | 17 | 303 |
| **త** | | |
| తతః స విస్మయావిష్టో | 14 | 300 |
| త త్రైకస్థం జగ త్కృత్స్నం | 13 | 300 |
| తస్మా త్ప్రణమ్య ప్రణిధాయ కాయం | 44 | 341 |
| తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ | 33 | 326 |
| త్వ మక్షరం పరమం వేదితవ్యం | 18 | 306 |
| త్వ మాదిదేవః పురుషః పురాణః | 38 | 335 |
| **ద** | | |
| దంష్ట్రా కరాలాని చ తే ముఖాని | 25 | 315 |
| ద్యావా పృథివ్యో రిద మన్తరం హి | 20 | 309 |
| దివ్య మాల్యామ్బరధరం | 11 | 298 |
| దివి సూర్య సహస్రస్య | 12 | 299 |
| దృ ష్ట్వేదం మానుషం రూపం | 51 | 349 |
| ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ | 34 | 330 |

| శ్లోకము | శ్లోక సంఖ్య | పుట |
|---|---|---|
| **న** | | |
| న తు మాం శక్యసే ద్రష్టుమ్ | 8 | 295 |
| నభః స్పృశం దీప్త మనేకవర్ణం | 24 | 314 |
| నమః పురస్తా దథ పృష్ఠ తస్తే | 40 | 337 |
| న వేదయజ్ఞాధ్యయనై ర్న దానైః | 48 | 346 |
| నాహం వేదై ర్న తపసా | 53 | 351 |
| **ప** | | |
| పశ్య మే పార్థ రూపాణి | 5 | 292 |
| ప శ్యాది త్యా న్వసూ న్రుద్రాన్ | 6 | 293 |
| పశ్యామి దేవాం స్తవ దేవ దేహే | 15 | 301 |
| పితాఽసి లోకస్య చరాచరస్య | 43 | 340 |
| **భ** | | |
| భక్త్యా త్వనన్యయా శక్యః | 54 | 352 |
| భవాప్యయౌ హి భూతానాం | 2 | 287 |
| **మ** | | |
| మత్కర్మకృ న్మత్పరమో | 55 | 355 |
| మదనుగ్రహాయ పరమం | 1 | 284 |
| మన్యసే యది తచ్ఛక్యం | 4 | 290 |
| మయా ప్రసన్నేన తవార్జు నేదం | 47 | 345 |
| మా తే వ్యథా మా చ విమూఢభావో | 49 | 347 |
| **య** | | |
| యథా నదీనాం బహవోఽమ్బువేగాః | 28 | 319 |
| యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గాః | 29 | 321 |
| య చ్చావహాసార్థ మసత్కృతోఽసి | 42 | 338 |
| **ర** | | |
| రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః | 22 | 312 |
| రూపం మహత్తే బహువక్త్రనేత్రం | 23 | 313 |
| **ల** | | |
| లేలిహ్యసే గ్రసమానః సమన్తాత్ | 30 | 322 |
| **వ** | | |
| వక్త్రాణి తే త్వరమాణా విశన్తి | 27 | 317 |
| వాయు ర్యమోఽగ్ని ర్వరుణః శశాఙ్కః | 39 | 336 |
| **స** | | |
| సఖేతి మత్వా ప్రసభం యదుక్తం | 41 | 338 |
| సుదుర్దర్శ మిదం రూపం | 52 | 350 |
| స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా | 36 | 333 |



# అకారాది శ్లోకానుక్రమణిక



## ద్వాదశాధ్యాయము

| శ్లోకము | శ్లోక సంఖ్య | పుట |
|---|---|---|
| **అ** | | |
| అథ చిత్తం సమాధాతుం | 9 | 396 |
| అథైత ద ప్యశక్తోఽసి | 11 | 402 |
| అద్వేష్టా సర్వభూతానాం | 13 | 407 |
| అనపేక్షః శుచి ర్దక్షః | 16 | 416 |
| అభ్యాసేఽ ప్యసమర్థోఽసి | 10 | 399 |
| **ఏ** | | |
| ఏవం సతతయుక్తా యే | 1 | 367 |
| **క** | | |
| క్లేశోఽధికతర స్తేషామ్ | 5 | 382 |
| **త** | | |
| తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ | 19 | 421 |
| తేషా మహం సముద్ధర్తా | 7 | 386 |
| **మ** | | |
| మయ్యావేశ్య మనో యే మాం | 2 | 370 |

| శ్లోకము | శ్లోక సంఖ్య | పుట |
|---|---|---|
| మయ్యేవ మన ఆధత్స్వ | 8 | 392 |
| **య** | | |
| యస్మా న్నోద్విజతే లోకో | 15 | 414 |
| యే తు ధర్మ్యామృత మిదం | 20 | 426 |
| యే తు సర్వాణి కర్మాణి | 6 | 386 |
| యే త్వక్షర మనిర్దేశ్యమ్ | 3 | 375 |
| యో న హృష్యతి న ద్వేష్టి | 17 | 418 |
| **శ** | | |
| శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ | 12 | 405 |
| **స** | | |
| సంనియ మ్యేన్ద్రియగ్రామం | 4 | 375 |
| సంతుష్టః సతతం యోగీ | 14 | 407 |
| సమః శత్రౌ చ మిత్రే చ | 18 | 421 |



# అకారాది శ్లోకానుక్రమణిక

## త్రయోదశాధ్యాయము